శ్రీరస్తు

# శతకంఠరామాయణము

అను నామాంతరముగల

# సీతావిజయము

మట్టసకవిప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.



[Price. Rs. 0—12—0

# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యము.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 1 | 0 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 10 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతోనున్నది | ... | 3 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 6 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది | | (అచ్చు) | |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 3 | 4 |
| ఆరణ్యపర్వము | ... | (అచ్చు) | |
| విరాటోద్యోగపర్వములు | ... | ,, | |
| భీష్మద్రోణపర్వములు | ... | ,, | |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | ,, | |
| శాంతిపర్వము | ... | 3 | 4 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక,స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 3 | 4 |
| [illegible] | ... | 6 | 4 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 12 |

శ్రీరస్తు.

# శతకంఠరామాయణము

అను నామాంతరముగల

# సీతావిజయము

మర్దనకవిప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1940

# పీ ఠి క.

---

సీతావిజయము, శతముఖ రామాయణము, శతకంధర రామాయణమునను మాఱుపేరులుగల యీరామాయణము మూఁడుప్రతులనుబట్టి సిద్ధము చేయఁబడినది. అందు మొదటిది ఆంధ్రపరిషత్పుస్తక భాండాగారములోని కాగితపుప్రతి. రెండవది తాళపత్రప్రతి. మూఁడవది విశాఖపట్టణపు ముద్రితప్రతి. పరిషత్ప్రతి, గోదావరి మండలములోని, అమలాపురము తాలూకాలోని అల్లవరములో గుబ్బల సుబ్బారాయఁడుగారు 1903 సంవత్సరమున వ్రాసినది. రెండవతాళపత్రప్రతి హేవిలంబి సం॥ ఫాల్గుణ బ ౧౮ లగాయతు విలంబి సం॥ చైత్ర శు ౧౨ వఱకు పత్స్యె పిచ్చెయ్యగారు వ్రాసినది. మూఁడవది 1904 సం॥ నచ్చుపడినది. ఈగ్రంథముయొక్క కర్తలనామములను గుఱించి కొంతవివాదమున్నది. తాళపత్రప్రతిలో, ముద్రితప్రతిలో, దొరతనమువారి పుస్తకభాండాగారములోని S/5-2-19 లోను మద్దయకవియనియు, పరిషత్ప్రతిలోను, దొరతనమువారి పుస్తక భాండాగారములోని K. 1-44 లోను లింగకవియనియు నున్నది. మఱియు నందేకల 12-1-37 లింగయ్య రంగయ్య కవులచే రచియింపఁబడినదని ముద్రితపట్టికలో నున్నది. కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కవులచరిత్రములో లింగకవి గంగకవి యను నిరువురుకవులు రచించినట్లుగలదు. కవులచరిత్రములోనివాక్యము లీక్రింద నిచ్చుచున్నారము.

"ఈయిరువురు కవులునుంజేరి సీతావిజయమను నామాంతరముగల శతముఖ రామాయణమును రచించిరి. ఈయిరువురు

కవులు వేపాక్రిపురనివాసులు. వీరిలో నీలకంఠోపాసకుఁడైన లింగకవి తాను రచించిన మొదటి మూఁడాశ్వాసములను చిన్నారెడ్డి పుత్త్రుఁడగు పోచన్నపాలున కంకితముచేసెను. నృసింహోపాసకుఁడగు గంగకవి తానురచించిన నాలవయాశ్వాసమును భోగన్నపాలుని కంకితముచేసెను. ఈయిరువుర కవిత్వమును మొత్తముమీఁద రసవంతమై నిర్దుష్టమై హృదయంగమముగా నున్నది. ఈకవు లిన్నూఱుసంవత్సరములకు ముందున్నట్లు తెలియవచ్చుచున్నది." అని.

మూఁడువ్రాతప్రతులలో మర్దనకవి యనియుండుటచే నెక్కుడు ప్రతులలోనున్నదని యావేరేయుంచినారము. ఈ చిక్కున కంతకును గారణము పీఠిక కృత్యాదిపద్యము లొక్క ప్రతిలోను లేకుండుటయే కావున, వాస్తవము తేలదు. ఎంతవఱకు లింగనకవిత్వమో యెంతవఱకు గంగనదో, రంగనదో విడఁదీయుటకు వలనుగాలేదు. అట్లే పోచన్నపాలునికిఁ గృతి యెంతవఱకో భోగన్నపాలున కెంతవఱకో బొత్తిగాఁ దెలియవచ్చుటలేదు. ద్విపదకావ్య మొక్కటి లింగకవిది పరిషత్పుస్తకభాండాగారములోనున్నది. విషయనిర్ధారణము పీఠిక పద్యములు చదివినవేత్తలు చేయవలయును. మనయాంధ్రకవులు గృత్యాదినిష్టదేవతావందనములు కృతిపతికృతికర్తల వంశావళులు వర్ణించుటలో నెంతపట్టుదలగలవారో, యట్లే మనవ్రాయసకాండ్రును పీఠిక పద్యములను దొలఁగించి ప్రతులువ్రాయుటలో నంతపట్టుదలగలవారు. చారిత్రక విషయమునందు బొత్తిగా విముఖులగుటకుఁ జింతిల్లుచున్నారము.

ఈగ్రంథమునందలి కవనధోరణినిబట్టి మాత్రము పలువురు రచించినట్లూహింపఁదగును. కవులచరిత్రము వాడుకప్రకారము "మొత్తముమీఁద రసవంతమైనదని" చెప్పినను గద్యములోఁ గవి తాను స్వయముగఁ బ్రతిభాశాలినని వ్రాసికొన్నను, అంతమంచిధోరణి గలదిగా నగపడదు. ఔచిత్యము, సందర్భము తక్కువగానున్న భాగములు కొన్నిగలవు. అపప్రయోగములు "అల్కతో, కొన్నబ్ధములకు, వెక్కసైసొక్కు, ముఖతీక్షణాస్త్రవివిధాశుగము, క్షీరాబ్ధి దాఁటవ్వాలక్, నీకు గొబ్బునిత్తుమ్, చిత్రగంధిట్లనియెన్, భూమంతటన్, బలసూర్తిజనుందేర, రక్షోరమణున్ రథంబు, నిల్చికురించె మహాస్త్రవర్షమున్, దనుజుఁ డొనర్చు బాణములు" మొదలైనవిగలవు. పురపురంధ్రిజనులు సీతను స్తుతించుట పారిజాతాపహరణములోని స్వర్గస్త్రీల వర్ణనమువలెఁ గనఁబడుచున్నది. కొన్నిపద్యములు సంస్కృత జటిలములై యున్నవి. నిరర్థపదభూయిష్ఠములుగాఁ గొన్నిగలవు. పాఠకులు గ్రహింపఁగలరు.

ఇందు సేనలకు వెల్వాలను ప్రయోగముగలదు. వెల్లువలని కావచ్చును. ద్వితీయాశ్వాసములో—సీ. శతకోటిలక్షలు శైలచరావళుల్ గదిసిన మొన యనఁగాను బరఁగు-అనుపద్యములో వెల్వాయనుసంఖ్య యింతయని చెప్పఁబడినది. శ్రీరాముని సేన డెబ్బదిరెండు వెల్వాలని వాడుకగలదు. ఈవిషయమై పెద్దలు చదువు రెండుపద్యములున్నవి. ఈవెల్వ యక్షోహిణివంటిది.

మ. "మదినూహింపఁగ స్వామికన్న నిఁక సామంతుండు లేఁ డెందు డెబ్బది
రెం డ్వెల్వలసేన చుట్టుఁ గొలువన్ బాహాబలుండయ్యుఁ దాఁదుదిమై
రావణుచేతఁ జిక్కువడె..."

సీ. "కోఁతు లెనుబదికోట్లు కొమరొప్ప నొకగంతు
గంతులు వేయి నిక్కంపుగమియు
గమికోటి కోటియుఁ గలయంగ మొత్తంబు
మొత్త మర్వదికోట్లు మొనసి పీడు
పీడు లక్షక్షోణి వెలయంగ నొకసాదు
సాదు డెబ్బదిరెండు సకలమూఁక
మూఁకలు శతకోటి ముదముతో సంగడ
సంగడమే వేయి సరగధట్ట
ధట్ట మర్వదకోట్లు తగిలింప నొకమొన
మొనలు మున్నూటికి మొనయుఁ దోయ
ఇట్టి తోయలు నారైన గట్టి యూధ
ఇట్టి యూధలు నారైన సైన్యఁగు వెల్వ
ఇట్టి వెల్వలు డెబ్బదిరెంటితోను
రామచంద్రుఁడు వెంచేసె లంకమీఁద." అని.

ఈపద్యములం దియఁబడిన లెక్కకును మనగ్రంథములోఁ జెప్పఁబడిన లెక్కకును సరిపడుటలేదు. పరిషత్ప్రతిని బట్టి యిందు విశేషపద్యములు చేర్పఁబడినవి. అందుఁ గొన్నివచనములకుఁ బద్యములుగలవు. ఒకపద్యమునకు వేఱొకపద్యములో నాయర్థమే చెప్పఁబడియున్నది. పలువురు పాఠకులకోరికపై నన్నియు నొక్కగ్రంథములోఁ గనఁబడునట్లు శ్రమపడి యీప్రస్తుతప్రతిని సిద్ధము చేసినారము. కాని పాఠకులనిమిత్తమై యతిశీఘ్రముగా ముద్రించుటచే నక్కడక్కడఁ గొన్నిలోపము లుండవచ్చును. పాఠకులు మాశ్రమకుఁ దగినఫలము గలుగునట్లు ప్రోత్సహింతురు గాకయని కోరుచున్నారము.

తండయార్పేట
చెన్నపట్నము.

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# శతకంఠరామాయణము

## ప్రథమాశ్వాసము.

---

ఉ. భాసురలీల శంభుఁడు కృపారస ముప్పతిలంగఁ జారుకై
లాసమునందుఁ బార్వతికి రాముకథల్ వివరింప నందుచే
వాసిగ సంతసిల్లి నిజవల్లభుపైఁ దనచూడ్కి నిల్పి యో
దాసజనావనాత్మక! సదాశివ! యింకొకటానతీయ్యవే. 1

మ. శతకంఠుం డనుఘోరదైత్యుఁడు రఘుస్వామిన్ రణంబందు నే
గతిమైఁ దల్లడిలంగఁజేసె? నటఁ దత్కాంతాలలామంబె య
ల్కతో వీక్షించి పెనంగె నెట్లు? మఱి తత్కాండప్రచండక్రియన్
మృతుఁడై యేవిధిఁగూలె? నాతఁడది పేర్మిం దెల్పుమా వేఁడెదన్.

గీ. ఎవ్వఁ డా [1] రామచంద్రుని నిచ్చఁదలఁచు
నెవ్వఁ డాసీతమహిమంబు లెఱుఁగఁగోరు
నాయురారోగ్యములు వాని కతిశయిల్లుఁ
దాండవంబాడులక్ష్మి యాతనిగృహమున 3

క. ఈచరిత రాఘువునిదఁట
యీచేతను బుట్టి నారి యీమహిమ మొగిన్
నీచేతఁ బలుకఁబడెనఁట
చూచిన వ్రాసినను విన్న శుభమింపొందున్. 4

---

1 రాఘవేంద్రుని.

వ. అనినవిని సర్వజ్ఞుండగు మహాదేవుండు సమ్మతించి పులస్త్యప్రకారంబును [1]తత్సుతులవిశ్రవసాశ్రములవిధంబును రావణకుంభకర్ణవిభీషణాదులజననంబును అన్నకొడుకులం జూచి యశ్రముండు వగచుటయు, తపంబు సేయుటయు, తత్ప్రభావంబున నూఱుశిరంబులు నిన్నూఱుకరంబులుంగల మహాదానవుం గనుటయు, నతండు రామునిచేఁ దెగిన రావణాద్యఖిలదనుజప్రళయంబును వినుటయు, నప్పగ యీఁగఁ గోరుటయు, తపంబు సేయుటయు, నజుండు పొడచూపుటయు, నతనివలన దుర్లభంబు లగు వరంబులు గొనుటయు, మునుల బాధించుటయు, నమ్మునులు రామచంద్రునిపాలికిం జని శరణు చొచ్చుటయు, వారికి నభయహస్తంబు లిచ్చుటయు, శతకంఠునిం జంపఁ బ్రతిజ్ఞసేయుటయు, మునులఁ బంపుటయు, వెనుక నమ్మహాదనుజుని విక్రమంబు[2]దలఁచి బలసామగ్రి చాలదని వగచుటయు, లక్ష్మణుండు తమతమ పరాక్రమంబులు దెలుపుటయు, విభీషణుని రాఁదలఁచుటయు, నతనివలనఁ గొన్ని వివరంబు లెఱుంగుటయు, [3]హనుమంతునిఁ దలంచుటయు, నతనికిఁ దద్వృత్తాంతంబు సెప్పుటయు, నక్కపికులోత్తముండు తన మహారూపంబు చూపుటయు, సకలమనుజదనుజవనచరబలంబుల రప్పించుటయు, తన్నుం గొని చనుమని సీత వేఁడుటయు, రాఘవుం డనుమతించుటయు, దండు వెడలుటయు, నందఱ నొక్కపెట్టున హనుమంతుండు తనశరీరంబునం దాల్చుటయు, దేవతలు

1 తత్సాఘుచక్రపరాక్రమవిభవంబును. 2 ఏని. 3 వాయుజుని రప్పించి యతనికిఁ దద్వృత్తాంతంబు.

సన్నుతించి పుష్పవర్షంబు గురియించుటయు, నందులకు మిగుల నుత్సహించి పవనజుండు తనవాలంబున నఖిలదళంబుల సముద్రంబులు దాఁటించుటయు, లగ్గపట్టుటయు, హనుమద్రాయభారంబును, చిత్రగంధినీతియు, ద్వంద్వయుద్ధ ప్రకారంబును, సకలబలప్రళయంబును, రాముండును శతముఖుండునుం దలపడి ఘోరయుద్ధంబు సలుపుటయు, నందులకు రాఘవుండు కళవళించుటయు, సీత విల్లందుటయు, దనుజబలసంహారణంబును, శతకంధరుపరాభవంబును, మఱునాఁడరుదెంచుటయు, నారదాగమనంబును, హితోపదేశంబును, బ్రహ్మాస్త్రప్రయోగంబును, శతముఖుమరణంబును, చిత్రగంధివిలాపంబును, నీలకేతను పట్టాభిషేకంబును, హనుమంతుండు మరల జలధులు బలంబులు దాఁటించుటయు, పురంబుచేరుటయు, రాజ్యంబు పాలించుటయు మొదలుగా నంతయుఁ దలపోసి మందస్మితముఖారవిందుండై యిందుశేఖరుండు పార్వతీదేవి కిట్లనియె. 5

క. రావణుఁ డురుసంగరవి
ద్రావణుఁ డాభీలబాహుదండజితోగ్రా
రావణుఁడు నేయునురుదు
ర్భావపరాభవము లాత్మ భావించి సురల్. 6

సీ. క్షీరవారాశికడ కేగి శ్రీరమాధి
నాథుఁ [1]బొడగని కవిసి వందనము లొసఁగి
తమపరాభవ మెఱిఁగింపఁ గమలనాభుఁ
డభయకరమిడి పనిచెఁ గొన్ని బ్దములకు. 7

1 బొడగాంచి వినయ వందనతు లొసఁగి.

గీ. దేవతలఁ బ్రోవ నాత్మఁ జింతించి పంక్తి
రథ మహాగర్భదుగ్ధాంబురాశియందు
నొసర సత్సంతతికి మోద మొదవ రామ
చంద్రుఁ డుదయించెఁ బూర్ణిమాచంద్రుపగిది. 8

వ. ఇట్లుదయించి. 9

సీ. ధరణీ[1]ధరాటకఁ దాటకఁబడనేసి
జన్నంబు బన్నంబు చక్కఁజేసి
ఖ్యాతిగా రాతిని నాతిగాఁ గావించి
భవునిచాపంబు రూపంబు మాపి
సీతను భాగ్యసమేతను బెండ్లాడి
కైకవాక్యమున కైక్యంబునొంది
గుహుని సద్ధర్మవ్యాఘ్రగుహుని సంభావించి
రాష్ట్రాపరాధు విరాధుఁ [2]గొట్టి

గీ. ఘనులమునులను మన్నించి కడుఖరాఖ్య
దూషణుని భీషణాంబకాదులను గూల్చి
యొక్కరక్కసి వెక్కసై సొక్కుదాని
ముక్కు సెవులకుఁ గలనిక్కు చక్కుఁజేసి. 10

శా. మారీచుం బడనేసి వాయుజుని [3]సన్మానించి కిష్కింధకున్
నీచేజాప్తజు రాజుఁజేసి [4]యలకంధింబూని బంధించి బల్
నారాచంబులఁ బంక్తికంఠఘటకర్ణశ్రేణి [5]హింసించి లం
కారాజ్యంబున నవ్విభీషణుని భాగ్యప్రాప్తుగా నిల్పుచున్. 11

1 ధరాధిక. 2 గిట్టి 3 సంభావించి. 4 జలధి న్నిక్కంబుగా దాఁటి.
5 దూషించి.

ఉ. వారిధి వానరాళిగొలువంగను గ్రమ్మఱ దాఁటి సీతయుం
దానును లక్ష్మణుండు నవధానవిమానము నెక్కి వేల్పులుల్
బోరునఁ బుష్పముల్ గురియఁ బొంగుచు వైరివిదారధీరగం
భీరమనస్కులై చనిరి పెల్లుగఁ దల్లులఁ జూచువేడుకన్. 12

క. పురజనులు సంతసిల్లఁగ
నిరుపమసత్కీర్తిలక్ష్మి నెగడఁగ సద్భా
సురులు నుతింప నయోధ్యా
పురమున కేతెంచి రధికపురుషవరేణ్యుల్. 13

వ. ఇట్లు చనిచని నిరంతరకుసుమఫలభరిత తరునిచయారామం
బులును, విమలకమలకల్హారషండమండిత జలాశయంబులును,
అభేద్య పరిఖాప్రాకారద్వార కవాటమణితోరణ విరాజిత
సౌధాగ్రబంధబంధుర శాతకుంభ సముదయంబులును, హాట
కవిరచిత నూత్నరత్నదీప్తి ధగద్ధగాయమాన రాజప్రాసాద
ప్రాంగణరంగసంగత కనకమంటపావరణ విచిత్రకుడ్య గవాక్ష
సంశోభితంబులును, వీరకుమార సుందరమందిర పశ్చిమభాగ
సంస్థితకేళికాకుధరనిత్యనివాస కీరమయూరశారికా పిక ప్రకట
కోలాహలంబులును, అనవరతమదజల పంకసంకలిత గండ
మండల శుండా[1]జాలంబులును, జనవిజితపవనమనోవేగ
రంగత్తుంగ తురంగంబులును, అవక్రమణి చక్రాగణిత
ఘంటికాఘణఘణార వాభ్రంకషధ్వజ సకలసాధనాయుత రథ
నిచయంబులును, సంగరాభంగ వీరాలాపప్రతాప భటకదం
బంబులును, రంభాసంభోగారంభ విజృంభమాణవిభవగంభీర
వారవనితా సంఘంబులును, సమస్తరాగోపరాగతానమానా



1 తండంబులును.

సధాన మంగళపాఠక మహిమంబులును అభ్రంకష గోపుర ప్రాకార చతుర్ద్వార పవనతరళిత వృషభకేతన నానాధూప ధూమఘుమఘుమాయమాన వాసనావాసిత దేవాలయంబులును, ఝల్లరీమృదంగశంఖకాహళపణవఢక్కాముఖానేకవాద్య ఘోషంబులును, ప్రజ్ఞావిశేషనిర్జిత శేషభాషాధీశులగు విప్రవర్గంబులును, పరపరిచ్ఛేదితోరస్స్థలనిమ్నక్షత భూషణ భూషిత క్షత్రియకుమార వారంబులును, ధనకనకవస్తువాహన ప్రవర్ధమాన వ్యవహారహసిత ధనదాదులగు వర్తకులును, అక్షుద్రభద్రతర శౌర్యధైర్యౌదార్య తిరస్కృత సముద్రులగు శూద్రులును గలుగు సాకేతనగరంబు ప్రవేశించి, అనర్గళ సంప్రమాయత్తచిత్తుండై రఘువరుండు మక్కువ నొక్కనాఁడు శుభముహూర్తంబున ననుజపరివృతుండై మునిజన పురోహితామాత్య జనమిత్రయానుమతంబున జానకీసమేతుండై 14

క. పట్టాభిషిక్తుఁ డయ్యెను
నెట్టన భువనములఁ గలుగు నృపతులు మెచ్చన్
ఘట్టిప్రాభాకరుఁ డా
ప్రొట్టంకితు లైనసుకవు లోలిన నుతింపన్. 15

గీ. ఇట్లు పట్టాభిషిక్తుఁడై యేపు మెఱసి
మనుజపతిసభానటసత్యములు వినుచు
నెల్లజనములు ముదమొంద నేలుచుండెఁ
[1]వల్లి సంద్రియు నైవంబుఁ దానె యనఁగ. 16

సీ. ధర్మంబు నాల్గుపాదంబుల వర్తిల్లు
వాంఛించినప్పుడే వానగురియుఁ

---

1 వల్లియును దంద్రియును దాత.

దరువు లేవేళ నుద్ధతిమీఱ ఫలియించుఁ
బైరులు దన్నక పండుచుండుఁ
దిరిపంబువిరస మేదిక్కునొదవదు
మొదవులు పిదుకకమున్నె పిదుకు
వ్యాధులు నఘములు వలసలై దూరించుఁ
జింతింపఁ గోర్కులు సిద్ధినొందు

గీ. రాజపరమేశ్వరుఁడు దైత్యరాజహరుఁడు
రాజసింహుండు దశరథరాజసుతుఁడు
[1]రాజసదృశకళాంగుఁడు రాఘవుండు
ఘనతతోడుతఁ బాలించుకాలమునను. 17

గీ. గట్టిధాన్యంబు పోఁకకుఁ బుట్టెఁడేసి
యట్టిపోఁకలు రూకకు నని కెఁడేసి
యట్టిరూకలు మాడకు నఱువదేసి
యట్టిమాడలు నింటింట నగణితములు. 18

గీ. సకలజనములు సేవించి సన్నుతింపఁ
బ్రకటముగ రాజ్యసౌఖ్యంబుఁ బాలనంబు
సల్పుచుండెను రఘురామచంద్రుఁ డవనిఁ
గీర్తి వర్ధిల్ల సద్గుణస్ఫూర్తి దనర. 19

క. మేఘశ్యామలదేహుఁడు
రాఘవుఁ డీరీతి భూసురస్ఫుటభాషా
మోఘాశీర్వాదమహా
శ్లాఘామతి నేలుచుండు సమయమునందున్. 20

1 రాజసద్యుతికాంగుండు; రాజసదృశకరాంగుఁడు.

గీ. మదినిఁ బొదలుచు ఋష్యాశ్రమములు సొచ్చి
డాసి మఱియును హోమగుండములు పూడ్చి
యాగధేనువులను ద్రుంచి పూగముఖ్య
భూజములు ద్రోసి కాసారములు గలంచి. 25

క. మునిసతులఁ జెఱలుగొని యా
మునివరులను దునుమఁ జిత్తమున రోసి తుదిన్
వనలతల మునులకరములు
ఘనముగ బంధించు వికృతకఠినముఖుండై. 26

క. నెపమేమియు లేకయె తన
[1]రపమై తముబాధపఱుప రాక్షసుమీఁదం
గుపితాత్ములయ్యు దపసులు
శపియింపఁగఁ జాలరైరి జలజజుమహిమన్. 27

సీ. ఒకమునివరుఁ బట్టి యూర్ధ్వపుండ్రమునాకు
నొకవిప్రుజందెంబు లొడిసి త్రెంచు
నొకమానిపైఁ జల్లు నుర్వీపరాగంబు
నొక్కతాపసునోరు [2]నొక్కి మూయు
నొకఋషీశ్వరుపిల్లసిక పెల్లగిలఁదీయు
నొక్కయోగీంద్రుని యక్కుఁ జదుము
[3]నొకమహీసురుమీఁద నుమియును మత్తుచే
నొక్కదిగంబరు నొలయఁ దన్ను

గీ. [4]నొకతపోధనుఁ దేలెంచి వికలమతిని
పెక్కుమాఱులు శతముఖువేరు నొడివి

1 దపమై దముబాధపఱుప ధార్ష్ట్యముమీఱన్. 2 ముక్కు మూయుం.
3 నొకదిగంబరుఁబట్టి సికలాగుమిన్నంద నొక్కయతీంద్రుని నొడిసి తన్నుః
4 ఒకతపోధనుపైఁబడి యుఱిమికొట్టి.

పాహి పాహి [1]యనుచు పాగఁబడిన సతిని
కాలు [2]గొనియీడ్చుఁదునఁపానెకాలుసగిది. 28

ఉ. భూసురు లింద్లకేగి కటుభూరిభయంకరరూపుదాల్చి తా
బాసయొనర్చి వేదములు బాగసచించెను విప్రసత్త్రలం
గాసరకానుఁజేసి పరకాంతల మస్త్రములెల్ల నంటుచుఁ
మోపమువుచ్చి పండితులమోరలు దన్నుచు ధిక్కరించుచున్.

సీ. దిక్కుంభికుంభముల్ వ్రక్కలు గావించు
నుక్కునఁ జెలరేఁగి యొక్కనాఁడు
తనబాహుకండూతి దన్నఁ గులాద్రుల
నుంకించి పెకలించు నొక్కనాఁడు
తపియింపఁజేసె నాతపమున నని భాను
నొడయఁగా నూహించు నొక్కనాఁడు
పాలయరాదని పూని మలయమారుతమును
నుప్పున నెగనూఁదు నొక్కనాఁడు

తే. ఉరగులనుబట్టి దండించు నొక్కనాఁడు
ఉగ్రుఁడై నిర్జరులఁ ద్రోలు నొక్కనాఁడు
ఉదరి మానవులను మ్రింగు నొక్కనాఁడు
ఉబ్బి లోకంబు గాలించు నొక్కనాఁడు. 30

క. ఈవిధిని లోకభయదము
గావింపఁ జిత్తములను గళవళపడి యా
దేవతలు మునులు ధరణీ
దేవతలును గూడి జాలిఁ దేలుచు [3]లోనన్. 31

1 యటన్నఁ దాఁ బాకమునక. 2 పట్టీడ్చు. 3 నొకటన్.

క. ఎవ్వండు మనకు దిక్కగుఁ
నెవ్వాఁ డీబాధమాన్పు నిల యెవ్వనిచే
[1]నివ్వక్కృతుఁడీల్గునెవ్వని
మవ్వుఁగరుణారసమున మనులోకంబుల్. 32

వ. అనుచు దుశ్చింతాసముద్రంబున మునింగి యపరిమిత[2]డోలాం
దోళితమానసులై క్రమ్మఱ ధైర్యంబులు పురికొల్పుకొని
సురలు మునివరుల కిట్లనిరి. 33

క. కోసలదేశమునందున
భాసురముగ నొప్పు నొక్కపట్టణమందుఁ
వాసిగనుండు నయోధ్యా
వాసుఁడు శ్రీరాముఁ డుండె వాసవునీడై. 34

క. మును మనకొఱకై దానవ
హననమునకు విష్ణుఁ డవని నలరి దశస్యం
దనునకుఁ బుట్టి రఘూద్వహుఁ
డన నిపుడున్నాఁడుగాదె యధికు లెఱుంగన్. 35

గీ. అట్టిరాఘవుఁ డఖిలరాజాధిరాజ
చారుకోటీరమాణిక్యచాకచక్య
సారమండితసత్పదాంభోరుహద్వ
యుండె మనకిఁకదిక్కుగాఁ గొండుగలఁడె? 36

ఉ. శ్రీరఘురామమూర్తి సరసీరుహనేత్రుఁ డమేయుఁ డాద్యుఁడుం
జారుయశోవిశాలఘనసారమరాళితుషారహీరక

---

1 నిర్విపరీతపుదైత్యుం, డెవ్వనిచే నీల్గు మనలకెవ్వరు గలరో. 2 డో
లాయమానమానసులై.

ద్యానతటీవిహారహిమభూధరశారదచంద్రచంద్రికా
తానవిభాస్ఫుటస్ఫురదితానకళాంకుడు దిక్కుగావుతన్. 37

మ. పరిపిష్టాగములం ద్రిశూలమహిమల్ పట్టంబుగా నింద స
ద్ధరకంఠస్ఫుటకంఠకంఠిపయోద్గంధాగ్రహాటేలక
స్మృక్షల్లంబుల సంహరించి మనలం గాపాడఁడే? యట్టి [1]పి
పరిరోత్తంసమె దిక్కు మీరికి విచారంబేల యూహింపఁగన్.

సీ. తనభక్తుఁ డౌటంచుఁ దలఁపఁ దమ్ముఁడుఁ దాను
వేఁడకయ్యె రామచంద్రుండుగాఁడె
కులహీనుఁడనక మక్కువమీఱ నొకకిరా
తుని బ్రోచె రామచంద్రుండుగాఁడె
మర్కటుండనక నయ్యర్కజుఁ బట్టభ
ద్రునిఁ జేసె రామచంద్రుండుగాఁడె
[2]తనశత్రుఁడనక నాదైత్యుతమ్మునిఁ గాచె
రూఢిగా రామచంద్రుండుగాఁడె

గీ. యట్టికరుణాపయోనిధి కట్టిసుకృతి
[3]కెలమి మీఱంగ మనలను నేలు నెంత?
తడయ కచ్చోటికేగుఁడీ తపసులార
జాగుసేయంగ నేటికి? సభ్యులార. 39

---

1 పరమశిరోత్తంసమె. 2 తనశత్రుఁ డనక దైత్యతనయుఁ గాచెను; దానవుండైనఁ దాను దయతప్పకను దొడ్డవానిఁ జేసె రామచంద్రుండుగాఁడె. 3 శరణుపొందిన రక్షణసల్పు టెంత.

వ. *ఏమును దివినుండి పొడచూపెద మనిచెప్పి సురలు నాకం
బున కరిగి రంత. 40

శా. †శాండిల్యుండును జహ్నుమౌనివరుఁడుఁ జాబాలియుం
గౌత్సుఁడుం, గౌండిన్యుండును గాలవుండును మహాకణ్వుండు
మైత్రేయుఁడుఁ, మాండవ్యుండును మందపాలుఁడును సన్మార్గ
ప్రభావుండు మార్కండేయుండును గూడివచ్చి రతిశీఘ్రం
బొప్ప రాముంగనన్. 41

వ. ఇట్లు రయంబున వచ్చివచ్చి. 42

క. అతతముగఁ గాంచిరి సా
కేతము వరనృపతిజననికేతన మతివి

---

*గీ. ఏము దివినుండి పొడసూపినాము మీరు
సర్వఋషులను శ్రీరామచంద్రు కడకుఁ
బోయి యీబాధ యతనితోఁ బొసఁగఁజెప్ప
నెమ్మిమీఱఁగనుంద్రు మునీంద్రులార.
వ. అనిచెప్పి దివిజులు నాకంబున కేగిరంత.

†సీ. శాండిల్య కౌండిన్య జహ్నులు జాబాలి కణ్వుండుఁ గశ్యపకౌశికులును
గౌతమ గాంగేయ కపిల మార్కండేయు లాత్రేయతుల్యులు నత్రిమౌని
వాలఖిల్య వసిష్ఠ వామనఋషభులు భరతుండు సాంఖ్యవిభాండకులును
మైత్రేయ యజ్ఞులు మందపాలుఁడు యాజ్ఞవల్క్య భరద్వాజ వామదేవ
గీ. రోమహర్షులు వృశ్చికరోమమౌని
మొదలుగాఁగల మునిపంక్తి మోదమలర
రమ్యచారిత్రు దశరథరాజపుత్రు
కడకు వచ్చిరి భీతిసాకలితులగుచు.

సీ. వీఁడఁటే కృపమీఱ వేల్పులకొఱకునై
మహిమీఁదఁ బుట్టినమాయలాఁడు
వీఁడఁటే దశరథోర్వీ[1]భర్తకు మిగుల
సుద్దుల నుబ్బించుముద్దులాఁడు
వీఁడఁటే పిన్ననాఁ డేడాసివెక్కసి
రక్కసిఁ జెక్కినరట్టుకాఁడు
వీఁడఁటే గాధేయు విమలతరాటోప
యజ్ఞంబు రక్షించుయజ్ఞభోక్త
గీ. వీఁడఁటే శౌర్యములకెల్ల వీడుపట్టు
వీఁడఁటే ధర్మములకెల్లఁ దోడఁబుట్టు
వీఁడె సాక్షాత్కరించిన విష్ణుమూర్తి
వీనిఁ గనుఁగంటి శుభములు వేఱుకలవె 47

వ. అని మునీంద్రులు సాంద్రకరుణారస పరిపూర్ణహృదయులై
వివిధాశీర్వాద మంత్రాక్షతవిన్యస్తప్రశస్తహస్తంబులెత్తి
భక్తితోఁ గదిసి యిట్లనిరి. 48

సీ. శ్రీరస్తు ధరణిజాశ్లిష్టభుజాదండ
ఖండనోద్దండ కృపాప్రచండ
విజయోస్తు త్రిభువనవిఖ్యాతచారిత్ర
వికచాబ్జనేత్ర పవిత్రగాత్ర
దీర్ఘాయురస్తు భూదేవతామందార
కలుషసంహార భాగ్యప్రచార
ఆరోగ్యమస్తు శతార్కతేజోరూప
గురుజయాటోప సద్గుణకలాప

1 భర్తకును దన.

గీ. అనుచు నాశీర్వదించి [1]మంత్రాక్షతప్ర
సూనశేషాలాజముఖ్యవస్తువు లొసంగి
భయము ప్రియమును జయమును రయము నయముఁ
బెఱుఁగఁ గోఁరఁగనిచ్చి రారాముఁ [2]బ్రేమఁ గనుచు. 49

వ. రాఘవేశ్వరుండును బ్రత్యుత్థానాభివందనము లందఱకును వేఱువేఱ సాదరించి అర్ఘ్యపాద్యాదివిధులం బూజించి ఉచితపీఠంబులం గూర్చుండ నియమించి మందస్మిత ముఖారవిందుండై యానంద మందంద సందడింప నందంబుగా మెల్లన మునివరుల కిట్లనియె. 50

శా. ఆర్యా మావిభవంబులెల్ల భవదుద్యత్పూతపాదాంబుజా
తార్యాలోకనచింతనంబునఁగదా జానొప్ప నీడేలు మీ
రెవ్వేరాష్ట్రల కేఁదెంతు రెటమీరికొంతు రింపొందఁగా
నయ్యార్యావ్రులు వృద్ధిఁబొందినను నేమాశ్చర్యమూహింపఁగన్.

శా. క్షేమంబేకద మీకు మీపరిజనుల్ శిష్యుల్ విడంబింతురే
నేమంబొప్పఁగ ధేనువుల్ పితుకునే నిత్యోత్సవక్రీడలన్
వేమారుం ఫలియించునే తరువు లుర్విన్ సత్తపో[3]ధర్మముల్
ప్రేమన్ వర్ధిలునే నిరంతరమఖాభీష్టంబు లీడేరునే. 52

శా. దైన్యంబేమియులేక మీకరుణ నిద్ధాత్రీతలంబెల్ల ప్రా
క్సైన్యాయంబున నేలఁగంటి మఱి కాదే యింపుమైఁ గార్యముల్
సన్యాసత్వముఁ బూని నన్ను మఱినిచ్చల్ నమ్మియున్నట్టిచో
నన్యాయం బెట నుద్భవింపదుగదా యాభీలవైరంబులన్. 53

---

1 మంత్రాక్షతాది సూనసుమగరాజిక. 2 గనుచు పేర్కొ. 3 ముఖ్యా
మల్.

క. ఏపని పనిచినఁ జేసెద
మీపాదములాన తెలియ మెల్లనఁ జెపుఁడా
దాపరము సేయ నేటికిఁ
దాపసవరులార మీకు దాసునియెడలన్. 54

క. నావిని మునివరులెల్లన్
భావంబుల సంతసిల్లి బహువైఖరులన్
దీవించి రాఘవేంద్రుని
తో వినుమని యిట్టులనిరి తోడఁబడుకరుణన్. 55

ఉ. శ్రీరఘురామ శత్రుముఖజీవనజస్ఫుటసోమ భూరిర
ణోరణభీమ చారుతనుసుందర నిర్జితకామ విస్ఫుర
త్సారసహస్రధామ భవదుఃఖవిరామ పవిత్రనామ వి
స్తారయశోభిరామ శుభధామరఘూద్వహహృద్వహోద్ధవా.

గీ. అలిగి రావణకుంభకర్ణాదిఘోర
రాక్షసావలినెల్లను రణములోన
బాణములపాలుచేసి మాబాధమాన్పి
తింతకంటెను శుభము మాకేదిచెపుమ. 57

చ. తతభుజదండనిర్జితకృతాంతనిలింపవరేణ్య యక్షరా
డతులితసిద్ధసాధ్యగరుడాహిసమస్తచరాచరున్ మహో
ద్ధతభువనైకకంటకుని దానవనాయకుఁ బంక్తికంఠునిన్
క్షితిఁబడనేయ నెవ్వరికిఁజెల్లు దలంపఁగ రాఘవేశ్వరా. 58

శా. నిద్రాసక్తి యొకింతమానిన బొమల్ నిక్కించి చేచాచి య
క్షుద్రాకాశధరాపరీతములు దా శోధించి యేమబ్బినన్
రౌద్రాకారతవక్త్రగహ్వరముఁ జేరందెచ్చి భక్షించు కో
పోద్రేకాత్ముని గుంభకర్ణు నురుదేహుం గూల్పఁగా శక్యమే.

వ. మఱియు నదియునుంగాక దేవదానవసంగ్రామరంగనిరోధుం
డగుమహోదరుండును, సకలదిగంత దంతావళి దంతాగ్ర
సంఘాతక్షతనిమ్నోన్నత వక్షస్థలప్రశస్తుండగు ప్రహ
స్తుండును, క్రోధావలోకనమాత్రచంచలాయమానవిశ్వుం
డగు మహాపార్శ్వుండును, నిఖిలశత్రుభీముండగు ఖడ్గరో
ముండును, ప్రళయసమయ కనదనలసదృశధాముండగు
సర్పరోముండును, హాలహాలప్రతిమాన విషరోమస్తోముం
డగువృశ్చికరోముండును,శమనసమవిక్రమక్రమవిమతోదగ్ర
మహోగ్రాహితసుపర్ణుండగు నగ్నివర్ణుండును మొదలుగాఁ
గల దానవు లపారబలపరాక్రమవంతులు గారె వారినెల్ల
నల్లన సంహరింపవే? అదియునుంగాక దుష్టనిగ్రహ శిష్టపరి
పాలకుండును, జగదేకవిక్రముండు నను బిరుదులు నీకుఁజెల్లు
నని వెండియు నమ్మునీంద్రులు [1]రామచంద్రున కిట్లనిరి. 65

గీ. అనఘ నీశౌర్యమునఁజేసి యఖిలజనులు
పరిణమించియు నిప్పటిబాధవలనఁ
బరిణమింపకయున్నారు పార్థివేంద్ర
యెట్లు చెప్పుదు మవ్వార్త లేము కడఁగి. 66

గీ. శతముఖుండను ఘోరరాక్షసవరేణ్యుఁ
డప్రతిద్వంద్వవోర్బలుఁడై సరోజ
గర్భువరములఁజేసి లోకములు గలఁచెఁ
గావరుండు ప్రతాపలంకావరుండు. 67

క. మును దశకంఠునిబాధకె
మనఁజాలక యొక్కభంగి మంటిమి యిపుడో

1 రాజేంద్రున.

క. అనవిని మునివరులెల్లన్
మనముల హర్షించి మృదులమధురతరోక్తుల్
వెనఁగొనఁగ రామభద్రునిఁ
గనుగొని యిట్లనికి భయవికారముదోఁపన్. 73

క. విశ్రాంతి దనరు సుగృహ
స్థాశ్రమముని యగుపులస్త్యుఁ డనుసుకృతునకున్
విశ్రవసుం డనువాఁడును
నశ్రముఁ డనువాఁడు నిరువు రట్లుదయింపన్. 74

వ. అందు విశ్రవసుం డనువాఁడు కైకేశి యనుదానిం బాణి
గ్రహణంబుగావించి దానివలనం గ్రమంబున రావణకుంభ
కర్ణాదు లగుజగదేకప్రతాపులఁ గాంచె; అశ్రముండును
చిత్రగంధి యనుగంధర్వవధూటిం దగులుకొని సంతానంబు
గానక కతిపయదినంబులు చింతించి, దశకంధర ఘటకర్ణ విభీ
షణప్రముఖులగు విశ్రవసునికొడుకులు సమరప్రచండులని
లజ్జించి తనమనంబున నిట్లనియె. 75

చ. తనయులు లేనిధామమును దైవనివాసము లేనిగ్రామమున్
వినయము లేనివిద్యయు వివేకము మాలినయట్టివైద్యమున్
జనపతి లేనిరాజ్యమును సౌఖ్యవిరోధక మైనభోజ్యముం
గనకము లేనిభాగ్యమును గన్గొన నిన్నియు వ్యర్థకార్యముల్.

ఉ. కావునఁ బూని యేను దశకంఠునికంటెఁ బ్రతాపశాలిగా
వావిరి నాత్మఁగోరి యొకవంకతపం బొనరించి యందుచే
నావల నూఱుమోములను హస్తశతద్వయముం గలట్టి స
ద్భావుని ఘోరశాత్రవ[1]విఘాలునిఁ బుత్రునిఁ గందు వేడుకన్.

---

1 విదారుని.

*చ. అనిచని యత్త్రముం డశోకవనాంతరమందున మూఁడుమూ
ర్తులకు, మనమునంనిల్పి చంద్రరవిమధ్యమునం దనచూడ్కి
నిల్పి యిమ్మునఁ దపమాచరింపఁగఁ ద్రిమూర్తులు దానగుటం
జెలంగి యా, యినుఁడు ప్రసన్నుఁడై తనయునిచ్చె జగ
ద్భయదప్రతాపునిన్. 78

వ. ఇట్లు ఖండనోద్దండశతద్వయభుజాదండుం డగుపుత్త్రునిం బడసి మఱియును లంకకంటె సహస్రగుణాతిశయం బగు ప్రతాపలంక యనునొక్కపట్టణంబు సముద్రమధ్యంబున విశ్వకర్మచే నిర్మింపఁజేసి యందు శతకంఠునికిం బట్టంబుగట్టి వెండియుఁ దపంబున కరిగె నంత. 79

---

*వ. అని యత్త్రముం డశోకనాఁడు వనాంతరంబున కేగి యశ్వత్థతరుమూలంబున వేదిక నిర్మించి యందుఁ గుశాసనం బుంచి యందుపై బిల్వపత్త్రంబులు పఱచి తిలాక్షతోదకంబులు చల్లి భూశుద్ధిగావించి యందుఁ గూర్చుండి భూతశుద్ధిం జేసి యంతర్మాతృకల బహిర్మాతృకలుగాఁ జేసి యమనియమప్రత్యాహారధ్యానధారణసమాధ్యష్టాంగయోగంబుఁ బూని భ్రూమధ్యంబునఁ బున్నమచంద్రుని దనచూడ్కిని నిల్పి నిరీక్షణంబులు నంతర్లక్ష్యంబులుగాఁ జేసి త్రిమూర్త్యాత్మకుండైనభానుం దలంచి తపంబు విశేషోద్ధతి గావించిన భానుండు ప్రసన్నుండై జగద్భయదప్రతాపశాలియగు నొక్కపుత్త్రుని దయచేసి యిచుం డంతర్ధానుండయ్యె నంత ఖండనోద్దండశతద్వయభుజార్గళుం డగుతనయునిఁ బడసి మఱియు లంక కంటె సహస్రగుణాతిశయంబగు ప్రతాపలంకాపట్టణంబును సురసముద్రంబున విశ్వకర్మచే నిర్మితంబుచేసి యందుఁ దొమ్మిదికోట్లవీథులును బదునెనిమిదికోట్ల శివాలయంబులును సహస్రయోజనవిస్తీర్ణంబును దశసహస్రయోజనోన్నతంబును గలపట్టణంబున శతకంఠుని బట్టంబుఁగట్టి వెండియుఁ దపంబున కరిగె నంత.

క. మీరును రావణముఖ్య
క్రూరాసురవరులఁ జంపి కువలయమెల్లన్
గౌరవమున రక్షించితి
రారూఢిగ వేల్పులును సహాయనిపొగడన్. 80

గీ. శతముఖుండును రావణక్షయముఁ గుంభ
కర్ణమరణంబు నింద్రజిత్కాయభగ్న
మంతయును విన్చి విలయకాలాగ్నిపగిది
మండి దండిగ నూహించె మనసులోన. 81

గీ. నరులు వానరులన నెంత నాకుఁ దృణము
జగతిఁ దక్కినవారిచేఁ జావకుండ
నిమ్ము వరమని యలభారతీశుఁగోరెఁ
గాని రావణుఁ డేష్యంబు గానఁడయ్యె. 82.

వ. కావునఁ బరపురుషులచే నెవ్వరివలనం జావులేకుండ విరించిని
వరంబుగోరి యటమీఁద రాముని సంహరించి తనయగ్రజుల
పగ యీఁగెదనని ప్రతాపలంకాపురిపాలనంబునకు నాప్తులగు
మంత్రులం బ్రతిష్ఠించి, మాణిక్యకనకరజతతామ్రలోహాది
నవప్రాకారరక్షకు లగురాక్షసుల నాదరించి, యొకమహా
రణ్యంబునకుం జని యందుఁ గృతస్నానుండై భారతీరమణు
నుద్దేశించి, జగదద్భుతంబుగాఁ బంచాగ్నిమధ్యంబున నచ్చోట
[1]బొటనవ్రేలూఁతగొని నిక్కి హస్తంబులెత్తి మహోష్ణ
చండమధ్యాహ్నమార్తాండమండలంబుఁ జూచుచు నిరా
హారుండై వెయ్యేండ్లు తపంబుగావించె నంత. 83

1 మొనవ్రేలు.

చ. జగములు తల్లడిల్లె రవిచంద్రులు గప్పడరైరి పెల్లుగా
దిగిభములెల్ల మ్రొగ్గె జలధివ్రజ మింకె సమస్తజీవముల్
వగచె సురేంద్రుఁడుఁ బెదరె వాయువణంగె హిరణ్యగర్భుఁడున్
మొగి నదుదెంచి నిల్చె నతిమోహముతో శతకంఠుముందటన్.

వ. ఇవ్విధంబున నవ్వేకించి సుప్రసన్నుండై కరుణారసంబు
పెల్లుబ్బ నబ్బురంబుగా నిట్లనియె. 85

శా. అన్నా యోయి శతాస్య యశ్రమతనూజా యుష్మదుద్య
త్తపో, తన్నిష్ఠత్వంబున కిచ్చ మెచ్చితి వరం బూహింపుమా
యిచ్చెదం, గన్ను లిప్పుము నన్నుఁ జూడు మనుచుం
గారుణ్యపాథోధియై, చెన్నారం దను నాదరింపఁ బరమేష్ఠిం
జూచి హర్షాత్ముఁడై. 86

మ. కరముల్ మోడ్చి విరించికిన్ శతనమస్కారంబు [1]లందంద యు
త్కరమౌ భక్తి నొనర్చి లేచి తనవక్త్రంబుల్ విడంబించి యో
హరినాభీకమలోద్భవా నిగమవిన్యాసప్రశస్తాననా
కరుణాసాగర నీకు మ్రొక్కెదను మత్కామ్యంబు లీడేర్పవే.

వ. అనిమఱియు బహువిధంబులఁ గైవారంబుఁ జేసిన విని వనజ
సంభవుండు పరమప్రీతుండై యొక్కవరంబు వేఁడు మొసం
గెద ననుడు శతముఖుండును సంతసిల్లి, అయ్యా నెయ్యం
బున వరంబులు గరంబు నొసంగుతలంపు మీకుండెనేని
యక్షరాక్షస గరుడగంధర్వసిద్ధవిద్యాధర కిన్నరకింపురుష
సురనరవానరాదు లగుపురుషులవలనను, మృగాండజ భుజం
గమలోకంబులవలనను, మీనకర్కట మకరకచ్ఛపాది జల
చరసముదయంబువలనను మరణంబు లేకుండనిమ్మనిన నప్పర

---

1 లందంద నిద్ధరపై.

మేష్టియుం దప్పక దయచేసి మఱియు నొక్కవరంబు వేఁడు మనిన దనుజేంద్రుండుహర్షించి, రణంబుసేయునెడఁ దవశరీరంబునం గలశోణితకణం బెచటం దొఱంగు నచట నూర్గురు శతముఖులు జనించునట్లుగా [1]ననుగ్రహింపుమనుడు జలజాసనుండును నత్తెఱంగునకు సమ్మతించి, నీతపోమహిమంబునకు మూఁడులోకంబులందు సరియెఱుంగము గావున నింకొక్కవరం బడుగుమని సుప్రసన్నుండై నం గని జరయును, శ్రమయును, పరితాపంబును, భయంబును, దైన్యంబును నెన్నండును దన్నుం బొరయకుండ వరంబొసంగు మనవుడు విరించి యట్లగుంగాకయని దీవించి యంతర్ధానంబు నొందె శతముఖుండును ప్రతాపలంకాభిముఖుండై చనునెడ. 88

క. మెండుకొన భయము ధరణీ
మండలమది తల్లడిల్లె మూఁగుడుదిశలన్
నిండుకొనె నిర్జరేంద్రుఁడు
గుండియ జల్లనఁగఁ జేతికులిశము వైచెన్. 89

వ. శతముఖుండును గమలసంభవదయాసంప్రాప్త వరప్రభావధురంధరుండై తనపురంబు ప్రవేశించి, తనజ్ఞాతులగు రావణకుంభకర్ణుల పగయీఁగి రాముని౦ దునిమెద నతం డగుపడుదనుకను దత్ప్రియంబులగు గోబ్రాహ్మణముని దేవతాసంఘంబుల హననంబు గావించెదనని ప్రధానులును దండనాయకులును దన్నుంగొలువ సకలదిక్కులును వ్రక్కలు గావించి, దేవతలపురంబునకు దాడివెట్టి, దివిజులం బాఱఁ దోలి మఱలి మాయాశ్రమంబులు చూఱలాడి, కొందఱు

1 ప్రసాదింపు.

మునులం జంపి, పతివ్రత లగుతరుణులఁ జెఱలుగొని, హోమ
ధేనువులం దినిమి, యివి మొదలుగాఁగల యనేకహింసలు
గావింపఁ బోడం గె నని వెండియు రామచంద్రున కిట్లనిరి. 90

ఆ. ఈప్రవప్ప మాకు నెవ్వారు దిక్కు లే
రట్లుగాన భీతి నమరవరులు
వెలయ మిమ్ముఁ జేరి వేఁడుకొండని పంప
వచ్చినార మభయమిచ్చి ప్రోవు. 91

ఆ. అనుచు బాష్పధార లక్షుల దొరలఁగా
నతిభయాత్తు లగుచు నమ్మునీంద్రు
లున్న వారి నుడుప నూహించి రామభూ
వరుఁడు పలికె మధురవాక్యములను. 92

ఆ. తెగువ నింతసేయు దేవతాద్రోహిని
సంహరించి మిమ్ము సకలసురలఁ
గాతుఁ గరుణమీఱఁ గావఁగా లేకున్నఁ
బ్రాణమేల [1]యీక్పపాణమేల. 93

ఆ. అనుచు వారి కభయహస్తంబులిడి పంచె
నఘవిదూరుఁ డైనరఘువరుండు
చనిరి మునివరులును సంతోషభరితులై
మగిడి తత్తదాశ్రమంబులకును. 94

గీ. చనినఁబిమ్మట నేకాంతసౌధమందు
రాఘవుఁడు భూరితరశరలాఘవుండు
మహిమతోడుతసౌమిత్రిమైత్రి మెఱయఁ
జేరికొలువంగఁ గూర్చుండి చిత్తమునను. 95

---

1 యింక బాణమేల.

క. శతముఖుని [1]జన్మమహిమయు
జతనంబుగ నతఁడు తపముసలిపినధైర్య
స్థితియును వరములు గొనుటయు
మతిలోఁ దలపోసి దీనమానసుఁడయ్యెన్. 96

క. తా నసురాంతకుఁడయ్యును
మానవుఁడై యుంటఁజేసి మహిమలు తెలియం
గానోపక పలుమాఱును
వానిపరాక్రమముఁ దలఁచి వనరఁగఁదొడఁగెన్. 97

వ. ఇట్లు తలంకుచుఁ దదనంతరం బాసుమంత్రాదిమంత్రుల నటకు
రావించి, వారు వినంగ లక్ష్మణుమొగంబై యిట్లనియె. 98

సీ. కెరలెడి దధిఘృతక్షీరసురాసము
ద్రంబు లేవిధమున దాఁటవచ్చు
దాఁటెఁబో పూని విధాతృఁడిచ్చినవర
గర్వ మెత్తెఱఁగునఁ గడవవచ్చుఁ
గడచెఁబో నపవరిఖాయుతప్రాకార
పట్టణం బెటు లగ్గపట్టవచ్చుఁ
బట్టెఁబో కలనిలోఁ బరపురుషాభేద్య
దనుజవల్లభు నెట్లు దునుమవచ్చు

గీ. నేలవచ్చిరి సకలమునీంద్రు లిటకు
నేలప్రతినలు గావించి తేను దనుజ
వంశవిభుఁ డెట్టికైవడి వసుధఁ గూలు
నకట తమకించి పలుకుట హానిగాదె. 99

1 సంభవంబును.

వ. అని తానును లక్ష్మణుండునుం దక్కఁ దక్కినబలసామగ్రి చాలకుండుటకును, చతుస్సముద్రలంఘనంబు గావింపఁజాలకుండుటకును నిర్విణ్ణహృదయుండై యూరకుండె మంత్రులు నిట్టిట్టని యూహింపనేరరైరి తత్ప్రకారంబు వీక్షించి కోపారుణితలోచనుండై సౌమిత్రి రామచంద్రున కిట్లనియె. 100

గీ. శతముఖునియంత రాక్షసచక్రవర్తి
నెట్లు సాధింతునని విచారింపనేల
తూలికాపర్వతంబును ధూళిచేయ
మిణుఁగు ఱెంకైనఁ జాలదే మేదినీశ. 101

వ. అట్లుగా విచారింపు మదియునుంగాక. 102

చ. వడిఁ గబళింతునే శశిదివా[1]కరబింబములం గణంకమైఁ
బుడిసిటిలోన నిల్పుదునె భూరిపయోనిధులెల్లఁ బెల్లుగాఁ
బిడుగునుబోలుముష్టిహతిఁ బృథ్వియు నింగియు ధూళిచేతునే
యొడపక నాదుముందఱ సహించి శతాస్యునిఁ జెప్పనేటికిన్.

శా. చిత్రం బొప్పఁ దపంబుచేసి శివు [2]సత్కీర్ణాత్రిశూలం బొగిన్
సుత్రామాదులు మెచ్చఁ గైకొని నృపక్షోభప్రశస్తిన్ బుధా
మిత్రాత్మున్ లవణాసురుం దునుమఁడే మీరెల్ల హర్షింప నా
శత్రుఘ్నుండణుమాత్రుఁడే తలఁపఁగా సంగ్రామరంగంబునన్.

చ. నిరుపమవిక్రమస్థితిని నీసరివచ్చు నపారఘోరసం
గర మగువేళ దుర్విమతఖండనమంత్ర మెఱుంగుఁ గ్రమ్మఱం
బరబల మెత్తివచ్చిన శుభం బొనఁగూర్చుకొనంగ నేర్చు నా
భరతుఁడు కేవలుండె యురుభండనభూమిని రాఘవేశ్వరా

1 కరులం బటుభీమశక్తిచే. 2 మెచ్చించి.

శా. వారాశిన్ మున్ను మహాధ్వరాశ్వమునకై దర్పించి మ మ్మందఱన్
గుంపెల్ ప్రీలఁగ నేయరే దివిజు లాఘోషింప యుద్ధంబునన్
పెంచి న్నిమ్ములనుం జెనంకి మనరే వేగంబునన్ ఖండనో
ద్దండుం డాకుశుండున్ లవుండు ధర నేతన్మాత్రులే భూవరా.

చ. కలికుఁడు విద్యలందుఁ బర రాజభయంకరుఁ డెంచి చూడఁగా
నలిముఖశిక్షణాస్త్రవివిధాశుగసంచితశౌర్యశాలి దై
[1]త్ర్యశమనమూర్తి శుంభదఘనాయణగోత్రపవిత్ర ధార మీ
కుశునికుమారుఁ డుగ్రరణకోవిదుఁ డావిజయుండు చేలయే.

మ. అదియట్లుండఁగనిమ్ము వేల్పులు రణోద్యత్ప్రౌఢిభవుల్ దన్ను దె
బ్బదిరెండ్వేల్వల్వలుగోల్వ రౌద్రముఖుఁడై భానుప్రభల్ మీ
ఱఁగా, నదనం దన్ను నెదిర్చినన్ భయదవాలాభీలుఁడై మృ
త్యువురన్, గెదుమంగాఁ గలబాహువిక్రముఁడు సుగ్రీవుండు
సామాన్యుఁడే. 108

శా. ఓష్ఠద్వంద్వము పెల్లుగా నదర రాహుంబోలి మందోదరిన్
నిష్ఠూరంబుగఁ బట్టి తెచ్చుచుఁ గపుల్ నిక్కన్ దశాస్యాగ్రహా
న్నిష్ఠాభంగముఁజేసి పెంపుగనఁడే నీముందటన్ వానర
శ్రేష్ఠుం డంగదుఁ డంతవాఁడు గలుగం జింతింపఁగా నేటికిన్.

శా. తల్లిం దండ్రిని నీవె యంచును మదిం దాత్పర్య మొప్పంగ మీ
కెల్లం దానె విచారము ల్దెలుపు చెంతే దానవాధీశహృ
ద్భల్లంబై చరియించు భండనమునం బ్రత్యర్థిసంహారుఁ డా
భల్లూకేంద్రుఁడు జాంబవంతుఁడు తలంపం [2]గొంచెమే
యెంచఁగన్. 110

---

1 విశదయశోవివర్ధనుఁడు వీరపరాక్రమచక్రవర్తి మీ, కుశుఁడు కొమా
రుఁడుండ మఱికుందఁ బనేమి నృపాలశేఖరా. 2 గొంచుడే.

శా. కేల న్సాలమహీజయుగ్మము రణాంగీకార మొప్పన్ మహా
ఖేలంబై ధరియించి మొల్లపికెలు న్వేపిల్లఁగా నార్చుచున్
వాలం బక్రముపోఁకఁ జూఁపి రిపుల న్వారించుధీరాత్ముఁ డా
నీలున్ శౌర్యగుణాలవాలు నెదుర న్రెట్టించువారే రిలన్.

ఉ. కార్ముకమందెనేని కటుకాండపరంపరచే నరాతులన్
మర్మము లుచ్చిపోవ ననమానచమత్కృతిసేయ నేర్పు దు
ష్కర్ములఁ గూడఁ ద్రెళ్ళఁ దునుశౌర్యసుధైర్యుఁడు శార్ఙ్గవేది
జ్యోతిర్ముఖుఁ డంతవాఁడు మనదిక్కునఁ గల్గఁగఁ జింతయేటికిన్.

చ. క్షితిధరవృక్షవర్గ మఱచేతుల నిల్పి కడంగిరేని యా
శితిగళుఁడైన భీతిలు నశేషపరాక్రము లాహవంబునన్
దితిసుతలోకశుష్కవనతీవ్రదవానలకీల లుగ్రులా
శతబలియు న్గవాక్షుఁడును జాలరె దైత్యుని సంహరింపఁగన్.

వ. మఱియు నదియునుంగాక వానరకులోద్ధారకుం డగుతార
కుండును, మహాభుజుం డగు గజుండును, వజ్రధారా ప్రతి
మానకరభుండగు శరభుండును, సమరజయోపమాన స్తైము
లగు గోముఖ, గంధమాదన, ఋషభ, మైంద, ద్వివిద, వేగ
దర్శి, గవయ ప్రముఖ నిఖిలమహావనచరచమూ[1]నాయకులును
గడంగిరేని చతుర్దశభువనంబులుం బరిమార్పనోపరే అది
యునుంగాక మీఁద పెట్టినచెట్టు విభీషణుం డిట్టిసమయంబునఁ
దోడు రాకుండునే అతం డలిగిన సకలబ్రహ్మాండంబులుం
[2]జూఱలాడఁడే ఇంతబలసామగ్రిగలుగ నసురవరునికొఱకు
నీ వింత వంత నొందఁదగునే యని మహాబలవంతుం డగు

1 సముదయంబులు గడంగిరేని. 2 పరిమార్పనోపఁడే.

హనుమంతునిం దలంచి చిఱునవ్వునవ్వుచు లక్ష్మణుండు
వెండియు రామచంద్రున కిట్లనియె. 114

సీ. పుట్టినప్పుడె పట్టి పెట్టిదంబుగ[1] నట్టె
మ్రింగఁడే భానుని నింగి కెగిసి
అసమానజవముచే నలరి కాల్వయుఁబోలె
దాఁటఁడే యలసముద్రంబుఁ గదిసి
లంకాపురము సొచ్చి శంక యించుకలేక
హతునిఁ గావింపఁడే యక్షుఁ గణఁగి
దీపితాటోపకోపాపారశిఖిశిఖా
తతులచేఁ గాల్పఁడే తత్పురంబు
తే. [2]అట్టి జగజెట్టి యగు గాడ్పుపట్టి మనకు
నిట్టివేళలఁ గలుగంగ నేల వగవ
నతఁడు గడఁగిన శతకంఠుఁ డనఁగ నెంత
యొక్కవ్రేల్మిడి నెగమీటు నుర్వియెల్ల. 115

*వ. మఱచితిరే నాఁడు మనల నిరువురం గొనిపోయి మహిరావణుండు పాతాళంబున భద్రకాళికిఁ బ్రియంబుగా నిచ్చి త్రుంపం బూనుసమయంబున నొకశతపత్త్రనాళంబున సూక్ష్మ

1 భాను నొడిసి మ్రింగఁడె మింటికడకు నేగి. 2 అట్టి బలుదిట్ట.

* ఈవచనములో మొదటినుండియు...మనకాప్తుండై యున్నవాఁడు. అను వఱకు నొక్కప్రతిలో నీసీసపద్యమున్నది.

సీ. మఱచితిరే నాఁడు మైరావణుఁడు గొంచుఁబోయి పాతాళంబు సొచ్చఁగ మనల
భద్రకాళికిఁ బ్రియంబడఁ జెల్ల భేదించుసమయంబునందున సారసంపు
నాళంబునను సూక్ష్మనాళుఁడై తగవచ్చి యచ్చటఁగాపున్న మత్స్యపతితోఁ
బోరాడి పాతాళనిశాటవులఁ గొట్టి మైరావణుని రూపుమాపి మనల

గీ. కార్యఖడ్గములనసందుఁ గలవు రెండు
గార్యముత్తమ మది చక్కఁగాకయున్నఁ
బలువిధంబుల నవ్వలిబల మెఱింగి
ఖడ్గ మొనరింప నటమీఁది కర్జమండ్రు. 119

వ. అది గావున మొదట సామదానమాయోపాయ భేదంబుల శతకంఠుం బరిమార్పనూహించెద. అట్లొనఁగూడకున్న దండంబున దండధరునిలోకంబున కనిచెద. వాఁడన నెంత? యింతలో విభీషణుని రావించి యతనివలన శతాస్యునివర్తనంబు లన్నియుం దెలిసికొని యటమీఁద నమ్మహాత్ముండు చెప్పిన త్రోవం జనుదమని విభీషణుందలంచిన నతండునుదనమనంబున హర్షించి యెవ్వరికి నెఱింగింపక యతిశీఘ్రగమనంబున. 120

చ. అనిలుఁడు నన్నలుండు హరుఁ డాదిగఁగల్గినమంత్రులందఱుం
దనుఁగొలువ న్సముద్రము ముదంబున దాఁటిబలంబు నెక్కొనన్, వెనుకొని యభ్రవీథిని నవీనజవంబునవచ్చి వచ్చి స
జ్జనమణియైన రాఘవుని సన్నుతిసేయుచుఁ దత్పురంబునన్. 121

క. రామునిఁ గోమలమేఘ
శ్యాముని మునిలోకపతితసంతతవిలస
న్నాముని శాత్రవభీమునిఁ
బ్రేమను వీక్షించె నవ్విభీషణుఁ డెలమిన్. 122

క. వీక్షించి యతనిచరణము
లక్షీణదయామనస్కుఁడై తననిటలం
బాక్షితిని సోఁక మ్రొక్కుచు
రాక్షసనాయకుఁడు లేచి [1] ప్రవిమలభక్తిన్. 123

---

1 రసికోత్తముఁడై.

వ. మఱియు ననేకవిధంబుల గోబ్రాహ్మణదేవతాహననంబును సకల దిశారమణాతాడనంబును, అఖిలజీవసంక్షోభంబును గావింప నద్దురాత్ముండు చేయుబాధలకుం జాలక మునిదేవతానివహంబు లరుదెంచి, తమతమబాధలతెఱం గంతయు నెఱింగించి శరణుచొచ్చినం గరుణించి యభయహస్తంబు లిచ్చి పంచితి; ఇటఁమీఁద నేదియుం దెలియక యద్దానవుని వర్తనంబులన్ని నీచే నెఱుంగుటకు నిన్ను రావించితిననిన విని విభీషణుండు సజ్జనవరేణ్యుని కరుణావలోకనమహిమంబునకు నిచ్చ నచ్చెరుపడి మచ్చిక నిట్లనియె. 129

సీ. జంభారిగంభీరదంభోళిధారతోఁ
బర్వతం బొకటితీర్పంగఁ గలదె
కఠిననఖాభీలకంఠీరవంబుతో
భద్రేభ మొకటి దీర్పంగఁ గలదె
సంవర్తసమయప్రచండానలముతోడ
నెఱిశుష్కగహనంబు నిలువఁగలదె
ఝంఝూహ్వయప్రభంజనమహాధాటితోఁ
గొలఁదిగా మబ్బు మార్కొనఁగఁగలదె
తే. ఎంతవాఁడైన వరముల నెన్నిగొనినఁ
గనలి నీతోడనెదిరించి మనఁగఁ గలఁడె
పుడమిఁ బటుచూర్ణమై తానె పోనుగాక
[1]రఘుకులాంభోధిచంద్ర శ్రీరామచంద్ర. 130

క. పగవారిని మీఁదెదుటను
బొగడగ రాదైనఁగాని భూమీశ్వర న

---

1 రామణీయకగుణసాంద్ర రాఘవేంద్ర.

న్నాఁగినడిగినందునకు దై
త్యగణాధిపు మర్మ మెల్లఁ దగ నెఱిఁగింతున్. 131

క. పంకజగర్భుండైనను
శంకామతినుండుఁ [1]బొగడఁజాలక నేను
టంకింపఁ గలనె సకలా
లంకాపురతత్ప్రతాపలంక మహీశా. 132

క. ప్రాకారంబులు తొమ్మిది
భీకరమైయుండు జంభభిన్ముఖ్యసురా
నీకంబులకును దక్కిన
లోకుల నిఁకఁ జెప్పనేల లోకాధీశా. 133

వ. మఱియుఁ బ్రతాపలంకామార్గంబు విన్నవింతు నవధరింపుఁ డని యవ్విభీషణుండు చెప్పందొడంగెఁ బరిఖాజలప్రమాణంబు పాతాళంబు నతిక్రమించి, బ్రహ్మరుద్రాదులకు నభేద్యంబై ప్రవర్తిల్లు; దీర్ఘజిహ్వ, శిఖిముఖ, స్థూలకంఠ, యోజనహస్త, దుర్ముఖ, శూర్పకర్ణ, రక్తాక్ష, పింగళాక్ష, గజోదర, ప్రముఖులను మంత్రులు పదునెన మంద్రు వర్తింతురు; అందు నొక్కొక్కమంత్రిని నేనూఱుకోట్లరాక్షసులు సేవింతురు; అందు నొక్కొక్కమంత్రి మృత్యువునైనఁ బొరిఁగొనఁజాలు; అందఱుఁ గూడినఁ జతుర్దశభువనంబులనుం జప్పరింతురు; వారికి నాథుండు శతముఖుండు. పరమేష్ఠిచే సకలపురుషాభేద్యత్వము మొదలుగాఁగలుగు ననేకదుర్లభవరంబులు గొని విష్ణుశంకరాదులఁ దృణీకరించుచు నతండు మనంబున నేను మిమ్ము సేవించి మీచేత రావణాదులం దునిమించితి నని నన్నుం

1 బొగడఁజాలఁడేను బొంకింపఁగలను.

జంపఁ దలంచుచుండు; నాకు నతనికి వైరంబెప్పుడును గలదు;
వాఁడు మీచేతనే కాని మఱియెవ్వరికి నజేయుం డనియె. 134

గీ. శతముఖునికింకరులు తన్ను హతునిఁజేయ
నకట యెప్పుడు వత్తురో యనుచు దిశలు
చూచుచుండఁగఁ జాలవీచూపు లనుచు
నమరభర్త సహస్రాక్షుఁ డయ్యెఁగాదె. 135

గీ. ఉరుబలాధికుఁడగు శతాస్యుఁడు మదించి
దాడి మనమీఁద నెక్కుడఁదరలి వచ్చు
నోకొ యని భీతిమై నేను నుక్కుదక్కి
తారకాచలగహ్వరాంతమున నుందు. 136

వ. అనిన విని పార్వతీదేవి మహాశ్చర్యంబునొంది చిఱునవ్వు
నవ్వుచు శంకరుమొగంబుపైఁ దనచూడ్కి నిల్పి మహాత్మా!
యిట్టి విచిత్రంబగుచరిత్రంబు నెన్నండును వినియును గని
యును నే నెఱుంగ;నీదివ్యకథావిధానం బెప్పుడుఁ దాకర్ణింపఁ
బూను నతనికి నాయురారోగ్యంబులును మహదైశ్వర్యం
బును పుత్రపౌత్రలాభంబును సకలబంధునివహానుకూలం
బును నై యాచంద్రతారకంబుగా వర్ధిల్లు నటుగాన నేను
గృతార్థురాల నైతి నటమీఁదివృత్తాంతం బానతిమ్మనిన నమ్మహా
దేవుం డిట్లనియె అట్లు విభీషణుండు శతకంఠుని మహిమంబు
కొంత వినిపించి రామచంద్రునకు వెండియు నిట్లనియె. 137

క. అతులితదోర్బలమునకును
వితతపరాక్రమమునకును వివరింపఁగ నీ
శతముఖునకు రావణునకు
మతిలోఁ దలపోయ హస్తిమశకాంతరముల్. 138

క. కావున శతముఖుఁ దునుమఁగ
నీ వే కాకొండుగలఁడె నృపవర! వేగన్
రావింపుము యుద్ధమునకుఁ
బావనులగు హనుమదాదిబలములనెల్లన్. 139

సీ. నావుడు విని నరనాథుండు చింతించి
యేవిధమున దాఁటు దేనువార్ధి
లెవ్వరిబలమున నేగుదాహవమున
కేవిధమునఁ ద్రుంతు నేను రిపుల
నేలాగు పోషింతు నెల్లరయోగిఁద్రుల
నెట్లుద్ధరింతు నేనేమిసేతు
దేవతాభయము లేలెఱుఁగున వారింతు
వడిసైన్యముల మఱెవ్వాఁడు నడుపు
గీ. ననుచుఁ దలపోసి తలపోసి యాత్మయందు
నంతయును జూచి యాహనుమంతునుండి
కొంతకార్యంబు మఱి సమకూరు ననుచుఁ
గోరి ధైర్యంబు మదిఁ బురికొల్పియపుడు 140

క. హనుమంతునిఁ బటుదోర్బల
ధనవంతుని సకలధరణిపైవతనుత స
ద్ఘనశాంతునిఁ గపికాంతునిఁ
జనుదెమ్మని రాఘవుండు చయ్యనఁ దలచెన్. 141

ఉ. అగ్గతి నానృపాలమణి యాత్మఁ దలంచిన మారుతాత్మజుం
డగ్గలమైనమోదము భయంబును భక్తియునుం బెనంగఁగా
నగ్గురుగంధమాదనమహాచలశృంగముమీఁదినుండి తా
దిగ్గున నేగుఁదెంచె నతితీవ్రరయంబునఁ దత్క్షణంబునన్. 142

వ. ఇట్లు సంభ్రమంబున మనోవేగుండై వచ్చి సాకేతనగరంబు
సొచ్చి యొక్కచక్కని ముహూర్తంబున. 143

ఉ. [1]శీలుని దివ్యనూత్నమణిచేలునిఁ బావనవిస్ఫుటానల
జ్వాలుని ధర్మసద్గుణవిశాలుని ఖండకళానిధిస్ఫుర
త్ఫాలుని ఘోరశాత్రవవిఫాలుని ధీరుని రామభద్ర భూ
పాలునిఁ గాంచి తచ్చరణపద్మములంబడి లేచి నిల్చుచున్.

చ. కరములు మోడ్చి యోదనుజఖండన యోకరుణాసముద్ర యో
పరమవివేక యోకలుషభంజన యోరఘురామచంద్ర మీ
చరణపయోజముల్ భజనసల్పఁగ నేర్చుటమూఁడులోకముల్
తరలక వేడ్క నేలుటగదా తలపోయఁగ మానవేశ్వరా. 145

చ. ధరణిసుతాధిపాయ భుజదండవినిర్జితదానవాయ భా
స్కరకులసంభవాయ జలజాత [2]దళాయతలోచనాయ సం
గరవిజయాయ తాపసనికాయనుతాయ సతాయ తే నమో
పరమకృపాత్మనే వరనృపాయ రఘూత్తమ రాజసత్తమా.

ఉ. ఏపనికైన నన్ను జగదీశ్వర పంపుము సప్తవార్ధులుం
దాపులుపన్ని సైన్యములు దాఁటఁగఁ జేతునొ మృత్యువక్త్రము
ల్దాపలిచేత మూయుదునొ డాసి కృతాంతునిఁబట్టి తెత్తునో
భూపకులావతంస వెసఁబూని కులాద్రులు పెల్లగింతునో. 147

వ. అని పెక్కుభంగుల సన్నుతింప దశస్యందననందనుండు మరు
న్నందనుం గరుణామృతలహరులు చెదర నవలోకించి రమ్ము
రమ్మని యొమ్ముయొమ్మునఁ గదియ నాలింగనంబు గావించి,
కుశలం బడిగి పథిశ్రమంబుదీఱ నొక్కహర్మ్యంబున విడియ

---

1 మేలుఁగ దివ్యనూత్నమణిమేఖలభూషణధారు బావకజ్వాలుని
దైత్యఖండనుగ వాన్నిధివిస్ఫుటతేజపాలుఁ భూపాలుని. 2 పలాశవిలోచనాయ.

నియమించి పంపిన నతండు చనియె విభీషణుం గనుంగొని
యిష్టమహామహునిచేతఁ గాని కార్యంబులోనఁ గూడవని యిష్టా
లాపంబుల రాత్రి గడపి మఱునాఁడు సంధ్యాదిక్రియలు
నిర్వర్తించి, గురు పితృపూజనంబులు గావించి అగ్నిహో
త్రంబులు వర్తించి విప్రసమూహంబులకుఁ గర్పూరతాంబూల
కరంబుల లొసంగి వారిచే నాయురారోగ్యాశీర్వాదంబులు
గైకొని భరతశత్రుఘ్న లక్ష్మణవిభీషణాదులతోఁ గూడ నలం
కృతుండై సుమంత్రాదిమంత్రులుం గొలువ నేకాంతసౌధంబునం
గూర్చుండి అప్పటికి హనుమంతుని రప్పించి అతండును దానును
విభీషణుండును రావణకుంభకర్ణ దేవాంతక నరాంతక కంప
నాతికాయ మహాకాయేంద్రజిత్ప్రహస్త మహోదర
మహాపార్శ్వ ధూమ్రాక్ష యూపాక్ష స్ఫటికరోమాగ్నివర్ణ
ప్రముఖనిఖిలదానవమహాస్త్రాండ భండన ప్రకారంబు లుగ్గ
డించుచు నెడనెడ మాటలం గొనియాడుచుఁ గొంత ప్రొద్దు
పుచ్చి హనుమంతునికి శతకంఠుని ప్రకారం బెఱింగింపుమని
విభీషణునకుఁ గన్నుసన్న గావింప నమ్మహాత్ముండును సమ్మదం
బున నమ్మరుత్పుత్రునకుఁ దెలిపెడ శతకంఠునిజన్మంబును తపో
మహిమంబును జలజజుచలన వరంబులు గొనినతెఱంగును
మునిదేవతాప్రహారణంబులును చతుస్సముద్రలంఘనప్ర
యాసంబును పరిఖావిశేషంబును ప్రాకారప్రకారంబును
ద్వారపాలక మహాదానవనివహ విక్రమంబులును మంత్రి
ప్రచండత్వంబును గరతలామలకంబుగా నెఱింగించిన విని
వనచరవర్యుండు గగనంబు ముట్టఁ గుప్పించి గంతులిడుచు

రామభద్రునిం గొనియాడుచుం దనచే నింతయు సాధ్యం
బగుట మనంబున నిశ్చయించి రఘువల్లభున కిట్లనియె. 148

గీ. అన్న రాఘవ నీబంటనున్న వాఁడ
నెంతవాఁడైన వాఁడన నెంత మనకు
మీరు బంపిన నేగి యాక్రూరుఁడైన
శతముఖునిఁ జంపి యేతెంతు జతనముగను. 149

సీ. అది యెటువలెనన్న నబ్జజాధీశుని
శక్తి నాయందున సంఘటిల్లు
నరయజగత్ప్రాణుఁడైన మాతండ్రిచే
జవసత్త్వములు నాకుఁ జాలఁగలుగు
[1]నశ్రమశౌర్యంబు నజరత్వ మమృతియు
నమరులవలన నాయందునుండు
నదిగాక మీదివ్యహస్తసంస్పర్శచే
మెండుగా వజ్రదేహుండ నైతిఁ

గీ. గాన మీయాజ్ఞఁ దలమోచి కడిసికడఁగి
యనికిఁ దొడఁగిన శతకంఠుఁ డనగనెంత
యట్టహాసంబుచేసి కాలాగ్ని నైనఁ
బట్టిమ్రింగుదుఁ జలపట్టి పంతముగను. 150

గీ. దాఁటరాదని జలధులు దడయనేల
మెఱసి దాఁటెంతు వాలంబుమీఁద నేనఁ
దవిలి యాత్మస్తవంబుగాఁ దలఁపవలదు
తథ్య మింతయు నీదుపాదంబు లాన. 151

---

1 శ్రమయును దైన్యంబు జననంబు మరణంబు నమరులరీతి నాయందు లేవు.

వ. అని మరుత్సుతుండు వెండియు నిట్లనియె దేవా మీరు నమ్మించిన నమ్మక సుగ్రీవుండు మీచే దుందుభికళేబరంబు మీటించి సప్తతాళంబుల నొక్కకోలఁ దునియనేయించి యట మీఁద నాశ్రయించెఁ గాదె; కావున మీరును నామహారూపంబు చూపిన వీక్షించినంగాని సమ్మతింప రెల్లి మీవేఁ జంద్రతారాబలంబులు గలిగియున్నవి. నేనును నాయందుఁ గల బలంబు తేటతెల్లంబు చేసెద నని నృపవరునిచే ననుజ్ఞ వడసి యారేయి తనమనంబున నన్నుం గూర్చి ఘటికాదశకంబు ధ్యానంబుచేసిన నతండు మదంశసంభవుండు గావున నేనును బ్రీతుండనై ప్రసన్నుండనైతి నప్పవనజుండు నన్ను వీక్షించి యిట్లని స్తుతించె. 152

దండకము. శ్రీమన్మహాదేవ దేవాది దేవస్ఫురచ్చారుకోటీర దేదీప్యమానోల్లసద్రత్నకాంతిచ్ఛటామండితాంఘ్రిద్వయా యద్వితీయా క్రియా విక్రమా చాపహస్తప్రశస్తా బుధస్తుత్య సత్యాంగకా సత్యభాషా విశేషాహిభూషా సురాధ్యక్ష దక్షాధ్వరధ్వంస కంసారిమిత్రా త్రినేత్రా సుగంగాకళత్రా మహాగాత్ర యీశా మహేశా సురేశా ప్రకాశా నిశాటోర్ధ్వజూటా వృషాధీశఘోటా శివా పాపకల్లోలినీ సత్పదాఘోరసంసారదూరా హరా నిర్వికారా మహాకారకారుణ్యపాథోనిధీ ధీనిధీ మారభూతప్రియా భూతనాథా జగన్నేత మృత్యుంజయా కృత్తివాసా మహోల్లాస పంచాననా పంచబాణాంతకా బాణపోషా విపక్షక్షయా అక్షయా యక్షగంధర్వవిద్యాధరానీకసంసేవ్య భవ్యా మహానీలభద్రేభచర్మాంబరా! తాండవాడంబరా పాండురాటోపశుంభద్వృ

క. ఈరీతివచ్చి రాఘవు
భూరిపదంబులను వ్రాలి భువి తనమూర్తిన్
వారకచూప ననుజ్ఞను
భోరునఁ గొని చెలఁగి వాయుపుత్త్రుం డచటన్. 157

సీ. తనదువాలంబుమార్తాండ ప్రచండ
రథమ్మున కుగ్ర కేతనముగాఁగఁ
దనమోము సత్యలోకనివాస జలజాత
భవచతురాస్య చుంబనము సేయఁ
దనపటుదీర్ఘ దోర్దండ ప్రభావంబు
దిగ్గజంబుల నెల్లమ్రొగ్గఁ జేయఁ
దనబర్బరస్థూలతను మహామహిమంబు
నీరజజాండంబు నిండుకొనఁగఁ
గీ. దనమహాభారంబునకు మహీతలము వణఁక
భూరినక్షత్రములు మొలపూసలుగను
బెరగి లోకంబులకునెల్లభీతిగదుర
విలయభైరవ మూర్తియై వెలయుచుండె. 158

చ. మఱియును వక్షమందునను మాధవుఁడున్ ముఖమందు
నగ్నియున్, శిరమున నిర్జరేంద్రుఁడును జెక్కుల నశ్వినులున్
మహోజ్జ్వల, చ్చరణతలోరుమధ్యముల సర్వనిలింపులు సిద్ధ
సాధ్య కిన్నరగరుడోరగాదులు ఘనంబుగఁ గన్పడి రొక్క
పెట్టునన్. 159

వ. ఇట్లపారపారావారగంభీరధీరవిస్తారశరీరుండును అప్రతి
ద్వంద్వశౌర్యుండును వాలప్రచండభుజాదండ సత్త్వతృణీ
కృతాఖిలదిశారమణుండును దుర్నిరీక్ష తేజస్సంఛాదిత

బ్రహ్మాండకోటరుండును, చరణపరాక్రమితభుజంగమవల్లభుండును, తీక్ష్ణరోమాగ్రచుంబితసమస్తనక్షత్రనిచయుండును నిశ్వాసప్రభవ ఝంఝాప్రభంజనోద్ధూత విపక్ష రక్షోమేఘపటలుండును నగుమహామహుని నిరీక్షింపజాలక సుమంత్రప్రముఖమంత్రులును దక్కినవారలునుం దలలెత్తి వెఱచి భయకంపితదేహులై యుండిరి లక్ష్మణభరతశత్రుఘ్నులును దదీయమహిమాతిశయంబు గాంచి యిట్టిట్టని వర్ణింపనేరక నిర్విణ్ణమనస్కులై ప్రవర్తిల్లిరి. రామభద్రుండును దదత్యుద్రరౌద్రరేఖావిశేషంబునకుఁ బరమాశ్చర్యహృదయుండై యితని సహాయంబున శతముఖుం దునుమవచ్చు సందియంబు లేదనినిశ్చయించి అభంగకృపాపాంగంబుల నమృతంబు చిలుకనవలోకనంబు చేసి మెల్లన నిట్లనియె. 160

ఉ. శాంతవిచార వాయుసుత శత్రుగణాంతక మాయు.రే హనూ
మంత మహానుభావ యఘమర్దన నీదగురూపు చూడఁగా
నెంతటివారు రాజులు కపీశ్వర నాకునుశంకపుట్టెనేఁ
[1]డింతియె చాలు నీవిపుడ యెప్పటిరూపము మాకుఁ జూపవే.

ఉ. నావిని వాయుజుండు నరనాథున కెప్పటిరూపుతోడుతన్
వావిరివందనంబు లిడి వచ్చివిభీషణు దండనుండె న
ద్దేవుఁడు రామచంద్రుఁడు నతిప్రియభాషల మాటిమాటికిం
చేవ దలిర్ప సన్నుతులు సేయుచునుండె ననేకభంగులన్.

వ. అంత. 163

గీ. పవననందను ఘోరరూపంబుఁ జూచి
మునుపు దనుమ్రింగి యందుచేఁ దనివిలేక

1 డంతయుఁజాలుఁజాలుఁ గరుణాత్మక యెప్పటిరూపుఁ జూపవే.

యెప్పటికిఁ దన్ను మ్రింగునో యనుచు భీతి
నేగుకైవడి నపరాబ్ధి నినుఁడు గ్రుంకె. 164

గీ. రాఘవుఁడు తొల్లి లవణవారాశిగట్టి
నిప్పుడిది యెడఁగట్టునో యింద నిలువ
బాగుగాదని చని మున్ను వ్రాకునట్టి
చటులబడబాగ్నిశిఖలన సంజ వొడమె. 165

గీ. [1] ప్రాగ్వధూమణి దననఖప్రకరములను
విప్పుకొప్పునఁ జీఁకటి వెల్లివిరిసె
నబల వెండియు సవరించునట్టి సొబగు
మోముదర్పణ మన శశి దోఁచె నపుడు. 166

గీ. అంతకంటెను మున్ను ఘటాశిగొలువఁ
గొలువు చాలించి మాన్యకపికుంజరుండు
వెలయ సంధ్యాద్యనుష్ఠానవిధులు దీర్చి
యనిలజవిభీషణులఁ బిల్చి యాక్షణంబ. 167

వ. వారునుం దానును సహోదరత్రయంబును బంక్తింగలసి మరకతపలాశపత్త్రంబుల షడ్రసోపేతరుచిరాన్నంబులును మృగపక్షిమాంసంబులును విచిత్రశాకంబులును ఘృతదధిప్లుతంబుగా నానావిధంబు లగునూరుఁగాయలతో నరుచిపరిపాకంబుగా నారగించి కర్పూరతాంబూలంబులు గైకొని తదనంతరం బా విభీషణు నవలోకించి మహాత్మా యిట్టిసమయంబునఁ జతురంగబలంబులతో మత్సహాయుండవై యే తద్దుష్కరకార్యం బెట్టైనను దొలగించి నిర్వహింపుమని

1 ప్రాగ్వధూమణి తనవేఁగఁ బ్రాభవమున విప్పి కొప్పును వీఁపున విడిచె ననఁగ.

యనర్ఘమణిమయభూషణంబులు నపారదివ్యాంబరంబులు
నసదృశపరిమళంబులును దోరహత్తుగా నిచ్చి పనిచె నతండు
సమ్మతించి రామచంద్రునకు నమస్కరించి లంకాపురంబున
కరిగె పిదప రఘువరుండు హనుమంతు నవలోకించి యనేక
ప్రకారంబుల నాదరించి తనకంఠంబున నొరయు దివ్యరత్న
హారంబు కపివరునిగళంబునం దగిలించి నీవును లక్ష్మణుండును
గిష్కింధానగరంబున కరిగి యేతద్వృత్తాంతం బంతయు
సుగ్రీవున కెఱింగించి సకలవానరసహితంబుగాఁ దోడితెమ్మ
నుడు హర్షించి లక్ష్మణుండును వాయుజ సహితుండై తత్పు
రంబున కరిగె మఱియును భరతశత్రుఘ్నుల వీక్షించి
మీరును కాంభోజమలయాళద్రవిళ కర్ణాటలాట కిరాత
కోసల పాంచాల సౌరాష్ట్రాదిదేశంబులకుం జని యాయా
రాజులఁ దోడి తెండని పనిచె తానును సీతాసమేతుండై
హంసతూలికాతల్పంబునఁ దత్ప్రకారంబులు వినిపించుచు
విశ్రమించె నంత. 168

గీ. కాలమనుసింహ మాకాశగంధగజముఁ
జేరి తత్కుంభమధ్యంబుఁ జింప నందుఁ
దెలివిఁ గన్పడు గొప్పముత్తియ మనంగఁ
జొక్కమగునట్టి వేగురుఁజుక్క వొడిచె. 169

గీ. తారకలు డాఁగెఁ గుక్కుటధ్వనులు మీఱెఁ
గలువ గమిజాఱె మదనుని ఘనతదీఱెఁ
గంజములు గేరెఁ జల్లగాగాడ్పునేర
దీపతతులాఱె బలబల తెల్లవాఱె. 170

గీ. నెమ్మి నంబర మనియెడుకమ్మరీఁడు
గరిమఁ బ్రాగ్భాగ[1]సాంధ్యరాగంబుకొలిమి
యందుఁ గ్రాఁగినయట్టిలోహంపుముద్ద
వెడలఁజేసెనో యన రవి వొడిచె నపుడు. 171

సీ. ఆవేళ రఘురాముఁ డల్లన పల్లకి
మృదులస్వరంబున మేలుకాంచి
కాలోచితక్రియల్ గ్రక్కునఁ గావించి
మఱియు గురునకు నమస్కరించి
విప్రవర్గములకుఁ బెసనర్ఘ్యతాంబూల
తతులిచ్చి మఱిప్రమోదంబు గదుర
మణిభూషణంబులు మహితాంబరంబులు
గైకొన సన్మంత్రిగణము గొలువ
గీ సకల వానరరాక్షససైన్యచయము
లెప్పు డరుదెంచు శతముఖు నెపుడు ద్రుంతు
ననుచు సింహాసనంబున నలరి రాముఁ
డుండెఁ బేరోలగము నయనోత్సవముగ. 172

మాలిని.—

సరసిజదళనేత్రా చారునీలాభ్రగాత్రా
గిరిసుతపతిమిత్రా గీష్పతిస్తోత్రపాత్రా
... ... సౌజన్యపాత్రా
నిరుపమగుణసూత్రా నిర్మలారూఢవేత్రా.

---

1 సాంధ్యంబు కలిమికొలిమి.

గద్యము. ఇది శ్రీమదేయ కూర్తినివాస లక్ష్మీనృసింహకరుణా కటాక్ష సంప్రాప్త మహాకవిత్వ విద్యాపారీణసుమహితాంధ్ర గీర్వాణభాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రా త్రేయసగోత్రపవిత్ర ధర్మనాచార్య ధర్మనార్యపుత్ర నిఖిల మహీసురాశీర్వాదప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ వినయవిధేయ మర్దననామధేయ ప్రణీతంబైన సీతావిజయం బను మహాప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.



శ్రీ ర స్తు

# శతకంఠ రామాయణము

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీకర సద్గుణాకర
త్యాకర కమనీయతరకృపాకరపూర్ణా
భీకరతరశరవిజితసు
ధారుణి [1]పోషక నృపాల ధర్మవిశాలా. 1

వ. అనవరతంబు మహైశ్వర్యంబున శాంకరి దేవికి వెండియు మహాదేవుం డిట్లనియె ఇట్లు సకలబాంధవామాత్యపురోహితసామంత సస్మితవిద్వత్కవిగాయకనాయకసంఘంబులు గొలువ నఖిల నృపసార్వభౌముఁ డగు రాముండు వసిష్ఠుండు నీతివచనంబులు నితిహాసంబులు దెలుపఁ బేరోలగం బుండి శతముఖశతద్వయ దోర్దండఖండనాభిలాషుండై విభీషణసుగ్రీవముఖ్యసకలసేనా గమనకాంక్షి నుండె నంత. 2

సీ. ఆవిభీషణుండు [2]లంకానగరికేగి
తనబంధుమిత్రులఁ దవిలి పిలిచి
యిచటివృత్తాంతంబు లెల్ల నెఱింగించి
యిట్టివేళల మన మినకులేంద్రు
నకుఁ దోడుగావలె నింక జాగుసేయక
యఖిలసాధనములు నమరఁ జేసి

1 పోతమ. 2 లంకాపురంబున కేఁగి.

రథములు సవరించి ప్రథనభీకరగంధ
సింధురంబులు నేర్చి చిత్తములకు
గీ. మించువేగంబుగలిగెడు మేటిహరులఁ
బోటుగత్తులఁ దూఱెడు నీటుభటుల
నాయితంబులు సేయించి యతిరయమున
వరుసఁ దెమ్మని తగఁబడవాళ్లఁ బనిచె. 3
సీ. పనిచి తోడ్తోడ సంపాతిని నలనీల
సత్ప్రధానుల నెల్ల సరగఁ బిలిచి
వేర్వేర మన్నించి దుర్వారబలులార
మీరు నాకోర్కు లింపారసలిపి
యొక్కొక్కరునివెంట నొక్కొక్కక్షౌహిణి
గొలిచి రా నరుదెండు బలిమిమెఱసి
దారపుత్రభ్రాంతిఁ దనరినదుర్మతుల్
రాకుఁ డిచ్చుట నెపరాకుగాకుఁ
గీ. డనుచు నెఱిగింప నమ్మంత్రులాహవమున
కుత్సవంబులుగైకొని మత్సరించి
[1]పరఁగనాయుధములు తమ ప్రాణములుగఁ
జేసి యుద్ధప్రయత్నముల్ చేసి రపుడు. 4
సీ. ఒనర నిత్తెఱఁగున యుద్ధసన్నద్ధులై
కరిరథభటతురంగములు గొలువ
నప్పు డేకైకమహాక్షౌహిణులతోడ
మలయుచుఁ బదుగురుమంత్రివరులు

1 పరఁగఁదమ సాధనంబులు.

భేరీమృదంగగంభీరభాంకారముల్
జగతీతలము నాకసంబు నిండ
నాహావజయనిష్ఠురాలాపములు మీఱఁ
జను దెంచి యవ్విభీషణునియెదుట

గీ. గదలు వెసఁజూఁచి ముసలముల్ ఘనత నూఁచి
ప్రాసములు ద్రిప్పి పట్టిసప్రతతిరొప్పి
సాయకములేర్చి సంగరసరణి నార్చి
నేర్పు సూపిరి దోర్బలనిష్ఠ మెఱసి. 5

వ. ఇ ట్లనేక ప్రకారంబుల హారుండును నీలుండును సంపాతియు నవక్రుండును వక్రజిహ్వుండును శూలముఖుండును రక్తవదనుండును ఏకపదుండును కుటిలకేశుండును ఉలూకుండును మహాగర్భుండును వికృతపార్శ్వుండును నాదిగాఁ గలమంత్రులందఱు పొడచూపిన నుత్సహించి అవ్విభీషణుండు వారల నాదరించి తానును నిజాభ్యంతర మందిరంబునకుం జని సకలబ్రహ్మరాక్షసభాషితానేక శ్రుతీతిహాసంబులు వినుచున్న తల్లికి నమస్కరించి రణప్రయాణవృత్తాంతం బంతయు వినిపింప నక్కైకసియు విజయుండవై మఱలి రమ్మని దీవించి యక్షత లిచ్చినం గైకొని అచట వీడ్కొని మహాపతివ్రతాశిరోమణియగు సరమాదేవికిం జెప్పిన నప్పరమ సుందరియు మందహాసంబు గావించి దూర్వాక్షత తాంబూల నిచయంబులు దోయిటం గొనివచ్చి యిచ్చి యిట్లనియె. 6

చ. రమణ దయాత్మ నీతిగుణరత్నమ భండన భూమిలోన మీ
రమణునకుఁ జయంబుగొని రమ్మని పంప విభీషణుం డొగిన్

సుమహిత రత్నవిస్ఫురితషోడశచక్రసహస్రఘోటకో
త్తమశతఘంటికాయుతరథంబు ముదంబున నెక్కి సారెకున్!

శా. శంఖారావము దంతిబృంహితములున్ సర్వస్ఫుటోష్ట్రిచ్ఛటా
రింఖాఘట్టనఘోషణంబులును మౌర్వీనాదముల్ వేగవ [తం
త్కంఖాణోగ్రవిహేషలుం బణవఢక్కాధ్వానముల్ ఘోర
బుంఖీభూతములై చెలంగె నరయన్ భూభాగమధ్యంబునన్.

వ. ఈక్రమంబున విక్రమశీలుం డైనవిభీషణుండు సకలసేనాసమ
న్వితుండై లంకానగరంబు వెలువడి దినదినక్రమంబున సము
ద్రంబులును తటాకంబులును మహావనంబులును పర్వతంబు
లును ప్రవాహంబులును దేశంబులును ఘనతరగ్రామంబు
లును గడచి సాకేతపురప్రాంతమునకుం జని తనరాక రామ
చంద్రున కెఱింగింపఁ బనిచె నంత. 9

మ. దనుజుండుం జని రాముఁ గాంచి కరుణాదండంబులర్పించి యో
జననాథాగ్రణి రామచంద్ర భవదాజ్ఞామార్గమెల్లం దలన్
ఘనతన్మోచి విభీషణుండు [1]చతురంగద్వాదశాక్షౌహిణుల్
దను సేవింపఁగ వచ్చి నన్నుఁ బనిచెం దద్వార్త విన్పింపఁగన్.

ఉ. నావిని రామభద్రుఁడు రణప్రియ మేర్పడ మిన్నుముట్టసం
భావనలిచ్చి మంత్రులును బాంధవులుం దనుఁగొల్చిరాఁగ [2]భూ
దైవత కోటిసారెకు ముదంబున దీవనలియ్య జయ్యనన్
రావణవైరి యొక్కగజరాజము నెక్కి పురంబు వెల్వడెన్. 11

ఉ. ఆరథకోటి భీషణము లామదదంతి[3]మహోన్నతక్రమం
బారయ నిర్జితానిలమహాశ్వసమూహజవప్రభావిధం

1 చతురంగంబుల్ దశాక్షౌహిణుల్. 2 భూదేవత లెల్ల సారెకును దీవన లిచ్చుచుండఁ. 3 మహాతివిక్రమం.

సీ. అనిలజ నీవేగి యర్కనందనుఁ గాంచి
యటఁ బుట్టినట్టివృత్తాంత మెల్లఁ
జెప్పి నేవచ్చుటచెప్పి రామునియాజ్ఞ
చెప్పి యీడకు నతిశీఘ్రవృత్తి
సకలశాఖామృగసహితంబుగా యుద్ధ
సాధనములతోడ సరవిఁదోడి
తెమ్ము రాకుండిన దిగ్గన నరుగుదె
మ్మటమీఁద నాచేత నౌనుగాని
గీ. యనినఁ బనిపూని హనుమంతుఁ డతిరయమున
నచట వీడ్కొని కిష్కింధ కరిగియఖిల
వానరులు దన్నెదుర్కొని వందనములు
సేయఁబట్టణమధ్యంబుఁ జేరి యచట. 16

శా. ఉగ్రారాతిపయోధిబాడబుని విద్యుత్సన్నిభాక్షుఁ గణో
దగ్రుం బాహుబలప్రతాపఘనుమార్తాండాత్మజుం భూరిహే
మగ్రావప్రతిమానధైర్యు రఘురామ శ్రీపదధ్యాను నా
సుగ్రీవుం బొడఁగాంచె నంత నతఁడుం జూచెన్మరున్నందనున్

క. కనుఁగొని యెదురుగఁ జని యా
హనుమంతునిఁ గౌఁగిలించి యలరుచు నర్ధా
సనమున నిడి [1]తత్కుశలం
బనుపమకృప నడుగ నిట్టులంతయుఁ జెప్పెన్. 18

చ. విజయము రామచంద్రునకు వీరపరాక్రమలక్ష్మణాఖ్యుకున్
విజయము ముగ్గురమ్మలకు వీరపతివ్రత భూమిజాతకున్

1 రామ శుభంబును దత్కుశలంబు నడుగఁ బొలుపుగఁ మఱియున్.

విజయము కైకసూనునకు వేడుక శత్రువినాశమూర్తికిన్
విజయము భానునందన ప్రవీణధురీణ నిరంతరంబుగన్. 19

వ. అని. 20

సీ. పలుక ఫాలమున నంజలి వేడ్కఁ గీలించి
వెండియు నిట్లనె విమలగతిని
నాతండ్రి దశరథనందనుం డౌ రామ
భద్రుః డున్నాఁడె సంభ్రమ మెలర్ప
ఖండనోదగ్ర ప్రభావుఁ డౌ లక్ష్మణుం
డతని సేవించునే యనుదినంబు
భరతశత్రుఘ్నులు ప్రముదులే మాతల్లి
జానకి కుశలిన్యై పరవిగనునె
గీ. విధవలై యున్న దశరథవిభునిసతులు
కౌసలలను జూచితైనను గొంతవగపు
మానియుందురె రాజసన్మానమ్ముఁ దగుచు
నావసిష్ఠుండు మెలఁగునే యచట ననఘ. 21

గీ. చూచినాఁడవె యాలోకసొంపుగదుర
రఘుకులేంద్రునిఁ దద్ధరారమణుసభల
పరవిఁబుట్టునె యవ్విభీషణునివార్త
వేడ్కఁ దలఁతురె యొక్కొకవేళ మమ్ము. 22

సీ. వాలిని చిలువవ్వ నవ్వి సుగ్రీవుని
మన్నించి యాహనుమంతుఁ డనియె
రామాదిదశరథరాజనందన చతు
ష్టయమును నున్నారు సంభ్రమముల

సీతామహాదేవి చెన్నొంది పతిసేవ
సేయుచు నున్నది సేమమునను
గరిమఁ గౌసల్యాదికాంతలు కొడుకులు
మన్నింప నున్నారు మానవతులు
తే. నవ్వసిష్ఠుఁడు నున్న వాఁ డతిముదమునఁ
గడువిభీషణుఁడును రాముకడనెయున్న
వాఁడు నేనును నటనుండివచ్చినాఁడ
నిన్ను నెప్పుడు రఘురాముఁ డెన్నుచుండు. 23

వ. అనిన విని యినసుతుం డనిలజు నవలోకించి యిట్లనియె
మహాత్మా విభీషణుండు రామునికడనుండుటకు నాశ్చర్యం
బును భయంబునుంబుట్టె ఎట్టిచందంబున నరు దెంచె ఏమి
కార్యం బెఱింగింపుమన హనుమంతుం డిట్లనియె. 24

సీ. రావణుకంటెఁ బరాక్రమవంతుండు
శతముఖుఁ డనెడురాక్షసవరుండు
గోవిప్రదేవతాక్షోభంబు గావింప
నందుకు రాఘవుం డలిగి మునుల
కభయహస్తము లిచ్చి యాహవంబునకు స
హాయంబు రమ్మని యడుగ నవ్వి
భీషణుం డొడఁబడి భీషణశౌర్యుఁడై
చనియె లంకకు రిపుల్ జలదరింప
గీ. నిన్ను రమ్మని నృపు డంప నేను లక్ష్మ
ణుండు వచ్చితి మిటకు నుద్దండగతుల
వాఁడె సౌమిత్రి మనపురద్వారశుంభ
దుపవనంబున నున్నాఁడు తపనతనయ. 25

ఉ. నావిని తల్లడిల్లి దిననాయకనందనుఁ డుల్కిపాటునం
బావనినుంచి లేచి నిజభర్తృగృహంబునకేగి తారతో
నావిధమెల్లఁ జెప్పి కనకాంబరభూషణరత్నవస్తువుల్
వావిరి కానుకల్ గొనుచు వచ్చెఁ బురోపవనంబు చేరఁగన్ 26

చ. ఇటువలె వాయుజప్రముఖు లేకముగాఁ దనుఁగొల్వ రాగ ము
త్కటమగు భక్తితో నినుని కూరిమిపట్టి రఘూద్వహానుజుం
దటుకునఁ గాంచి వందనశతం బొనరించి యనేకభంగులన్
స్ఫుటమృదుభాషణంబులను [1]భూషణసేసి ముదం బెలర్పఁగన్.

ఉ. కానుక లిచ్చి యోవనజబాంధవ యోసరసాక్షచంద్ర యో
దీనశరణ్య యోవిమలతేజ ఘనన్నిజభృత్యుఁడం గదన్
సేనలతోడ నెట్టియెడఁ జెప్పుము వేగ నొనర్తు నన్నఁ ద
ద్వాయుతనూజుఁ బిల్చి బహుభంగుల నాదరణంబు సేయుచున్.

*చ. వినుము కపీంద్ర యొక్కఁ డవివేకపు రాక్షసుఁ డిష్టదుష్ట స
న్ములను గోకవంబుల మూర్ఛఁ ద్రుంచుచు దేవకోటులన్
ఘనముగ బాధపెట్టుచును గర్వమునే నెదురెందు లేక యే
చిన నవి యెల్లఁ దాపసులు చెప్పిరి వారలఁ గావ వేఁడుకన్.29

వ. ఇవ్విధంబునం గాచి యమ్మహాదానవుం బరిమార్చుటకుఁ బ్రతిజ్ఞ
సేయువాఁడై పరపురుషసాధ్యంబులగు వరంబులు పరమేష్ఠి
యొసంగె నందులకు నాలుగుసముద్రంబులు దాఁటవలయు

---

1 స్తోత్రముచేసి.

* వినుము కపీంద్ర యొక్కఁడు వివేకవిహీనుఁడు రాక్షసాధముఁ
మునులను గోకవంబుల మూర్ఛలంబుచ్చుచు దేవతాదులన్
ఘనముగఁ బాధపెట్టుచును గర్వమునొంద భయార్తులైన యా
మునులను గావఁ బంక్తిరథపుత్రుఁడు చేకొని వేడ్కమీఱఁగన్.

ఉ. నావిని తల్లడిల్లి దిననాయకనందనుఁ డుల్కిపాటునం
బావనినుంచి లేచి నిజభర్తృగృహంబునకేగి తారతో
నావిధమెల్లఁ జెప్పి కనకాంబరభూషణరత్నవస్తువుల్
వావికి కానుకల్ గొనుచు వచ్చెఁ బురోపవనంబు చేరఁగన్ 26

చ. ఇటువలె వాయుజప్రముఖు లేకముగాఁ దనుఁగొల్చి రాఁగ మి
క్కుటమగు భక్తితో నినుని కూరిమిపట్టి రఘూద్వహానుజుం
దటుకునఁ గాంచి వందనశతం బొనరించి యనేకభంగులన్
స్ఫుటమృదుభాషణంబులను [1]భూషణచేసి ముదంబెలర్పఁగన్.

ఉ. కానుక లిచ్చి యోదనుజఖండన యోనరనాథచంద్ర యో
దీనశరణ్య యోవిమలతేజ భవన్నిజభృత్యుఁడం గదా
సేవలతోడ నెద్దియటుఁ జెప్పుము వేగ నొనర్తు నన్నఁ ద
ద్భానుతనూజుఁ బిల్చి బహుభంగుల నాదరణంబు సేయుచున్.

*చ. వినుము కపీంద్ర యొక్కఁ డవివేకి రాకాసుఁ డిప్పుడుష్టి స
న్మునులను గోకదంబముల మూర్ఛిలఁ ద్రుంచుచు దేవకోటులన్
ఘనముగ బాధపెట్టుచును గర్వముచే నెదురెందు లేక యే
చిన నపియొల్లఁ దాపసులు చెప్పిన వారలఁ గాచె వేడుకన్.29

వ. ఇవ్విధంబునం గాచి యమ్మహాదానవుం బరిమార్చుటకుఁ బ్రతిజ్ఞ
సేయువాఁడై పరపురుషాసాధ్యంబులగు వరంబులు పరమేష్ఠి
యొసంగె నందులకు నాలుగుసముద్రంబులు దాఁటవలయు

1 స్తోత్రముచేసి.

* వినుము కపీంద్ర యొక్కని వివేకవిహీనుని రాక్షసాధమున్
మునులను గోకదంబుల మూర్ఛిలఁ జుచ్చుచు దేవతాదులన్
ఘనముగఁ బాధపెట్టుచు గర్వమునొంద భయార్తులైన యా
మునులను గాచెఁ బంక్తిరథపుత్త్రుఁడు చేకొని వేడ్క మీఱఁగన్.

నని చింతింపనందుల కేనొయ్యన డాసి మీపంపున నేనొక్క రుండనే చతుర్దశభువనంబులు భస్మీకరింతు ఒక్కరక్కసి జేనికై యింతవంత నొందనేల యని పలికిన నలరి యిందుకు సందియంబు లేదయినను పెక్కురక్కసులలో నొక్కరము మెలంగుట తగదని విభీషణుం దలంప నతండు వచ్చి తనసేన లతోఁ జనుదెంచెద నని చనియె ఇంతకు వచ్చునో రాఁగ లఁడో యెఱుంగము నేనును హనుమంతుఁడును నీతోఁడఁ దద్వృత్తాంతంబు చెప్పి నీసహాయంబు గొనవచ్చితి మిటమీఁద నీదిభారం బని యూరకుండె. సుగ్రీవుండును ముదంబున నందుకు సమ్మతించి యిట్లనియె. 30

శా. దేవా వాఁడన నెంత వానరచమూదీప్తప్రతాపాగ్నికీ
లావర్గం బెసఁగించి దానవసముల్లాసాటవిం గాల్చి భూ
దేవాళిం గరుణించెదన్ మదినిఁ జింతింపంగ మీకేల యీ
నావంటిం బ్రియభృత్యుఁడుండఁగ ధరానాథాగ్రచూడామణీ.

సీ. మలయాచలంబున మాల్యవంతంబున
హిమవంతమునను మహేంద్రమునను
గనకాచలంబున గంధమాదనమున
నీలాద్రి నలమలయాళగిరిని
శేషాచలంబున సింధుపర్వతమున
మునుమిడి యల ఋశ్యమూకమునను
వనచరవర్గముల్ ఘనతతో నున్నారు
వారి రాఁ బనిచెద వచ్చుదనుకఁ

గీ. బంచరాత్రము లిచట సంభ్రమతనుండుఁ
డనుచుఁ బ్రార్థింప లక్ష్మణుఁ డనుమతించి

పంచకవనుండౌ బనవజ ప్రముఖు లలర
భానుజుండును రాఁబంచె బలమునెల్ల. 32

వ. ఇట్లు సుగ్రీవుండు సకలకుధరగహనతటాకంబులకడకుఁ దన భృత్యులం బనిచి పనిచిన వారును దత్తత్ప్రదేశంబులకుం జని రామునిపదంబులమీఁద వ్రాలవెట్టి యఖిల భల్లూకవానర నివహంబులం బిలిచి మరలఁ జనుదెంచి రంత. 33

చ. *మలయనగంబునుండి పలుమాఱును రామునిఁ జేరుకొంచు వె
ల్వెలుచు శంఖనిస్వనముఁ గొల్వంగ ఘనోచితఘోరవాక్యముల్
పలుకుచు నార్భటంబుల దిశాంచలయంబులు తల్లడిల్లఁగాఁ గన్.
వెలుఁగుచు వచ్చె నప్పుడు సుషేణుఁడు భానుసుతుండు మెచ్చఁ

ఉ. వాలముల న్మహాకుధరవర్గములం బెకలించి మింటికిం
గీలితమై చిమ్మనవి బెట్టుగఁ బట్టుచు హుంకరించుచున్
హేలఁ బదాఱువేల్వలవు దెప్పినిఁ గొల్వఁగ గోముఖుండు న
స్త్రీలుఁడుఁ గూడివచ్చిరల నీలనగంబుననుండి చెచ్చెరన్. 35

ఉ. భస్మనగంబునుండి చలపాదికపుల్ నవలక్షగొల్వఁగా
నర్మిలి వెల్వలై చనుచు నప్రతిమానభుజాబలంబులన్

---

చ. *విలయనగంబునుండి పదివేలబలంబులు దప్పఁ గొల్వఁగా
బలువజ్ఞభండనక్రమతపాటలుపాడుచు సంభ్రమంబున
న్వెలఁగుచు రాముఁ దల్చుచును మేదిని నాకసమంట వార్చుచుం
జెలఁగుచు వచ్చె నప్పుడు సుషేణుఁడు భానుసుతుండు మెచ్చఁగన్.

ఉ. నీలనగంబునుండియును నీలుఁడు గోముఖుఁడున్

... ... ...

బాలదివాకరాత్మజుని ప్రాపును జేరి మనోవికాసులై.

మస్మదవృత్తి నార్చుచును వోయధులెల్లఁ గలంగిపోఁగ జ్యో
తిర్ముఖుఁ డేగుదెంచె నతితీవ్రరయంబున రాముఁ దల్చుచున్.

చ. వివిధపరాక్రమస్థితుల వెల్వలు తొమ్మిదిగొల్వ నభ్రముల్
భువియును నిండ నార్చుచును బొంగుచు గంతులు వేయుచు
న్మహా, జవమున నిర్జరావళులు సన్నుతిసేయ విరోధిభీములై
గవయుఁడు గంధమాదనుఁడు గ్రక్కునఁ జేరిరి యుక్కు
మీఱఁగన్. 37

చ. శతబలియున్ గవాక్షుఁడును శౌర్యధురంధరుఁ డైన
మైందుఁడున్, జతనము తోడఁ గూడి పెరసంఖ్యను వెల్వలు
దమ్ముఁ గొల్వ నీ,క్షితిజము లొక్కటం బెఱికి చేకొని
త్రిప్పుచు గంతు వేయుచున్, మతముల జేరిరయ్యెడకు
మాద్రిగిరీంద్రమునుండి యత్తఱిన్. 38

వ. మఱియును నదియునుంగాక మూఁడుకోట్లతో ద్వివిదుండును
రెండర్బుదంబులతోఁ బనసుండును ఎనుబదిసహస్రంబులతో
భల్లూకనాయకుండును ఏడక్షౌహిణులతో ఋషభుండును
పదునొకండుపద్మంబులతో వేగదర్శి తారక కుముదులును
గూడినానాపర్వతంబులనుండి చనుదెంచి రవియొల్లను బండ్రెం
డు వెల్వలయ్యె కిష్కింధను ఋశ్యమూకంబునంగల వానర
బలం బెనిమిది వెల్వలయ్యె నానాముఖంబులం గల కపిసేన
యొక్క వెల్వయయ్యె అన్నియును డెబ్బదిరెండు వెల్వలై
ప్రవర్తిల్లె నంత. 39

*సీ. శతకోటిలక్షలు శైలచరావళుల్
గణిత మొనయనఁగాను బరఁగు
మొనలలును పదిలక్ష లనుప్రగాఁ గూడిన
నదిలోకమున బాహు వనఁగ నొప్పు
నట్టిబాహువలు సహస్రంబుమూఁగిన
నది మహౌఘమన నవనిఁ జెల్లు
దళము లక్ష్యమైన దానిపేరంబర
సంఖ్య యందురు మంత్రిజనము లెల్ల
గీ. నట్టి యంబరములు కోటియైన నొక్క
వెల్వ యనఁదగు నటువంటివెల్వ లేడు
పదులు రెండును సేవించు భానుసుతుని
నట్టివెల్లను జేకూరె నద్భుతముగ. 40
సీ. ఎచ్చోటఁ జూచిన నచ్చోట నేల యీ
నినభంగిఁ గనుపట్టి నిలుచువారుఁ
దతఘోరసింహనాదములనక్షత్రముల్
వ్రాలఁగ మిన్నులుముట్టఁ బెరుఁగువారుఁ
గాలునిబోలిన వాలంబు లంకించి
యాలంబునకు నసియాడువారుఁ
బర్వతంబుల నిమ్మపండ్లచందంబున
నఱచేతులను బంతులాడువారు

---

*మ. శతసాహస్ర మహార్బుదక్షితిదశాసాహస్రకోటీ యుతిం
గలివేధాద్రిహిమాంబుబాణఋషిసంఖ్యానీకమున్వచ్చి యీ
గలిసిరా రెంట గుణింప వచ్చినమహాలబ్ధాంబదెంతాయెనో
క్షితినానద్భుతమై వనేచరు లనేకుల్ వచ్చెఁ గిష్కింధకున్.

గవులపుట్టువులును గశైలసంగరవర్త
నములును గడుసముద్రముల కెఱఁగు

గీ. ముష్టియుద్ధప్రకారంబు మొనసి పెనఁగు
లాడువిధమును బిదప శతాస్యగతులు
వానిమంత్రుల కెఱుఁగను బూనికలును
దెలిసికొనుచుండె నంతటఁ దెల్లవాఱె. 43

క. భానూదయకాలంబున
భానుజుఁ డుప్పొంగి రామభద్రానుజునిం
గానంగవచ్చి యిచ్చెను
దానగజశ్రేష్ఠ మొకటి దగఁగవ లలరన్. 44

వ. ఇచ్చి తానును దారాప్రముఖనిఖిలసతీనిచయంబున కెఱిం
గించి వారిచే ననుజ్ఞలుగొని అంగదముఖానేకపుత్త్రపౌత్త్ర
మిత్త్రామాత్యవర్గంబులు గొలువ వనచరపురంబు వెడలి
వచ్చి లక్ష్మణుండును భానుజదత్తమత్తకరటీఘంటాస్ఫాలన
కరుండై జాంబవత్సుషేణ కుముద నీల గోముఖ జ్యోతిర్ముఖ
శరభ ఋషభ మైంద ద్వివిద పనస శతబలి గజ గవయ
గవాక్ష గంధమాదన హనుమత్ప్రభృతులు గొలువ నరుగు
దెంచె సకలవశంబులును భూచరఖేచరులై రాఁదొడంగి
రంత. 45

గీ. ధరణి దిర్దిరఁ దిరిగె భూధరము లదరెఁ
గలఁగె సప్తాంబురాసులు తలఁకె బ్రహ్మ
యగణితాఖిల సకలశాఖామృగప్ర
చండదోర్దండఖండనోద్దండగతుల. 46

గీ. అమ్మహోత్సవ మరసి రామానుజుండు
కలిగె విభవంబు మాకు నీకతనఁగాదె
యనినఁ బ్రణమిల్లి నీబంట నంతపలుక
నేల యని రవితనయుండు నేగుచుండె. 47

ఉ. ఏపున నట్లు భానుసుతుఁ డేగి పళంబులతోడఁ దా నయో
ధ్యాపురవేష్టితక్షితిధరౌఘవనంబులఁ జేర రామధా
త్రీపతి తత్తదాగమనరీతులు చారులచే నెఱింగి యు
ద్దీపితచిత్తుఁడై పనిచెఁ దీవ్రతమంత్రులఁ దానెదుర్కొనన్. 48

ఉ. ఈగతి రామచంద్రుఁడు దినేశ్వరపుత్రు నెదుర్కొనంగఁ దా
వేగన మంత్రులన్ హితులవృద్ధులరాజులఁ బంప నుబ్బి తా
రాగురుభోగవైభవధురంధరుఁ డారవిపుత్రుఁ డందఱన్
బాగుగ నాదరించి పతిపజ్జకు లక్ష్మణుఁ గొల్చి వచ్చుచున్.49

ఉ. రామునిఁ బంక్తికంధరవిరాముని నీలపయోదకోమల
శ్యాముని మౌనిహృత్కుముదసంచయసోముని సత్యభాషణ
స్తోముని సార్వభౌముని విశుద్ధసుకీర్తిగుణాభిరామునిన్
ధీమణియైన భానుజుఁడు దిగ్గనఁ గాంచి ముదంబు నెక్కొనన్.

ఉ. కాంచి తదీయదివ్యపదకంజయుగంబుల మీఁదవ్రాలి తా
నంచితభక్తి లేచి దనుజానుజుఁడైన విభీషణున్ దయా
సంచితవృత్తిఁ గౌఁగిటను జక్కఁగఁబట్టి సుమంత్రముఖ్యులన్
మించుగ నాదరించి మఱి మెల్లన రామునిఁజేరి యిట్లనెన్.51

సీ. ఇనకులోద్ధరణాయ దనుజసంహరణాయ
రామాయ తేనమో రాఘవాయ
ప్రవిమలసుగుణాయ ప్రణుతమౌనిగణాయ
రామాయ తేనమో రాఘవాయ

తే. ఒకఁడు రాఘవ నను జూడు మొక్కుచుండ
శతముఖునిఁ[1] ద్రుంతు ననివచ్చుఁ జొకళించు
దండిగా నేనె యిక్కడనుండి వాని
వాలమునఁ జెత్తునని కూయవచ్చు నొకఁడు. 54

సీ. అక్కపిచుబుకదీర్ఘాభీలరోమముల్
నలిమీఱఁ గనుపట్టు నాచుగాఁగ
వనచరవారదుర్వారశౌర్యంబులు
భాతిగాఁ గనరాని లోఁతుగాఁగ
నాగివానరోద్దండహుంకృతిధ్వానముల్
క్రూరాంబుచరమహాఘోషగాఁగఁ
బద్మాప్తనందనప్రకటాజ్ఞావిలం
ఘన మది చెలియలికట్టగాఁగఁ
తే. నగచరులకోపములు బడబాగ్నిగాఁగ
నవ్వు తెలుపది విపులఫేనంబుగాఁగ
భాసురంబగు సకలసేనాసముద్ర
మప్పు డీక్షించె రఘురాముఁ డద్భుతముగ. 55

గీ. తనమనంబున హర్షించి యినజుఁ జూచి
కరుణ మీఱంగ వెండియుఁ గౌగిలించి
మెచ్చి యతనికిఁ దెప్పించి యిచ్చె నొక య —
[2]మూల్యమాణిక్యహారంబు మోదమునను 56

1 జంపి యే తెంతు సత్వరమున. 2 మూల్యహారంబు సౌమిత్రి మూలమునకు.

గీ. ఇట్లు మన్నించి వెండియు నినజుఁ గనుచు
నేడి * జ్యోతిర్ముఖుఁడు నీలుఁ డేడి యేఁడి
కుముదుఁ డాగవయుఁడు నేఁడి కమలమిత్ర
పుత్ర వేర్వేర నెఱుఁగింపు చిత్రముగను. 57

వ. అనిన నొయ్యనఁ దనకేల నమ్మహీపాలతనయునకుఁ గపులం
జూపి సుగ్రీవుం డిట్లనియె. 58

క. బహుకపిబలములు చుట్టును
రహి మీఱఁగఁ దన్నుఁ గొలువ రాఘవ మిమ్మే
విహితముగఁ జూచుచుండెడు
మహనీయబలుండు గంధమాదనుఁ డధిపా. 59

క. తరుచరులు గంతులిడఁగా
మురియుచు వాలంబు పీఠముగఁ జేసి మహా
గిరిబోలి చలన మొందెడు
గురుతరదోర్బలుఁడు వాఁడె గోముఖుఁడు నృపా. 60

క. ఆర్చుచుఁ గపులాహవములఁ
బేర్చుచు నభ్రములు ముట్టఁ బెరుఁగుచుఁ గొలువం
గార్చిచ్చువోలె నడుమనఁ
గూర్చుండినవాఁడు దేవ కుముదుఁడు సుమ్మీ. 61

క. భీమారిశుష్కతరువన
ధూమధ్వజులద్రిచరపతులు దనుఁ గొలువం

*ఏఁడి జ్యోతిర్ముఖుం డనువాఁడు నీలుఁ, డేఁడి కుముదుఁడు గవయాదులేరి వేగఁ, దమ్మి బాంధవతనయ నేనమ్మఁ జెపుమ. గీ. గంధమాదనశరభులు గజముఖుండు, ఋషభమైందులు ద్వివిదుండు ఝషముఖుండు, నీలుఁడు నలుండు పనసుండు నీలగళుని, పింగళాక్షులఁ జూపు సుప్రీతి మాకు.

ప్రేమను నున్నాఁడు రసం
గ్రామధురంధరుఁడు వాఁడు గవయుఁడు నాథా. 62

క. భూతలము వణఁక తన యఱ
చేత గిరిత్రయము నేర్పుచే నునిచి రణ
ఖ్యాతివహించెను గణఁక౯
జ్యోతిర్ముఖుఁ డల్లవాఁడె చూడుము రమణా. 63

క. [1]వాలము రవిఁ గదియఁగ నా
భీలంబుగఁ జూఁచి కపుల భేద్యులు గొలువ౯
ఆలంబున కట్టాడెడు
నీలునిఁ గనుఁగొంటె సకల నృపలోకమణీ. 64

క. తనసాహసంబు గనఁబడ
ఘనసాలయుగంబు చేతఁ గదియించి శతా
స్యునిఁ జంపఁ బూని నిలిచెం
బనసుం డదె చూడు ధరణీపాలవరేణ్యా. 65

గీ. విపులదోర్బలశౌర్యులు కపులు గదిసి
నేల యీనినవిధమున నిండికొలువ
[2]నాలమునకుఁ జివాలునవ్రాలఁ దొడఁగ
నాగవాత్మునిఁ జూచితే యసురదమన. 66

గీ. ఎపుడు సంగరమబ్బు నా కెపుడు బాహు
దండకండూతిమాను నుద్దండ [3]భండ
నమున నెప్పుడు రిపుదళనం బొనర్తు
ననుచుఁ బలికెడువాఁడు గజాఖ్యుఁ డధిప 67

---

1 గాలంబునఁ జక్కాడెడు. 2 సాహసమునకు మఱియు నట్టాడఁ దొడఁగె. 3 గతుల నెపుడు రిపుసంఘవిదళనం జేనొనర్తు.

గీ. మును వెలుంగవె పింగళాక్షుని నిమేష
మాత్రమునఁ గూల్చె నప్రతిమానబలుఁడు
కడఁక మిముఁ జూచి దండంబు లిడఁగఁ జొచ్చె
శరభుఁ డదె చూడు రఘురామ సార్వభౌమ. 68

గీ. వితతముగఁ గపు లేనూరు వేలు బలిసి
జతనమునఁ గొల్వ హేమాద్రిచందమునను
మదినిఁ బొదలుచు నున్నాఁడు మానవేంద్ర
శతబలినిఁ జూడు మద్దివృక్షంబు క్రింద. 69

గీ. ఒక్కరుండనె శతముఖు నుక్కణంచి
రామభద్రుని మెప్పింతు రణములోన
ననుచు నాఖిలవాల మల్లార్చఁ దొడఁగె
వాఁడె వృషభుండు చూచితె వరగుణాఢ్య 70

గీ. సకల సేనాసమేతుఁడై సమరవిజయ
శాలి యగువాఁడు శతకంఠుఁ జంప నేనె
చాలు దనుచును నుత్సాహశక్తి దనరఁ
గాంచు నాపింగళాక్షుమర్కటుని గనవె. 71

వ. అని మఱియును సుగ్రీవుం డందఱ వేర్వేర నెఱిగింపుచు
నుండ రామచంద్రుని చరణారవిందసందర్శన కుతూహలా
యత్తచిత్తులై తమ తమబలంబులతో నిలిచి రాసమయంబున.

శా. అభ్రశ్యామసమానదేహుఁడు సముద్యత్కుందమందారవ
చ్ఛభ్రాస్యగ్రుఁడు విక్రమప్రకటరక్షోగర్వవిచ్ఛేదనో
గ్రభ్రూమండలుఁ డాహవాహితభుజాగర్వప్రహారాతిశౌ
ర్యభ్రాజిష్ణుఁడు జాంబవంతుఁడట మోదాత్ముండు వచ్చె న్వెసన్.

శా. భూషాలంకరణస్ఫుటాంగుఁడుదయాంభోరాశిపట్టాభ్రస్త్రవై
శేషార్థజ్ఞుఁడు శత్రుదానవమహాజీమూత వాతూలుఁడా
యుష్యశ్రీహసితాబ్జసంభవుఁడు శౌర్యోగ్రుండు రామాయణ
ప్రేష్యాత్ముండు మరుత్సుతుండు తగసర్థి న్వచ్చెనచ్చోటికిన్.

శా. చండార్క ప్రతిమానతేజుఁడు మహోత్సాహుండు యుద్ధ
క్రియా, పాండిత్యుం డసమానవిక్రముఁడు శుంభద్వాల
గండూషితా, ఖండాకాశవిధుంతుదుండు ప్రతిపక్షప్రాక
టోద్యద్భుజా, దండచ్ఛేదనసత్త్వుఁ డాగవయుఁ డంత న్వచ్చె
మోదాత్ముఁడై. 75

శా. ధూర్తారాతివిశాలశుష్కవనవాతూల ప్రయుక్తోగ్రసం
వర్తాభీలదవానలుండు గిరిరాడ్వత్తుండు [1]రక్షోనిశా
మార్తాండుండు ఘనుండునీలుఁ డట్రేమన్వచ్చె నందందనో
యా ర్తత్రాణపరాయణాంఘుపతీయుంచు న్మహోత్సాహుఁడై.

శా. ఉద్యత్సత్వత్ప్రణీ[1]కృతాభిసమరస్థోగ్రాసురుం డుజ్జ్వల
ద్విద్యుత్సన్నిభలోచనుండు త్రిజగద్విఖ్యాతశీలుండు దో
స్సద్యస్సంజనితప్రతాపుఁడు శతాస్యచ్ఛేదనాభీలయు
ద్ధోద్యోగంబునవచ్చె మైందుఁడు ముదం బొప్పంగ దొరల్
మెచ్చఁగన్. 77

శా. గంధర్వామరకిన్నరాదు లితఁ డుద్గాఢాహవోద్యద్గదా
సంధానప్రబలప్రవీణుఁ డని యిచ్చ న్మెచ్చ నుప్పొంగి గ
ర్వాంధుండౌ శతకంఠుఁ జంపుటకు రౌద్రావేశుఁడై వచ్చె స
ద్గంధాంగుండగుగంధమాదనుఁడు వేగ న్రాఘవుం జూడఁగన్.

1 భూరిచ్ఛటా మార్తాండుండు రణార్థి.

శా. వత్సా రమ్మని నన్నుఁ బిల్చి త్రిజగద్వైకల్యు నారాక్షసున్
మాత్సర్యంబునఁ గూల్చిరమ్మను నొకో మానాథుఁ డట్లైన నే
నుత్సాహంబునఁబోయి మెల్లనశతాస్యుం జంపినొప్పింతుఁగా
హ్యత్సాకల్యత నంచువచ్చెనటకున్ హేలిన్ సుషేణుండొగిన్.

వ. మఱియు నదియునుంగాక పేరెన్నికైన మహావానరు లచటికి నరుదెంచినం గాంచి హర్షించి రాఘవుండును వారివారికిం దగుతెఱంగుల భూషణంబులును గట్నంబులును దోరహత్తుగా నిచ్చి హనుమజ్జాంబవదాదులఁ గరుణాసముద్రంబుల నోలలాడించి బహువిధంబుల మన్నించి బలంబుల నొక్కరమ్యస్థలంబున విడియనియమించి సుగ్రీవాంగదుల సాకేతనగరంబుననుంచె రాక్షసవానరబలంబులును రామునకు దేవతలొసంగిన వరంబునం జేసి తృష్ణాశనంబులవలన నిరపేక్షులై యుండిరి అంత భరతశత్రుఘ్నులంగొలిచి కాంభోజదేశాధీశుం డగునీలుండును యవనపతియగువృషభుండును సౌరాష్ట్రనాయకుఁ డగుసంవరణుండును బర్బరనాథుం డగుప్రదీప్తుండును కాశ్మీరరమణుం డగు భరతుండును మలయాళభర్త యగు త్రిభంగుండును నిషధాధీశ్వరుం డగుభీముండును, పాంచాలవరుం డగునీలకేశుండును విదర్భపాలుఁ డగుస్మితాస్యుండును ద్రవిడభర్తయగు సుధేష్ణుండును గౌళ కర్ణాట పులింద లాట మరాట కొంకణ దేంకణ మత్స్య గాంధారరాజులును జతురంగబలంబులు గొలువ ద్వాదశాక్షౌహిణులతోడ నయోధ్యానగరంబు డాసినవారిని వేర్వేఱ నాదరించి తగినవిడుదల నుండఁబంచి తానును మఱునాఁడు విద్వత్కవివసిష్ఠ సకలపురోహితభూసురానే

కాశీర్వాదంబు లెసంగ నుత్సవంబంది సూర్యసిద్ధాంతులచే శుభముహూర్తంబు దెలిసి భేరీమృదంగ ఢక్కాపణవ శంఖాదినినాదంబులు భోరునఁ గలంగ భరతాదిసోదరులును కుశలవాదిపుత్రులును. విజయాదిపౌత్రులును సుమంత్రాది మంత్రులును విభీషణాదిరాక్షసులును, హనుమత్సుగ్రీవ జాంబవదాదివానరభల్లూకప్రభువులును గొలువ సకలమనుజ దనుజవనచరసేనామధ్యంబున కరుగుదెంచి, అఖిలశాఖామృగంబుల రావించి అయిదేసి వెల్వాలకు నొక్కొక్కరాజు నేర్పరించి నిలుపవలెనని కుముద గవాక్ష నీల గవయ గంధమాధన గోముఖ జ్యోతిర్ముఖ మైంద ద్వివిద పనస ఋషభ శరభ నల గజ కేసరులను ముఖ్యవానరులకుఁ బదునేగురికిఁ బట్టంబులుగట్టి వారికెల్ల యుద్ధసమయంబుదెలుప జాంబవంతుని నియోగించి యిందఱఁ గాపాడుమని హనుమంతునిం బ్రతిష్ఠించి అమ్మహాసేనకు దండనాయకునిగా సుగ్రీవు నభిషిక్తుంజేసి పట్టంబుగట్టి యువరాజపట్టంబున కంగదుం బాటించి, అందఱు నొక్కపోఁజుగాఁజేసి అమ్మహావ్యూహంబునకుఁ జుట్టును రాక్షసద్వాదశాక్షౌహిణుల నుండ నాజ్ఞాపించి సకలదేశాధిపచమూ సముదయంబు నవలోకించి తద్బలంబు మూఁడుమొనలుగా నేర్పరించి యమ్మొనలకు భరతశత్రుఘ్నలక్ష్మణుల నధిపతులుగా సమకట్టి వారికి బాసటగాఁ బుత్రపౌత్రాదుల నిలిపి వారికిఁదోడుగా నుత్తమ తురంగసహస్రంబులనేర్చి వానికిం బ్రాపుగా గంధదంతావళంబులంగోటగాఁబూన్చి వానికి సహాయంబుగా రథసముదయంబును నిలిపి వానికిం గావలిగా భటసముదయంబుల

నియమించి వారలు వృథాధీనంబుగాకుండ దేవతల ప్రార్థించి మఱియును. 80

క. మానవవానరదానవ
[1]సేనల నడిపింపనాసుషేణునిఁ దేజో
భానుని ధైర్యస్థైర్యని
ధానుని రావించి యతనిఁ వగమన్నించెన్. 81

క. మన్నించి రాఘవేశ్వరుఁ
డన్నిదళంబులకుఁ దత్తదధినాథులకున్
ఎన్నఁ బతిత్వము మీఱఁగఁ
బన్నుగ సుర లలరఁ బట్టభద్రుం డయ్యెన్. 82

క. అప్పుడు సంతోషంబునఁ
గుప్పలు గొనఁగుసుమవృష్టిఁ గురిసిరి సురలుం
జప్పుడుగ మొఱసె భేరులు
తప్పక కాహళులు శంఖతతులవి మ్రోసెన్. 83

*సీ. అమ్మహారవముచే నానాకాశ మల్లాడె
బ్రహ్మాండ మటుపటపటనఁ బగిలె

1 సేనలకున్నాసుషేణు క్షేమంబున సుస్థానంబున సారథిగాఁ బూనిక మన్నించి నిఖిలపూజ్యునిఁ జేసెన్.

*సీ. అమ్మహాబలముల కదలె బ్రహ్మాండంబు
తారలు డుల్లె విధాత వణఁకె
నమ్మహాభరమున కపిరాజు నోర్వక
తలవంచుకొనె రసాతలమునందు
నమ్మహాభీషణం బరసి సాంబశివుండు
రజతాద్రిఘనగహ్వరమున డాగె

నమ్మహాభరమున కహిరాజు నోర్వక
 తలవంచుకొనె రసాతలమునందు
నమ్మహాభీషణం బరసి మై సగముగా
 శివుఁడును జాలిఁ గృశింపఁ దొడఁగె
నమ్మహాధాటికి నఖిలదిగ్గజములు
 మొనదప్పి యొక్కొక్కమూలదాఁగెఁ
గీ. గాల మరయుచు నుండెఁ బంకజభవుండు
తలఁకి యప్పుడు మృత్యువు తల్లడిల్లె
వారినిధులెల్లఁ బిండలివండులయ్యె
నస్తగిరిశృంగమున వ్రాలె నంత నినుఁడు. 84

సీ. శ్రీజానకీనాథ శిష్టప్రతీపాల
 కరుణాకటాక్షవీక్షణ పరాకు
సకలలోకారాధ్య శాశ్వత సర్వజ్ఞ
 కలుషఘ్న వీరరాఘవ పరాకు
దైత్యసంహార సుందరదేహ భక్తమం
 దార తాటకవిధూనన పరాకు
గాధేయనందన క్రతురక్షణాహల్యా
 శాపవిమోచన జయపరాకు

---

నమ్మహాధాటికి నఖిలదిగ్గజములు
 మొదటికి నొక్కొక్కమూల నణఁగె
గీ. యముఁడును వణంకెఁ బ్రళయకాలాగ్ని యడఁగె
దూసె మృత్యువు వారిధుల్ ధూళిఁ గలసెఁ
బిడుగులు దొరంగె నచలముల్ భీతి నొందె
వింతలు చెలంగె నాబలుఁబీటి నంత.

గీ. అమరు జలములు చెలరేఁగి యొసఁగి గంతు
లిడుచు శతకంఠుపురమున కెపుడు నడతు
మనుచు నుత్సాహమును బొంది యాత్మలోనఁ
జెలఁగియున్నట్టి యాబలసేనఁ జూచి. 85

సీ. ఉర్వీశ్వరుండును గాలోచితకృత్యముల్
సలిపి పుంగవమహోత్సాహమునను
బంతంబుతో జాంబవంతుని రప్పించి
యా పెద్దవలనఁ బ్రతాపలంక
కరిగెడుమార్గంబు నష్టార్గముఁగల
మహిమంబులును హనుమంతు తెఱఁగు
నతనిలావునఁ జతురబ్ధిలంఘన మొన
రింపవచ్చుటయును సొంపుమీఱఁ

గీ. తెలిపి యష్టమహాసిద్ధికిని బనిచి
దమయు నంతట సీతాగృహమున కేగి
యచటఁ దమ్ములు దాను నారగించి
విడియములు చేసి యసదృశవిభవములను. 86

వ. తదనంతరంబ తమగురుం డగువసిష్ఠుని రావించి ఆతండును తానును సహోదరులును బుత్రపౌత్రులును సీతయునుగూడి శతకంఠుని దృణీకరించు వనచరవ్యూహ మహిమంబులును సామగ్రియును రాక్షసబలపరాక్రమంబులును ఛప్పన్న దేశాధీశు లగువారి ప్రతాపంబులును వక్కాణించుచుండ నాసమయంబున సీతామహాదేవి తనజీవితేశ్వరుం డగురఘునాయకునిపలుకులఁ గరుణారసంబు చిలుకఁ గడకంట నవలోకించి మృదుమధురవచనంబుల మెల్లన నిట్లనియె. 87

సీ. ప్రాణవల్లభ మున్నుఁ బంక్తికంధరుతోడ
బోరునప్పటి భవద్భూరిబాహు
బలపరాక్రమములు ¹బాణసంధానచా
తురియును దదుపసంహారణములును
రథగతిక్రమము సారథిచమత్కృతియును
నుత్తరప్రత్యుత్తరోన్నతియును
గడుచిత్రమని చెప్పఁగా విని నేఁటఁ
గోలె మీరు యుద్ధంబు సలుపునపుడు
గీ. చూడఁగాఁ గోరి మఱొకపక్షిగణేంద్రుఁ
డెప్పుడుదయించునో యని యెదురుచూతుఁ
గామ్య మెల్లను ఫలియింపఁగలిగె నేఁడు
²మీజయముఁ గాంతు ననుఁ గొని యాజికరుగు. 88

ఉ. పూని శతాస్యుఁడున్ యమునిపోలిక మీరును సంగరంబులో
నేనుఁగుతోడ నేనుఁగు మృగేంద్రముతోడ మృగేంద్రమున్
దవో, గ్రానలమున్ దవానలము నద్రియు నద్రియుఁ డాయు
కైవడిన్, సేనలతోడఁ బోరెడివిశేషము చూచెదఁ జిత్త
గింపవే. 89

చ. అనవరతంబు శోభనగృహంబునకున్ మఘ మాచరించుతా
వునకును సద్వ్రతంబులను బొందుగఁ జల్పెడిసీమకున్ శ్రుతుల్
వినఁ జనుచోటికిన్ సకలవిశ్వభయప్రదయుద్ధభూమికిన్
వనితలతోడఁ గూడి చనవచ్చు టెఱుంగవె ప్రాణనాయకా. 90

1 బాణసంధానంబుఁ జాతుర్యముఁ దదుపసంహారణము. 2 విజయమును గాంతు ననుఁగొని వెడలు మనికి.

చ. అన విని రాఘవుండు హృదయంబున నద్భుతమంది యందియా
వనజదళాక్షి కీకలహవాంఛ జనించుట కేమి హేతువో
వినుమని యెన్నఁ డిట్టి యవివేకపుయాత్రకు సమ్మతింప ది
ట్లనుకొన నేల దైవకృతమంతయు దప్పునె యెన్నిభంగులన్.

వ. అని యిట్లు డోలాయమానమానసుండై నిజాంగనం గాంచి తదీయశరీరసంజనిత తేజోవిశేషంబు మధ్యాహ్న మార్తాండ మండలంబును ధిక్కరించి సకల బ్రహ్మాండంబులు పిక్కటిల్లఁ దనకన్నుఁ గవకు మిఱుమిట్లు గొలుపఁ దలయూఁచి యిట్టి సహాయంబున శతకంఠుని దృణలీల సాధింపవచ్చునని వెండియు జానకి నిజాకారంబు వీక్షించి లోకంబులఁగలుగు రాజకుమారికాజనంబుల యట్లు భావించుచు మనుజవేషుండు గావున నమ్మహామహిమావిశేషంబులు తెలియ నలవిగాక భరతశత్రుఘ్న లక్ష్మణుల మొగంబులుచూచి వారును వసిష్ఠుండును వినుచుండ సీతామహాదేవి కిట్లనియె. 92

సీ. చిలుకపల్కులు విని యులుకు కోమలివి దు
ర్వ్యమతాస్ఫటంబులు వినఁగఁ గలవె
ఎదు రెవ్వరాడిన మఱిఁ గుందు సుగుణవు
ప్రత్యర్థిభాషలు పడఁగఁగలవె
వెన్నెలకాకకు వెఱచెడి యబల న
త్యుగ్రబాణాగ్నికి నోర్వఁగలవె
స్ఫటికంపుసోపానపంక్తుల నొంటిమై
నిలలేవు రథముపై నిలువఁగలవె

గీ. వల పలికితి నీబుద్ధి యెట్లు పుట్టెఁ
గలహగతు లేడ నీవేడ గమనమేడ

శతముఖునిఁ జంపి వానిదేశమునఁ గలుగు
వస్తువులు నీకుఁ గొని తెత్తు వలవ దుడుగు. 93

సీ. ఆరూఢమధురవీణారవంబులుగావు
ప్రతిభటాభీలహుంకృతులు గాని
కళ్యాణసమయసత్కాంతావ్రజముగాదు
భయదరాక్షసకదంబములుగాని
కొలఁదివాసించు కుంకుమగంధమదిగాదు
మజ్జరక్తజంబాలమయముగాని
పర్యంకమల్లికాప్రసవమార్గముగాదు
[1]చండభల్లప్రపంచంబుగాని

గీ. తలఁప సుఖకేళిగాదు యుద్ధంబుగాని
మురియుటలుగావు ఘనమృత్యుముఖముగాని
నాతి మున్నిట్లు చని మోసపోతిఁగాదె
రాక కూడదు వికచనాళీకనయన. 94

సీ. నావిని తనమాట నాథుఁ డనుగ్రహిం
చుటయు లేకున్న నించుక తలంకి
బాష్పారుణితనేత్రపద్మయై మోము మఱ
వాంచి యల్లన నేలవ్రాసికొనుచుఁ
బతిమోముచూచుచుఁ బటుకుచోపరిదివ్య
చేలాంచలముగండసీమనొత్తి
పలుకుదునో యని పలికినఁ దామల్లి
పలుకునో పలకఁడో యలుక ననుచుఁ

1. సమరభల్లప్రచండములుగాని.

గీ. భయము భక్తియు నుద్దండభండనప్ర
యాణవాంఛయుఁదనహృదయమునఁ బెనఁగ
నావసిష్ఠుండు మఱఁదులు నతిముదమున
వినఁగఁ గ్రమ్మఱఁ బలికె నవ్విభునితోడ. 95

గీ. ధరణినాయక వినవయ్య తావకీయ
మహితభుజ పర్వతంబులమఱువునందు
నిలిచి చూచెదఁ బోరు మీనేర్పు నేను
సమరయాత్రకు భంగంబు సలుపఁదగునె. 96

వ. అని మఱియు ననేకప్రకారంబుల జనవరునిమనసు రంజిల్లం జేసి పదంబులంబడిన లేవనెత్తి రఘువరుండు నిజగురుము ఖావలోకనంబు గావించి యిందు కేయ్యది తెఱంగన్నఁ దత్సకలవిద్యాగరిష్ఠుం డగువసిష్ఠుండు నిజతపోమహిమంబు వలన భూతభవిష్యద్వర్తమానప్రవర్తనంబుల తెఱంగు లెఱుంగుంగావున జానకీప్రభావంబు దెలసి యమ్మహాశక్తివలన శతకంఠునిమరణంబును రామునివిజయంబును నిశ్చయంబు చేసి యేకాంతంబున నిట్లనియె. 97

గీ రామ మీరామగోరెడి రాక కనుమ
తించి చనుమా వధూటి యేతెంచినపుడె
యమ్మహామూర్తివలన శతాస్యుఁ డీల్గు
జయము చేకూఱు మీకును సత్యముగను. 98

మ. అదియెట్లన్నఁ దదీయదైత్యవరుఁ డాయబ్జాసనుం గూర్చి సాం
ద్రావర ఘోరతపంబుచేసి మఱిబాగొప్పంగ మెప్పించి సా
వరదా శాంతవిచార నాకుఁ బురుషప్రాయంబుచేఁ జావులే
నదిసత్యంబుగని మ్మటంచును వరం బాభీలతం గైకొనెన్. 99

ఉ. కానన భేదుఁడైన శతకంఠుఁడు జానకిచే నణంగునే
గాని మఱొండు శౌర్యులను గైకొనఁ డంగనచేతఁ జచ్చుటల్
మానవనాథ సిద్ధమది మావచనంబులు కల్లగావు సు [గున్.
మ్మానలినాక్షిఁ దోడుకొని యాహవభూమికిఁ బోవు టొప్ప

సీ. *ఏతల్లి దాసదాసీతతుల్ బ్రహ్మస
దాశివవిష్ణులుఁ దత్సుతులును
పరఁగ నేవనిత నివాళిపళ్లెరములు
బంధురకైరవపద్మహితులు
ఏయమ్మబోనపు టిండ్లనఁ జెలువొందుఁ
దలపోయఁగా సప్తజలనిధులును
ఏమహాశక్తికి నెల్లబ్రహ్మాండంబు
లనవరతంబును నాటపట్టు

గీ. లొనర నేసతి యూర్పుల నుదయమైరి
మూఁడుమూర్తులు నీజగన్మూల మెద్ది
యప్పరంజ్యోతి సీతగా నాత్మఁదలఁపు
కేవలాంగనగాఁ జూడ కీవు నృపతి. 101

వ. ఈపరమరహస్యంబు బాహ్యంబుగాకుండ నీచిత్తమందు నునిచి సీతాసమేతుండవై యుద్ధంబున కరిగి శతకంఠునిం బరిమార్చి గొబ్బున మరలి రమ్మని యాశీర్వదించి వెండియు వసిష్ఠుం డిట్లనియె. 102

*సీ. ఏదేవదేవికి నేదేవదేవాది దేవతల్ దాసులు దివ్యకీర్తి
యేకాంత కేకాంతి కేకాన్త వేదాంత తత్త్వరహస్యంబు దనరఁ గలుగు
నేకొమ్మ కేకాక్ష శేషరక్షోరూప రూపపంచాక్షరిరూఢి నెసఁగు
నేశక్తి కాసక్తి నీయబ్జభాండంబు నాటపట్టైయుండు నఖిలమునకు

గీ. అంత ఫల్గుని యెల్లి దినాంతమైనఁ
కమలమిత్రుఁడు గగనమధ్యమునఁ గదియ
జైత్రయాత్రకు నప్పుడే చనఁగవలయు
మనసు రంజిల్ల నేగుమీ జనవరేణ్య. 103

గీ. ఆర్తరక్షక యిట్టిమహావహాస్త్రమందుఁ
గదలి శతకంఠుఁ బరిమార్చుకదనమునను
అస్త్రశస్త్రాధిపతుల నీయాత్మఁ దలఁపు
సేననెల్లను బురికొల్పుమానవేంద్ర. 104

వ. అనిన విని రామచంద్రుండును సాంద్రతరాశ్చర్యమాన సుండై జానకీప్రయాణంబునకు సమ్మతించి సంభ్రమింపుచు నుండె వసిష్ఠుండును గృహంబున కరిగెఁ దమ్ములును మిత్రులును దమతమనివాసములకుం జనిరి రఘునాయకుండును సుఖనిద్రం జెందెనంత *నుషఃకాలంబున మంగళ పాఠకు లరుదెంచి వీణానాదంబుల నింపుసొంపుగా భూపాల

---

సీ. *ఉదయకాలంబున ముదమొప్ప మంగళపాఠకు లరుదెంచి భక్తిమీఱ
వేణువీణానాదవిమలస్వరంబులు గాంధారిమళహరిగౌళనాట
భూపాళసురటికాంభోదినారాయణి మొదలైనరాగముల్ ముద మెలర్ప
వానిమిశ్రంబులు వరుసనునయనముల్ కాలంబులఘువులు కడు ముదమున

గీ. ముఖ్యడోలావితానముల్ సఖ్య మలర,యకార దశరవసంపూర్ణయనముదాత్త
స్వరితప్రత్యయమందంత సరణి మధ్య,మమును సరిగమపధనిసామగరిగరిస
జంపె మటియయు నటతాళ మింపుమీఱ
త్రిపుట యొకతాళి రూపవిస్తీర్ణములను.

క. ఈరీతిని సంగీతము, నేరుపుగాఁ బాడి మిగుల నేర్పులుగలుగన్
శ్రీరాముని మదిఁ దలఁచుచు, హేరాళముగాను సంహితేంద్రులు వినఁగన్.

దేశాక్షి దేవగాంధారి మలహారి నారాయణి వసంతాది రాగంబుల ననురాగంబుగావించి వానిమిత్రంబులు నయనంబులును కాలంబులును లఘుముఖ డోలాదివితానంబులును లవురసౌరవ రవంబులును మధుర మందర మధ్యమ తారకంబులును రాయిస్థాయిరవంబులును సరిగమపధనిసాది కళికోత్కలిక జంపె మట్టిమ అటతాళ ఏకతాళ త్రిపుట రూపక ముఖానేకతాళంబులను దెలిపి యిట్లనిరి. 105

సీ. సమరగుణోత్సాహ జయగుణసందోహ
మేఘకోమలదేహ మేలుకొనుము
మునిజనవనచైత్ర వనరుహాదళనేత్ర
మిత్రవంశపవిత్ర మేలుకొనుము
దళితశంకరచాప కలితజయాటోప
మృదుభాషణకలాప మేలుకొనుము
వితతశుభాచార విమతరాడ్గజవార
మృగనాయకకిశోర మేలుకొనుము

గీ. †అనుచు రావణకుంభకర్ణాదిదైత్య
సంహృతి స్తవగీతముల్ సలుప నలరి
భానువంశుండు తనముఖపద్మ మలర
మేలుదేరంగ నొయ్యన మేలుకొనియె. 106

---

†అనుచు శ్రీరఘురామపాదాంబుజములు
మరిని తలఁచుచు గీతము ల్మద మెసఁగఁ
బాడి రంతట రఘుముఖపద్మ మలర
మేలుదెలఁగుల......

శా. ఈరీతిం దగమేలుకాంచి వసుధాధీశుండు కాలోచితా
చారంబుల్ గడతేర్చి భూసురనమస్కారంబులుం జేసి త
త్కారుణ్యంబున దీవనల్ గొనుచు సంగ్రామప్రయత్నంబునన్
భూరిప్రస్ఫుటసత్కిరీట మచటం బూనె న్ముదం బొప్పఁగన్.

క. అన్నరవరునిశిరంబునఁ
జెన్నలరెఁ గిరీట మప్పుడు [1]జిగిమించుచుశృం
భన్నీలశైలశిఖరిని
సన్నిహితమహార్కుఁ బోలెఁ జర్చింపంగన్. 108

వ. *అదియునుగాక మఱియు ననేకచిత్రమణిభూషణపరంపరలు దివ్యాంబరంబులు ధరియించినం గనుంగొని సీతామహాదేవి తనపతివ్రతాధర్మంబె భూషణంబుగాని కొండొకయలంకారంబులు గలవే యని సమరప్రయాణప్రయత్నంబున నుండె నంత. 109

గీ. దేవ భూదేవతతులు నుతింప యాత్ర
కావసిష్ఠుండు నిది సమయం బనంగ

---

1 జిగిమించుచుఁ బూర్వోన్నతగిరిశిఖరంబునఁ.

* చ. అదియుఁనుగాకయున్న తగినట్టి విచిత్రసువర్ణకాంతి యిం
పొదవి విహార యీరమణి భూషణముల్ ధరియించియున్న స
మ్మదమునఁ బూని సీత తనమానసమందుఁ బతివ్రతాగుణా
స్పదమని వేఱె భూషణముఁబట్టఁ బనేమి యటంచు నుండఁగన్.

వ. అత్యంత మనోత్సాహంబున రణప్రయాణసమయంబున నుండె నంత.

గీ. సురలు భూసురు లత్యంతజృంభణమున
వినుతిసేయంగ నావసిష్ఠునిమతమున
సమయ మిదియని సకలసంభ్రమము లలర.

బరఁగ రాక్షసలోకగర్భములు పగుల
నపుడు చఱపించె జైత్రప్రయాణభేరి. 110

మహాస్రగ్ధర. అదరెన్ బ్రహ్మాండభాండం బరుదుగఁ జలనం
బందె సప్తాంబురాసుల్, చెదరె న్నక్షత్రపంక్తుల్ జిగిబిగిఁ
బరమేష్ఠి న్భయం బందె నాత్మన్, బెదరెన్ దిగ్దానదంతుల్
బిఱబిఱఁ దిరిగెన్ భీషణంబై కులాద్రుల్, వదలెం గాలుండు
జీవప్రజనులఁ గెడపన్ భాండమై భేరి మ్రోవన్. 111

క. తదనంతరమున రాఘవుఁ
డాదవినమోదమున శుభముహూర్తముతోడన్
సుదతియుఁ దానును గడు నె
మ్మదిఁ జేసెను దల్లులకు నమస్కారణంబుల్. 112

క. చేసినఁగొడుకును గోడలిఁ
గోసలరాజేంద్రతనయకుశలత మెఱయన్
భాసిల్లుచు దీవింపఁగ
నాసుదతుల వీడుకొని రయంబున వెడలెన్. 113

క. భరతశత్రుఘ్నలక్ష్మణు
లరుదుగ దీవింప వెడలి రగ్రజుతోడం
గర మొప్పఁ బుత్రపౌత్రులు
నరిగిరి రయమునఁ గనత్సురాధిపు లలరన్. 114

వ. ఇవ్విధంబునఁ బుత్రపౌత్రనిచయంబును సకలబంధునివహం
బును దనతోడ నడువ నంతఃపురంబుదా నభిజిన్ముహూర్తం
బున వెడలి సుమంత్రాదిమంత్రుల నయోధ్యాపుర పరిపాల
నంబునకు నియోగించి పురమధ్యంబునం జనుసమయంబున.

సీ. శ్రీరస్తు భూపాలశేఖరా! యని సర్వ
గీర్వాణజనము లాశీర్వదింప
శుభమస్తు సౌజన్యచూడామణి యటంచు
విప్రవర్గములు దీవించుచుండ
నెలమి సమస్తగ్రహైకాదశస్థాన
ఫలమస్తనుచు జ్యోతిష్కులు పలుకఁగ
[1]నభ్యుదయపరంపరాభివృద్ధిగఁ గవీ
శ్వరులు గవిత్వలక్షణముఁ దెలుపఁ
తే. గాంతలభ్రంకషోజ్జ్వలకలితభర్మ
హర్మ్యవరమ్యాగ్రముల నెక్కి యలరుకొనుచు
నగుచు దూర్వాక్షతప్రసూనములుచల్లఁ
బూర్ణకుంభద్వయంబును బొడఁగనుచును. 116

వ. ఇట్లరిగి 117

ఉ. హాటకకేతనంబును జయప్రదషోడశరత్నచక్రముల్
కోటిమహాగ్రఘంటికలు ఘోరశరాసనబాణతూణముల్
పాటవమైనసారథియుఁ బ్రస్ఫురవర్మభయంకరస్ఫుర
ద్ఘోటసహస్రముం గలయకుంఠితదివ్యరథంబుఁ గన్గొనెన్. 118

చ. కనుఁగొని ఘంటికాపణవకాహళభేరిమృదంగవాద్యముల్
వనధిపరీతభూస్థలి నవక్రత నిండుచు బోరుగొల్పఁగాఁ
దనగురుఁ డావసిష్ఠుఁడు ముదంబున మున్నె యనుగ్రహింపన
య్యినకులనాథుఁ డెక్కెఁ దనయింతియుఁ దాను సురాలి
మెచ్చఁగన్. 119

---

1. విజయోస్తుసకలసద్వైభవరాజబిడౌజ యనుచు సత్కవులు స్తోత్ర
ములు చేయ.

గీ. రాజపరమేశ్వరుం డైనరాఘవునకు
భూజగన్మాత యైనట్టి భూమిజకును
దగనరుంధతిముద్రాక్షతప్రసూన
మిచ్చి దీవించి యారతు లిచ్చె నపుడు. 120

గీ. రాజదేవేంద్రుఁ డైనట్టి రాఘవుండు
రథముమీఁదను జూపట్టె రమణితోడఁ
ద్రిపురములుఁగూల్చ నసదృశ తేజమునకు
గౌరితోఁ గూడి చనెడి శ్రీకంఠుఁ డనఁగ! 121

వ. ఆసమయంబున. 122

శా. మేఘాభాంగుఁడుఁ గార్యవేది దళితామిత్రుండు యుద్ధక్రి
యా, శ్లాఘాయుక్తుఁడు సత్కృపాకరుఁడు సౌజన్యుండు
బ్రహ్మాండభాం, డాఘాతప్రతిమానతీక్షణతరోద్యద్బాణుఁ
డాఖండితా, ఘాఘుం డాభరతుండు వేడ్క వెడలెన్
హాళిన్ ముదం బొప్పఁగన్. 123

శా. సుత్రామప్రతిమానవైభవసుఖస్తోముండు భాస్వన్మహో, గా
త్రుం డాశుగపూర్ణతూణధరుఁ డుగ్రద్వేషిసంహారక, క్షాత్ర
ప్రాభవుఁ డప్రతిద్వయుఁడు సంగ్రామప్రచండుండు త, చ్ఛత్రు
ఘ్నుండును వేడుక న్వెడలె నిచ్చన్ రాముఁ డుప్పొంగఁగన్.

మ. పుడమి మిట్టట్టుచలింప దిక్కరిచయంబుల్ మ్రొగ్గ నొక్కమ్మడిన్
జలధివ్రాతము లింక భీషణధనుర్జ్యాఘోషగావించుచుం
బిడుగుల్ వోలినబాణముల్ గలిగి యాభీలప్రతాపంబుతో
వెడలెన్ లక్ష్మణుఁ డల్లనల్లన సురల్ వేడ్కం దనుంజూడగఁన్.

సీ. తమతండ్రు లట్టుల తమకంబు శౌర్యంబుఁ
గలిగి వర్థిల్లెడిఘనులు వీరు

వాల్మీకి దత్తదుర్వారబాణాక్షయ
శరధులు గలిగినజయులు వీరు
సీతావధూగర్భసింధుసంభవములై
మహిమీఁదఁ గనుపట్టు మణులు వీరు
శతకంఠవరచమూసముదయంబులఁ జంపఁ
దొడరినయట్టి మృత్యువులు వీరు
తే. చూడుఁడని నిర్జరులు కడుఁజోద్యమందఁ
దల్లిదండ్రులు ముదమందఁ దాముదంతి
యుగముపై నెక్కి వెడలి రత్యుగ్రు లగుచుఁ
గుశుఁడు లవుఁడును రిపుగజాంకుశము లనఁగ. 126

గీ. తాత రాముండు ముదమందఁ దండ్రి కుశుఁడు
గారవంబున సెలవులఁ బొఱి సవ్వ
డంబుగా నొక్కయుత్తమాశ్వంబు నెక్కి
వెడలె విజయుండు రౌద్రుఁడై మృడునికరణి 127

వ. ఇవ్విధంబున రాజపరమేశ్వరుండును బరమేశ్వరకాంతా
స్మరణకారణశరీరప్రకాశుండును శరీరప్రకాశనిర్జితకోటి
సూర్యుండును సూరిజనస్తవభుజపరాక్రమవంతుండును శివ
సహస్రనామస్తోత్రపరాయణుండును వేదసారోద్ధారతత్త్వ
జ్ఞుండును నిఖిలవేదాంతతత్త్వరహస్య ప్రవర్ధమానుండును
బ్రభుమంత్రోత్సాహశక్తియుక్తుండును మహోరస్కుం
డును నగు రామచంద్రుండు సాంద్రకళామహిమంబునఁ
బూర్ణిమాచంద్రుని ధిక్కరించుచు సకలసన్నాహంబునఁ
బట్టణమధ్యంబునం గదలునప్పుడు కోమలమేఘంబు కుఱంగట
భాస్వత్తటిల్లతయునుం బోలెఁ జెలంగుచున్న జానకీదేవి

నీక్షించి మించినమోదంబున నప్పురపురంధ్రీజనంబులు గుం పులుగూడి యొండొరుల మొగంబులు గనుంగొనుచు నిట్లనిరి.

గీ. పొలఁతి కుచయుగళంబుతోఁ బోరుటకును
గాదె చక్కనిసౌవర్ణకలశతతులు
నొక్కలై చిక్కపడి చాలఁ దుక్కబట్టి
సుత్తెపెట్లకు లోనయ్యెఁ జోద్యముగను. 129

గీ. మధ్యమక్కెసరికిఁ దగుమధ్యమంబు
పిఱుఁదుపులినంబునకు గట్టిబిరుదుచూడఁ
బదములంబుజములకు నాస్పదములగును
రామసౌందర్యవిభవాభిరామగాదె. 130

గీ. [1]లోచనభ్రూస్తనద్వయలోలమధ్య
కైతవములు వహించుచుఁ గలితసింహ
కుంభమిథునధనుర్మీనకులము లిపుడు
కన్యయందుండు టాశ్చర్యకరముగాదె. 131

వ. ఇట్లు పురసతు లభినుతింప రామభద్రుండు నిర్నిద్రసంభ్రమం బునఁ బ్రొద్దుగ్రుంకునంతకు సాకేతపట్టణప్రాకారద్వారంబులు గడచి కరదీపికాసహస్రంబులతో సకలరాక్షసవనచరమనుజ సేనామధ్యంబున కరిగి యచట విభీషణకల్పితంబైన పటకుటీ రంబున విడిసె భరతశత్రుఘ్నలక్ష్మణులును కుశలవాదితన యులును విజయాదిపౌత్రులును దనచుట్టును విడిసిరి. వారి కిం బ్రాపుగా ద్వాదశాక్షౌహిణులతో దేశాధిపులుండిరి. వారికి రక్షకుండై సుగ్రీవుండు డెబ్బదిరెండువెల్వలతోఁ బరి

1 లోచనద్వయకుచములు లోలమధుర.

వేష్టించి యుండె తద్బలంబునకు వలయాకారంబుగా విభీష ణుండు తనసేనలతోఁ గాపయ్యె అన్నిబలంబులకు హను మంతుఁడాదరువై తద్బలంబునకు రసాతలంబును నక్షత్ర మండలంబును ముట్టనాభీలంబుగా వాలంబు వెంచివాటం బుగాఁ గోటఁజేసి ద్వారప్రదేశంబున మృత్యువుంబోలి కడంగి యుండె అఖిలజీవంబులును తమతమమనుకులఁజేరె ఆవ్వేళ భేరీమృదంగాదితూర్యఘోషంబులును బలసింహనాదంబు లును సమస్తహాయహేషారవంబులును గంధసింధురబృంహి తధ్వానంబులును రథనేమినిస్వనస్వనంబులును భల్లూకఘుర్ఘుర ధ్వనులును కార్ముకగుణటంకారంబులు బుంఖానుపుంఖంబులై యొక్కపెట్టున నఖిలబ్రహ్మాండకోటరంబులు ఘుమఘుమాయ మానంబులుగా నిండి విలయకాలంబున బడబానలముఖంబు లకు నులికి మొఱపెట్టు సప్తార్ణవంబుల ననుకరించె అది ప్రళయసమయంబునుంబోలె విభీషణ ప్రగల్భంబై సంగ్రామ వర్తనంబునుంబోలె శత్రుఘ్న ప్రశస్తంబై నాట్యంబునుం బోలె భరతకలితంబై పవిత్రస్థలంబునుంబోలెఁ గుశాభిరామం బై భారతరణంబునుంబోలె విజయప్రసిద్ధకరంబై సరోవరం బునుంబోలె నీల కుముదసంశోభితంబై శృంగారవనంబునుం బోలెఁ బాటలపనసరంభాలంకారంబై అలకానగరంబునుం బోలె సకలరాజసంచయంబై యుండె నంత. 132

సీ. బలువిడిఁదమ్ముల నలరించుచసికుండు
మాఁడుమూర్తులకును మూలదుంప
ఘనులచే నగ్ఘ్యముల్ గొనెడిమహాత్ముండు
నెట్టన దీప్తులపుట్టినిల్లు

ఎన్నంగ సమవర్తిఁ గన్న జగత్కర్త
చక్రరక్షణములు సలుపురాజు
సతతప్రసన్న దీక్షాగుణాధ్యక్షుండు
[1]విప్రనమస్కరణప్రియుండు

గీ. శ్రీరఘూద్వహునిజవంశకారణుండు
భూజనంబుల రక్షించుపుణ్యమూర్తి
నిరుపమధ్వాంతశుష్కవనీదవాగ్ని
యర్కుఁ డుదయించెనరుణసంపర్కుఁ డగుచు. 133

వ. అంతకుమున్నె రాముండు సంధ్యాదిక్రియలు దీర్చి గంధమాల్యాంబరాభరణంబులు ధరించి విభీషణసుగ్రీవాంగదహనుమత్ప్రభృతుల రావించి వారివారికిం దగినకట్నంబులును భూషణంబులును ముదంబున నొసంగి యుగ్గార్గేయముహూర్తంబున సేనల నడువ నియోగింపుండని సుషేణునిం బిలిచి మన్నించి మార్గంబు సూప నియమించి తనతమ్ముల నవలోకించి కుశలవవిజయులను మీరును సకలనృపతులం గదలింపుఁ డనిన నమస్కరించి తమతమబలంబులకుం జాటింప వారును గరవాల ముసల ముద్గరపట్టిస ప్రాస త్రిశూల గదా పరిఘా భిండివాల కఠార కుఠారకఠోరధనుర్బాణంబులు గైకొని నీల నల హార సంపాత్యవక్ర వక్రజిహ్వా శూలముఖ రక్తవదన ఏకపాద కుటిలకేశోలూఖ మహాగర్భ వికృత పార్శ్వాదులగు రాక్షసులును గవయ గంధమాదన గోముఖ జ్యోతిర్ముఖ పనస నల నీలాంగద వేగదర్శి గవాక్ష మైంద ద్వివిద జాంబవదాది మహాకపినాయకులును నీల యవన

1 భూసురస్తోత్ర సత్పూజితుండు.

పృథు సంచరణ ప్రదీప్త భరతత్రిభంగ భీమనీలకేశసుధేష్ణ
స్త్రికాప్యప్రముఖ నిఖిలదేశాధిపతులును గజహయాందోళన
స్యందన బృందంబుల నెక్కి తమతమ వెంట చతురంగబలంబులు
గొలువ ఛత్ర చామరాది నానాలాంఛనంబులు మెఱయ భేరీ
మృదంగశంఖపణవాద్యనేక వాద్యంబులు మొరయ నేలయీ
నిన తెఱంగున భూమియందును వియత్తలంబునందును పర్వ
తంబులయందును తటాకంబులయందును దిక్కులయందును
బట్టుచాలక యెనుబది యోజనంబుల పొడవును నంతియ వెడ
ల్పునుగలిగి నిరంతరంబుగా సకలబలంబులు నడువం జొచ్చె
భరతశత్రుఘ్నలక్ష్మణకుశలవవిజయాదులను విభీషణసుగ్రీ
వాంగదులు నలువదిసహస్రంబులతో రామచంద్రునిం బరి
వేష్టించిరంత. 134

సీ. ముఖమూర్ధ్వలోకాంతమునఁగల యజావక్త్ర
మున నున్న చెలియతో ముచ్చటాడ
హస్తముల్ ప్రాక్పశ్చిమాచలంబులతోడ
నెయ్యంబుమీఱంగ వియ్యమంద
నాభీలవాలాగ్రమాధ్రువమండల
సీమతో సందంద చెలిమిసేయ
శాతరోమావళుల్ సరభసలీలన
నక్షత్రపంక్తులకు బెజ్జములు సేయఁ
గీ. బృథుశరీరంబు జగమునఁ బిక్కటిల్లఁ
వనచరావళికి మృత్యువు దల్లడిల్ల
హుంకరించినఁ గులగిరు లులికిపడఁగఁ
మించి హనుమంతుఁ డప్పు డేతెంచి నిలిచె. 135

గీ. ఘోరవాలంబు దలపోయ మేరువయ్యె
భూరితారావళులు మొలపూసలయ్యెఁ
గమలినీనాయకుఁడు బొట్టుగంటయయ్యె
ననుచు రాఘవునకుఁ దోఁచె నట్టివేళ. 136

గీ. తోఁచినను దనచిత్తము తొంగలింప
గాఢపుష్టిని నిండారఁ గౌఁగిలించి
చెలఁగి సేనల నొకదరిఁజేర్ప నీవె
యనుచు నమ్మినవాఁడ నిన్ననిలతనయ. 137

గీ. అనుచు సీతయుఁ దాను నొయ్యనరథంబుఁ
గరుణ నెక్కినఁ గని తురంగములవిడిచి
దేవతలు పుష్పవర్షముల్ దివిరి కురియ
దనశిరోమధ్యమునఁ దాల్చెఁ దద్రథంబు. 138

గీ. [1]మఱియు శత్రుఘ్నభరతలక్ష్మణులుఁ గుశల
వాదిపుత్రులుఁ బౌత్రులు వాయుసుతుఁడు
నావిభీషణుఁడును మిత్రు లతనిభుజము
లందు వీసందునుండి రందంద నిలిచి. 139

ఉ. డంబుగ సేనలందఱు విడంబముమీఱఁగ రోమరోమ కూ
పంబుల నద్రిఁ జీమగమి ప్రాకినజాడ్పున నెక్కి నిక్కుచుం
బంబిన వేడ్క నుండిరి శుభస్ఫుటభాషల సన్నుతించుచున్
అంబరచారు లెల్లను జయంబుగ నిచ్చిరి దీవనల్ వెసన్. 140

వ. ఇట్లాభీలవాలగంభీరదోస్తంభ విజృంభమాణుండై హనుమం
తుండు గొని చనిన భేరీ మృదంగ కాహళ కఠోర భూరి
భాంకార బధిరీకృత బ్రహ్మాండకోటరుండై రాముండును

1 ఈగీతమునకే వేఱొక ప్రతిలో వచన మున్నది.

గ్రహంబులలోనఁ బ్రకాశించు భాస్కరబింబంబునుంబోలె సకలసేనలలోనం దేజరిల్లుచు రవి గ్రుంకునంతకుఁ దమసానదీ తీరంబున విడిసి మఱునాఁ డచ్చట కీడ్కొని సుషేణుండు ముందఱ నడవఁ గ్రమక్రమంబున మహావనంబులును దటాకంబులును బర్వతంబులును దేశంబులునుం గడచి త్రిజగద్భయంకరంబుగా క్షీరసముద్రాభిముఖుండై రాఁ దొడంగె. అంత నక్కడఁ బ్రతాపాలంకారమణుం డగుశతకంఠుండు సకలపురోహితామాత్యబాంధవరాక్షసలోకంబు బలసి యుండ నిఖిలామరదిశారమణసముదయంబు గొలువ నభ్రంకషసింహాసనంబునఁ బేరోలగం బుండునసమయంబున. 141

క. చారులు దిగన్తకోటం
చారులు నిజనాథహితవిచారులు పృథులా
చారులు రయములు మీఱఁగ
నారయఁగా నేగుదెంచి రపు డయ్యెడకున్. 142

క. అరుదెంచి రాక్షసేంద్రుని
చరణంబులు గాంచి మ్రొక్కి చయ్యన నుచితం
బెఱిఁగి సభయెల్ల వినఁగను
సరగునఁ దా మిట్టు లనిరి శతముఖుతోడన్. 143

క. అయ్యా మీపంపున మే
మయ్యాశాపులకు నేగి యచ్చటివార్తల్
నెయ్యమున నరయుచుండఁగఁ
జయ్యన విపరీత మైనచందము వొడమెన్. 144

క. రావణునిఁ దునిమినట్టి మ
హావీరుం డగణితంబు లగుబలములతో

క్రొవ్వున నార్చుచు నొకగిరి
జవ్వనఁ గబళించి నిలిచెఁ జూర్ణముగాఁగన్. 151

క. వానికి నిక్కోటులు నీ
దానవులును దృణముగాఁగఁ దలఁచితి మెట్లో
కాని యశక్యపుఁ గార్యము
కానంబడె నది తరింపఁగా నెత్తెఱఁగో. 152

క. ఉగ్రుండై యాసేనకు
సుగ్రీవుం డనెడువాఁడు సొరిదిగ మీతో
విగ్రహముచేయఁబోదలఁచు
నుగ్రునికై వడిఁ బలిత్వ మొప్పుగఁ బూనెన్. 153

ఉ. ఇట్టిబలంబుతోడఁ బరమేశ్వరునైనను ధిక్కరించుచున్
నెట్టన రాఘవుం డనెడు నిష్ఠురవిక్రముఁ డెన్నిరీతులన్
గట్టితుదం జెలంగు హరికై వడి నాహనుమంతుమీఁదటన్
గట్టిగ నెక్కి వచ్చె నవకింబుగఁ దమ్ములు దన్నుఁ గొల్వఁగన్.

ఉ. వారల లక్ష్మణుం డనెడివాఁడు ధనుర్గుణటంక్రియల్ మహో
దారతమిన్నుముట్ట వివిధస్ఫుటభల్లపరంపరంబుతో
ఘోరతరాహవంబునను గూల్తు శతాస్య నటంచు నన్నుతో
సారెకుఁ జెప్పుచున్ యమునిచందమునం గనుపట్టె నయ్యెడన్.

శా. శౌర్యప్రాభవ మేర్పడన్ భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్
మిమ్ములన్, ధైర్యం బొప్ప నదల్చి మందుచు వివాదప్రౌఢి
బాణాసనా, చార్యుల్ వీరని దేవతల్ వొగడఁగా సంగ్రా
మముం జేయఁ ద్వామార్యత్వంబులు పూని రాఁ దొడఁగి
రత్యంతప్రతాపంబులన్. 156

ఉ. రామునినందనుల్ పటుపరాక్రమవంతులు దేవదత్తసం
గ్రామజయజ్ఞు లుగ్రరిపుఖండనశీలు రనేకసాయక
స్తోమవిశాలతూణగణశోభితబాహులు తండ్రిఁ గొల్చుచున్
హేమికవచ్చి రక్కుశలవాఖ్యులు దానవవంశవర్ధనా. 157

ఉ. భీషణశౌర్యుఁడై మనవిభీషణుఁడు న్నృపుఁ గొల్చి మిమ్ములన్
దూషణచేయుచుం గణఁకతో నసురావళి తన్నుఁగొల్వ దు
ర్భాషలమర్మకర్మములు పాయక తెల్పుచు నంతకంతకున్
రోషము వెంచుచు న్విలయరుద్రునికై వడివచ్చు నందులన్.

చ. *అవి యటనుండని మ్మొకమహాద్భుత మారఘురాము
ముందటన్, నవజలదంబు చెంగటఁ గనంబడుతీఁగె మెఱుంగు
రంగునన్, సవినయలీల నెన్నఁదగు జానకిపేరిట నొప్పుకాంత
దాఁ,దివిరి నిజేశుతోడ నరుదెంచుచు నున్నది రాక్షసేశ్వరా.

ఉ. ఆనను గొప్పు నాసుమహితాస్య ధగద్ధగ లాశ్రుతిద్వయం
బానఁగ నావెడందనయనాబ్జదళద్ధళ లాసునాసికం
బానడు మావళిత్రయము నాకుచదేశనిగన్నిగక్రమం
బానడ లామిటారములునౌర యొయారము దానికే తగున్.

వ. అని మఱియు ననేకప్రకారంబుల నెఱింగింప శతముఖుండును
గోపారుణితలోచనుండై తన కనుసన్న యెఱింగి పనులు
సలుపు దిశారమణుల నవలోకించి. 161

---

చ. *అదియునుగాక నొక్కటి మహాద్భుతమై నరనాథుతోడ స
మ్మదమున దానవాళుల మదం బణఁగింప మహోత్సవంబుతో
నదితిసుతు ల్నుతింపఁగ ననంతరకీర్తి జెలంగ జానకీ
కదనముఁ జూడవచ్చెఁ దనకాంతునిగూడి నిశాచరేశ్వరా.

సీ. పనిచెర రంభ మీపాలికి ననవిని
బలభేదిఁ బొమ్మని సెలవుచేసెఁ
బచనంబుచేసితిఁ బాకయత్నములెల్ల
నన నగ్నిఁ గనుసన్న నప్పు డనిచె
రావదేమిటి యింత కావరమా యని
మొగిఁదిట్టి యమునిపై మొక్కలించె
సొంపారఁ దనమనసున నచ్చి నైరుతి
వరుణులఁ బొండని కరుణఁబుచ్చెఁ
గీ. గొలువుకూటంబు లూడ్చితిఁ గోరిమాడఁ
బంపుఁ డనపిని పవనునిఁ బనిచి రత్న
రాసులంపిన నలకాధిరాజు మెచ్చి
నొనర నీశానునొకమూల నొదుఁగఁజేసి. 162

గీ. కొలువు చాలించి రాక్షసకులవరేణ్యుఁ
డందఱను వారిదిక్కుల కనిచి లేచి
యంతిపురసౌధమధ్యసింహాసనమునఁ
బరఁగఁ గూర్చుండి పడవాళ్లఁ బనిచి యపుడు. 163

వ. తనప్రధానులం బిలువం బనుప వారలును దగినవాహనంబు లెక్కివచ్చి ద్వారప్రదేశంబున డిగ్గి దనుజవల్లభునకు వేర్వేరఁ బ్రణమిల్లి యుచితాసనంబులం గూర్చుండినం గని శతకంఠుం డిట్లనియె. 164

సీ. రాఘవుఁ డనుమహీరమణుండు నాతోడ
నాహవం బొనరింతు ననుచు ననుజ
తనుజబాంధవులును దరుచరనిచయంబు
మీఱి యింతింతను మేరలేక

వచ్చుచున్నాఁడట వారి నందఱఁ దానె
హనుమంతుఁ డనుధీరుఁ డచటఁ దాల్చి
యరుదెంచు చున్నవాఁడట విభీషణుఁడును
మనమర్మములు దెల్పుకొనుచు నృపుని
గీ. పజ్జ రాక్షసచతురంగబలముతోడఁ
బూని యరుదెంచెనట యేమిబుద్ధి మనకు
జెప్పుఁడు మీ చెప్పినట్ల నేఁ జేయువాఁడ
ముట్టివచ్చినకార్యంబు మట్టుపడునె. 165

సీ. నావిని చిఱునవ్వు నవ్వుచు మంత్రులు
పలికిరి దానవభర్తతోడ
యుద్ధ మెవ్వరితోడ నొదవునో యనుచును
మామనసుల నెప్డు మలయుచుండుఁ
గానిమ్ము మీపంపు గైకొని పట్టుక
నరవానరాదుల నలిఁచివైచి
వంశహీను నమిత్రవాదిని నవ్విభీ
షణుఁ జంపి హనుమంతుఁ జక్కఁజేసి
గీ. రాఘవునిదేవి జానకీరమణి దెచ్చి
కాను కిత్తుము మీకు నక్కజముగాను
మమ్మెఱుంగవె మృత్యువుఁ గ్రమ్మఁగలము
సంగరంబున కింత విచార మేల 166

సీ. పెఱికి తెత్తుమె శేషభీకరదంష్ట్రలు
పుడిసిలింతుమె మహాంబుధులు నెల్ల
బెడచేతలోఁ జేతఁ బుడమియు నాకాశ
మడుతుమే పొడిపొడి యగుచు రాల

మ్రింగినత్తుమె హోయి మృత్యువునైనను
కూల ద్రొబ్బుదుమె దిక్కుంభితతుల
బాధించినత్తుమె పవనునిఁ జలమునఁ
బగుల వ్రేతుమె కులపర్వతములు

గీ. తృణముమాత్రము రాముని తేజమెంత
వారిసైన్యంబు లన నెంత వారి దెచ్చు
మారుతాత్మజుఁ డన నెంత పోరఁ గూల్పఁ
దమకు నిమిషంబు పట్టదు దానవేంద్ర. 167

వ. అని యిట్లెఱుంగుఁ బ్రగల్భవచనంబుల దనుజేంద్రు నిమనసు రంజిల్లం జేసి మఱియును పెక్కుచందంబుల గదలు సాఁచుచుఁ బరిఘంబులు ద్రిప్పుచు ముసలంబు లూఁచుచుఁ బరశువు లెత్తుచుఁ దోమరంబులు చూపుచుఁ జాపంబులం గుణధ్వనులు గావించుచు శరంబు లేర్చుచు మిన్నువగుల నార్చుచు ననేక రాక్షసులు సమరంబున కిట్టాడుచు నిల్చిన నచ్చెరువంది తొమ్మిదియగడ్తలు చక్కం జేయించి రసాతలంబు ముట్ట జలంబు నింపించి నవప్రాకారంబులు సవరింప నియమించి సకల ద్వారంబులఁ గాప్పిచ్చులఁబోలినదానవులం బదికోట్ల నుంచి మొగసాల నలువదిలక్షలతో నుండు మనిస్థూలకంఠుని నియోగించి కిన్నరగంధర్వ సిద్ధవిద్యాధర గరుడ నిర్జరపన్నగాదుల కభేద్యంబుగాఁ గావించి కొలువు చాలించి ప్రధానులం బిలచి దానును తనతల్లి యగుచిత్రగంధిపాలికిం జని తద్వృత్తాంతం బంతయు నివేదించి యిట్లనియె. 168

ఉ. వచ్చెడివాఁడుమర్త్యుఁడట వానికిఁ దోడట కోఁతిబారొగిఁ
వచ్చిచతుస్సముద్రము లవార్యత వారట దాఁటి యీడకుం

జెచ్చెర నేగుదెంతురట సేనలదాయును ఘోరమైనకా
ర్చిచ్చుపయింబడక్ శలభసేన గడంగిన యట్లుకాదటే. 169

చ. అదియునుగాక పంక్తిగళుఁడారఘురాముని దేవిఁ దెచ్చి తా
నుది సుఖవృత్తిలేక మఱి ద్రుంగె రఘూద్వహుఁ డిప్పుడుం
దగక్,సుదతిని గూడివచ్చెనట చోద్యముగానటుగానవాని పె
ల్లదరఁగఁ జంపి సీతఁగొను దండఱు మెచ్చఁగశాశ్వతంబుగన్.

చ. అనవిని భీతినొంది తనయాత్మజుఁ గన్గొని చిత్రగంధి యి
ట్లను నకటా తనూభవ దురాత్ములకైవడి నిట్టివాక్యముల్
కనికర మింత లేక పలుకందగునా రఘురాముభార్య నీ
జననిసుమయ్య యన్యసతిచాడ్పునఁజూడకు మెన్ని భంగులన్.

ఉ. రాముఁడు మోక్షకర్త యలరాముని దేవిరమావధూటి యా
రాముఁ జెనంకి గాదెమనరావణముఖ్యనిశాటులెల్ల సం
గ్రామమునందుఁ గూలుట పరామరిసింపుము మర్త్యవేషుఁడై
భూమినిఁ బుట్టెఁగానిరఘుపుంగవుఁ డాదిని విష్ణుఁడే సుమీ.

ఉ. ఆదిని మత్స్యరూపమున నంబుధి సొచ్చియు సోమకాసురు
న్మోది సుర ల్నుతింపఁగను ముఖ్యముగాఁ దనప్రాభవంబున
న్వేదము లొప్పఁ దెచ్చి నృపవీరవరేణ్యుఁడు బ్రహ్మకిచ్చెఁదా
వేదవతీపురంబునఁ బ్రవీణత నుంచె జగత్ప్రసిద్ధిగన్. 173

వ. అని మఱియు ననేకవిధంబులనతం డవతారంబులు పలుపువిధం
బులును మహిమంబులును దక్షిన ప్రకారంబులును సీతయాది
పరంజ్యోతియగుటయును దదీయసామర్థ్యంబును నెఱింగించి
వెండియు నిట్లనియె. 174

గీ. ఘనుని రాముని మానవుగాఁ దలంప
వలవ దాతఁడు పూనినవార్థు లెంత

కోటలన నెంత నీ పనుమాట లెంత
అతని కివియెల్ల నద్దమే యక్కటకట. 175

గీ. వెలయునజు వరములకు గర్వింపవలవ
దట్టి బ్రహ్మను బుట్టించి నతఁడె యితఁడు
అట్లు కావునఁ నాదేవుఁ డలిగెనేని
పద్మజుని యీవు లెందుకు పనికిరావు. 176

వ. అదియునుంగాక వరంబు లనుకూలంబులైనను నీవు విరించిని గోరునపుడు పురుషులచేఁ జావులేకుండ నడిగితివి గాని సతులఁ దలంప నేరవైతివి అని యొప్పుడు నాహృదయంబునఁ దవిలి యుండు రాముఁడు సీతాసమేతుఁడై యరుదెంచు కారణం బేమొకో యెఱుఁగరాదు ఆయమ్మ మహామాయగాని సామాన్యమానవకామినిగాదు. ఇక్కలహంబుమాని యప్పురాణ పురుషుం డగు రామచంద్రుని కెదురుగాఁజని శరణుచొచ్చి బ్రతుకుట మహాకర్తవ్యం బని పెక్కుదెఱంగులం దెలుప రోగికిఁ బథ్యంబు రుచింపనితెఱంగున నమ్మాటలు చెవిసోఁకక చూత మెట్లయిననేమిభయం బని దిగ్గనలేచి చని సమర ప్రయత్నంబున నుండెనంత [1]రామచంద్రుండును నక్షత్రనిచయంబులనడుమఁ జెలువమరు సంపూర్ణచంద్రుని ధిక్కరించుచు

1 ఈ క్రిందిరీతిని పరిష్కృతిలో నున్నది. ద్వితీయాశ్వాసము ముగియలేదు.

సీ. శ్రీరామచంద్రుండు సీతాసమేతుఁడై కమనీయతరనిశాకరునికరణి
సేనాసమేతుఁడై చెలువొప్పగావచ్చె ననుచుఁ బార్వతికిని హరుఁడు చెప్ప
నమ్మహాదేవియ ప్పద్భుతంబును బొంది యటమీఁదివృత్తాంత మంతచెప్పు
మనినఁ జెప్పఁ దొడంగె నఖిలవృత్తాంతంబు దాక్షాయణీప్రేమ దనరబూని

సకలసేనామధ్యంబున రాఁదోడంగె నని వినిపింపఁ బార్వతీ
మహాదేవి యటమీఁదివృత్తాంతం బేమయ్యెనని నిజేశుం
డగు మహాదేవునిం బ్రార్థించుచుండె నంత. 177

ఉ. శ్రీకరమూర్తి హారి నృపశేఖర నిర్జరబృందవందితా
ప్రాకటవైభవస్ఫుట శుభాకరరమ్య గుణాభిరామ శో
భాకరుణాంతరంగ భవభంజన కౌశిక యజ్ఞపాల యి
క్ష్వాకుకులప్రవర్ధన శివాధిపమిత్ర పవిత్ర భాస్కరా. 178

మాలిని. కుటిలదనుజజైత్రా గోపతిస్తోత్రపాత్రా
పటుతరవరగాత్రా భానువంశాబ్ధిమిత్రా
ఘటితనిగమసూత్రా గాఢవిద్యావిచిత్రా,
భటకవినుతిపాత్రా పద్మనీపత్రనేత్రా.

గద్య. ఇది శ్రీమదేయకూర్తినివాస లక్ష్మీనృసింహాకరుణాకటాక్ష సంప్రాప్త మహాకవిత్వ విద్యాపారీణ సుమహితాంధ్రగీర్వాణ భాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రాత్రేయసగోత్రపవిత్రధర్మనార్యపుత్ర నిఖిలమహీసురాశీర్వాదప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ వినయవిధేయ మర్ధన నామధేయప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధము నందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

---

గీ. సకలకల్యాణగుణమూర్తి సాధువర్తి
వేదవేదాంతతత్త్వార్థవిమలహృదయు
రాఘవస్వామి బలములు రమణఁ గొలువ
వాయుజుని గూడి వచ్చెను వచ్చినపుడు.

శ్రీరస్తు.

# శతకంఠరామాయణము

## తృతీయాశ్వాసము.

---

*గీ. శ్రీకరణకార రాజ్యలక్ష్మీవిహార
హార గోక్షీర హీర నీహారతార
తారకాధీశ తార భూధర తుషార
సారకీర్తివిహార పోచమనృపాల. 1

---

*క. శ్రీరమణీయగుణాకర, కారుణ్యాభవాంబురాశికల్లోలభవ
శ్రీరంజితపరవైభవ, ధారణసత్కీర్తిహార ధర్మనృపాలా.

వ. అవధరింపుము సీతారాములు చతుస్సముద్రంబులు గడచి లంకాపురంబు నకుం జని గోపురప్రాకారధర్మహర్మ్యదుర్గంబుల నెట్లు సాధించి రెట్లు దైత్యునిం దునిమిరి తద్వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా వినిపింపు మనిన శాంకరీదేవికి శశాంకశేఖరుం డిట్లనియె.

ఉ. రాముఁడు సద్గుణాకరుఁడు రాక్షసలోకభయంకరుఁడునున్
భూమిజతోడఁగూడి పటుభూరితరాక్రమశీలుఁడై బల
స్తోమము లందఱు న్వినఁగ శూరులు మీరలు సంగరంబులో
భీమపరాజయంబులకుఁ బిక్కకయుండుఁడటంచుఁ జెప్పుచున్.

వ. మఱియును సుగ్రీవాంగదహనుమంతజాంబవద్విభీషణులం గని దుర్గంబుల నావరణంబుసేయుం డని నియోగించి వాలితనూజుం డైన యంగదునవ లోకించి యిట్లనియె.

గీ. దక్షిణద్వారమున...

వ. అవధరింపు మంతఁ బారత్వీదేవికి మహాదేవుం డిట్లనియె. అట్లు సకలగుణాభిరాముండును రమణీయఘనశ్యాముండును సామాదిశ్రుతసంపన్నుండును ఆపన్నజనకల్ప మహీజాతుండును మహిజాధినాథుండు నగురఘువల్లభుండు హనుమచ్ఛిరో మధ్యంబున సకలసేనాసమేతుండై వచ్చి వచ్చి. 2

మహా స్రగ్ధర కనియెఁ రామక్షితీశాగ్రణి యచట మహోత్కంఠ దీపింపఁ జంచ, ద్ఘనసర్వగ్రాహనక్రోగ్రకమఠవిలురద్గాఢపాఠీన కల్లో, లనటచ్ఛైవాలభాస్వల్లసదసితకలాహారరాజీవషండో త్కన దుద్ధూతాస్య దృక్చక్రబకముఖరుతా క్రాంతభద్రుఁ సముద్రున్. 3

గీ. అలరి యీరీతిఁ గనుఁగొని యనుజతనుజ
దనుజమనుజ వనచరసంతతులు గొల్వ
నఖిలవాద్యధ్వనుల్ మిన్ను నదరఁ జేయ
రాఘవుఁడు వచ్చె దుగ్ధాంబురాశికడకు. 4

వ. ఇట్లు రామభద్రుండు సుధాసముద్రతీరంబుఁ దోరంబుగాఁ జేర మారుతనందనుండు సంతుష్టాంతరంగుండై తనశిరో భాగంబున వీఁపునఁ జంకల భుజంబుల గరంబుల దేహంబున నుండిన రాఘవసీతాదులను భరతశత్రుఘ్నులను లక్ష్మణ విభీషణులను సుగ్రీవాంగదప్రముఖుల నందఱ డించి రఘు వరునకుఁ బ్రదక్షిణంబు గావించి నమస్కరించి పురోభాగం బునఁ గరంబులు మొగిడ్చి యున్న మరున్నందను నవలో కించి తననయనంబులఁ గరుణారసపూర్ణంబులు దొరుఁగ సరస మధురవచనంబుల నిట్లనియె. 5

గీ. అన్న పవనజ నీమహాత్మ్యోన్నతంబు
పెంపుసొంపు పేరఁక నెట్లు నుతింపవచ్చు
నే మొసంగినఁ దీఱెడి నీఋణంబు
అనుచు దీవించె శుభదవాక్యముల నపుడు. 6

సీ. సీతయుఁ దనవిభుచెవిసోఁక హనుమంతు
నెలమిమై పేర్కొంచి యిట్టు లనియె
నవ్వేళ రావణుం డట్లు వనంబునఁ
గఠినదైత్యస్త్రీలఁ గాపువెట్టి
బాధగావింప మత్పతిఁబాయునట్టి దుః
ఖంబున వ్రాలి దేహంబు మఱచి
ప్రాణంబులెల్ల వెల్వడుసమయంబున
నరుదెంచి రాముజయంబుఁజెప్పి

గీ. జీవములు నిల్పి రక్కసుకేవిఁ జెఱచి
పతినిఁ గూర్చెద ననిచాలఁ బ్రతినఁజేసి
మరలఁ జని నాయకునకు నే మనుటఁజెప్పి
యబ్ధిబంధించి సకలసైన్యములఁదెచ్చి. 7

గీ. శాత్రవులనెల్లఁ జంపించి జనవరేణ్యు
చే విభీషణుఁ గరుణింపఁజేసి పిదప
నన్ను నావిభుఁ గూర్చితివన్న యొచటఁ
గన్న నీవంటిబంధుండు గలఁడె మాకు. 8

చ. అనవిని మోదమంది మరుదాత్మజుఁ డాన్నృపతిన్ ధరాసుతం
గనుఁగొని యేనుమీమహిమఁ గాదె తరించితి నెల్లభారముల్
వినుతికి నెంతవాఁడ నవివేకిని మర్కటుఁడన్ మహాత్మ మీ
యనుమతిఁజేసి యెట్టిపనులైనను సాధ్యముగాక తక్కునే. 9

ఉ. ఎల్లనిలింపవర్గములు నెల్లనిశాటులు నెల్లరాజులున్
ఎల్లవనేచరుల్ పొగడ నెల్లమునీంద్రులు సంతసిల్లఁగా
నల్లన మీరుచూడఁ జతురబ్ధుల వాలముసాఁచి యందుపైఁ
బెల్లుగ సేనలెల్ల నడిపింతుఁ దలంకకు రాఘవేశ్వరా. 10

చ. అనవిని రాముఁ డిట్లనియె నద్భుతసంభ్రమముల్ పెనంగఁగా
ననిలజ నీవుగల్ల నులుకందఁగ నేటికి నెల్లశూరులన్
ఘనముగఁ జేర్చు మొక్కదరి గ్రక్కున నవ్వలికార్యమెల్ల నే
నొనరఁగఁ జక్కఁబెట్టెద మదుగ్రశరంబుల నాహవంబునన్. 11

ఉ. ఈవనధుల్ తరింపఁజను నెల్లతెఱంగుల నందుమీఁదటన్
దేవమునీంద్రులున్ ధరణిదేవతలున్ జయసిద్ధిగా వెసన్
దీవనలీయ దైత్యుని వధించెద మానులనెల్లఁ బ్రోచెదన్
దేవబుధప్రియాత్మునకుఁ దీరనికార్యము లెవ్వి చెప్పుమా. 12

ఉ. ఎవ్వఁడు విప్రవర్గముల కెగ్గొనరించు నతం డిహంబునన్
దవ్వగుఁ జేయుకార్యము వృథాయగు మోక్షఫలంబు
దూరమౌ, నెవ్వఁడు విప్రవర్గమున కెగ్గొనరింపఁ డతం
డిహంబునన్, మవ్వముగా సుఖించును గ్రమంబున మోక్ష
ఫలంబులుం గనున్. 13

సీ. పరధనాపేక్షకుఁ బాలుపొందినవాఁడు
బరభామినీక్రీడఁ బరఁగువాఁడు
విప్రుల వధియింప వెఱపునొందనివాఁడు
స్వర్ణాపహరణంబు సలుపువాఁడు
గురుదారగమనంబు కోరిచేసెడివాఁడు
భ్రూణహత్యలనెల్లఁ బొందువాఁడు

దేవతాద్రోహంబు దేరిచేసెడివాఁడు
దగవున లంచంబు దట్టువాఁడు
గీ. వివిధక్రీడలసుఖమున వెలయువాఁడు
మిత్రులనుగూడి శత్రుల మేలువాఁడు
సకలవిధముల నశియించి జమునిపాలి
కరిగి నరకాబ్ధిలో మున్గి యార్తినొందు. 14

ఉ కాన మహీసురావలి నకారణ మీశతకంఠుఁ డేఁచునుం
గాన జయంబులేదు మృతిగల్గుట సిద్ధమె యెన్నిభంగులన్
మానిజనాశిషోక్తి గరిమ న్మన కెప్పుడుఁ గల్గుఁ గావునన్
దానవచేసి యుద్ధమునఁ దప్పదు గెల్పు హనూమదాహ్వయా.

గీ. నీకుఁ దక్కఁగ నీవార్ధి నెగసి గడువ
నెవ్వరికిఁ జెల్లునో యాంజనేయ వినుము
ఘనుఁడ వీవుండ మాపరాక్రమము నెగడె
నమితగుణవంత హనుమంత యశుయాంత. 16

గీ. జాగునేయకు మిఁక సురల్ సన్నుతింపఁ
బనుపు బలములనెల్ల శుభస్య శీఘ్ర
మనెడివాక్యము నిజమని యాత్మ నిలుపు
ప్రతిన చేపట్టి కీర్తులు వడయు మనఘ. 17

మ. అనినన్ జువ్వున మిన్నుముట్టి ధృతిమై నందంద లంఘించి చ
య్యన రామాంఘ్రియుగంబునంబడి తదీయాజ్ఞావిశేషంబునం
దనపై నిర్జరు లందఱుం గుసుమముల్ దట్టంబుగాఁ గుర్వ
నొయ్యన నార్చెన్ రవిపుత్రముఖ్యకపు లావాః యంచు
దీవింపఁగన్. 18

శా. దేహం బభ్రముసోఁకఁ బెంచి సితవార్ధిన్ డాసి సైన్యావళుల్
హాహాకారము సేయ రాఘవుఁడు దా నానందముంబొంద ను
త్సాహం బొప్పఁగ భూరివాల మపు డుద్దామప్రతాపంబునన్
బాహుల్ ద్రిప్పుచుఁ జాఁచె దుగ్ధనిధిపైఁ బ్రత్యర్థు లుల్కన్
వెసన్. 19

వ. ఇవ్విధంబున బలవంతుం డగుహనుమంతుండు దిగంతవిశ్రాంత యశస్సాంద్రుండై కృతాంతునిపోలిక నంతకంతకుఁ బంతంబున ధిక్కరించుచుఁ దనవాలంబు యోజనశతద్వయంబు పొడవును నేఁబదియోజనంబుల వెడల్పునుం గలుగ నిక్కించి కలశాబ్ధిపైఁ బఱపి బ్రహ్మామరేంద్రులును గరుడ గంధర్వ యక్ష రాక్షస కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరబృందంబు లందంద నవలోకించుచు నక్కజంబుగాఁ బెక్కువిధంబులనుతింప గదాహస్తుండై మేరునగంబుచందంబునఁ దత్తీరంబునఁ దోరంబుగాఁ గదలక నిల్చి చెలంగుచు నెల్లదళంబులఁ గదలుం డని పెద్ద యెలుంగునఁ బలుక రామభద్రుండును మహైశ్వర్యంబున సీత మొగంబును లక్ష్మణుదిక్కును జూచుచు ననేకవిధంబుల వినుతించుచుండ సుగ్రీవాంగదజాంబవత్సుషేణాదులు ముందఱఁ దోఁకపై వేఁకనడువఁ బుడమిఱేఁడును జానకీసమేతుండై పుత్ర పౌత్ర సహోదరనిచయంబు పరివేష్టించి యరుదేర జయ జయధ్వనులతోఁ జనుచుండె వెనుకొని సకలదళంబులు రాఁ దొడఁగె నాసమయంబున. 20

సీ. వనధిలోపల గుభుల్లనఁ గొంద ఱుఱికి యొ
యయ్యనఁ జని రటు చల్లులాడుకొనుచు

గగనభాగమున నొక్కటఁ గొంద అరిగిరి
మేటివేల్పులచేత మెప్పుఁగొనుచుఁ
గుప్పించి దాఁటఁగాఁ గోరి కొందఱు వెల్లు
లంఘింపఁదొడఁగిరి లఘువు మెఱసి
పవనజువాలంబుపైఁ గొంద ఱే.గిరి
వెక్కుచందంబుల నిక్కుకొనుచు

గీ. రథములును గంధకరులుఁ దురంగతతులుఁ
బొంక మొప్పఁగ నేఁగె నిశ్శంకతోడ
నతనిఁ బొగడుచు నందంద నాడుకొనుచు
నడువఁజొచ్చిరి కొంద ఱందముగ నపుడు 21

గీ. సీత కవ్వేళ రాముండు చెయ్యి సాఁచి
ఘనరఘుప్రాహకర్కటకచ్ఛపములఁ
జూపుకొనుచును వేడ్కతో సుమహితాండ
జాళి నిష్ఠురకలకలం బచట వినుచు. 22

శా. ఈరీతిం గపిసైన్యముల్ గొలువఁగా నింపొందుసీతావధూ
టీరత్నంబును దమ్ములుం దనయుల్ శీవిం ముదం బందఁగా
శ్రీరాముం డసమానవిక్రమమునన్ క్షీరాబ్ధి దాఁ టవ్వలన్
ధీరోదారత నిల్చె నిర్జరతతుల్ దీపింపఁగాఁ జెచ్చెరన్. 23

ఉ. చేరిరి వానరోత్తములు చేరిరి జాంబవదాదిముఖ్యులుం
జేరె విభీషణుండుఁ దనసేనలతో సకలక్షితీంద్రులుం
జేరిరి ఘోటకంబులును సింధురబృందములున్ రథంబులుం
జేరె మరుత్సుతుం డొకఁడుచిక్క సమస్తదళంబు లచ్చటన్.

మత్తకోకిల. మారుతాత్మజుఁ డిట్టిరీతి సమస్తసేనల నొయ్యనన్
భూరివాలమువిూఁదఁ బంపి యపూర్వవిక్రమశీలుఁడై

ధీరతం దనతోఁక మెల్లనఁదీసి పువ్వులవాన బ్రం
దారకుల్ గురియింప నిల్చె ముదంబు నెక్కొన నత్తఱిన్. 25

చ. రఘుపతి తన్నుఁజూడఁగఁ బరాక్రమ మారయ వించు ధీరసా
రఘనశరీరుఁ డైనకపిరాయఁడు చేరువ నున్నకొండపై
లఘుగతి నెక్కి నిక్కి కుతలంబు వడంకఁగ నార్చి దోర్బల
ప్రకటితకీర్తిశాలి యని భానుజముఖ్యులు సన్నుతింపఁగన్. 26

చ. నగుమొగమెత్తి భానునిఁ జెవంకఁగ దొంకఁగదల్చి బాహు
వుల్, దగజళిపించి యంఘ్రులుచితస్థితిఁ గూడఁగఁబెట్టి జువ్వు
నన్, నగము వణంకఁ దూఁగి వదనంబు బిగించుచు రామ
చంద్రు భూరిగుణుఁ దలంచి దాఁటె బలుతెక్కల నొప్పు
సురాద్రికైవడిన్. 27

చ. అపుడు సమస్తలోకములు నల్లలనాడె భయంబు పెంపుచే
నపుడు మహానిలంబు జగమంతయునిండెఁ దలంచి చూడఁగా
నపుడు పయోనిధుల్ గలఁగె నల్లన దేవత లాశతోననుం
డపుడె యణంగె నంచు ముదమందుచు నుండిరి మాటిమాటి
కిన్. 28

ఉ. పావనియున్ వనేచరులు ప్రస్తుతిచేయుచుఁ దన్నెదుర్కొ
నన్, వావిరి నేగుదెంచి తనవల్లభుఁ డైనరఘూద్వహున్
ధృతి, గ్రావకులేంద్రుఁ జూచి పొసఁగం బ్రణమిల్లి కరాబ్జ
యుగ్మమున్, శిఖిగ ఫాలమందున ఘటింపఁగఁ జేయుచు నిల్చె
ముందటన్. 29

ఉ. అంతట రాముఁడుం బటుదయారస ముబ్బఁగఁ జూచి [1]యా
హనూమంతుని శాంతునిన్ సుజనమండనచారువనీవసంతు

---

1 యమ్మహాశాంతుని నఘయాంతకుని సద్గుణవంతుని శౌర్యవంతునిన్.

నిన్, వింతగఁ గౌఁగిలించి కడువేడుక దీవన లిచ్చి వాఁటికిం
బంతముతోడ నిల్చెఁ బసపజ్జను సీత చెలంగుచుండఁగన్. 30

*వ. ఇవ్విధంబున రఘుకులేంద్రుండు సకలసేనాసమేతుండై నాఁటి కప్పుటనిల్చి మఱునాఁడు ఘృతసముద్రంబును మూఁడవ నాఁడు దధిసింధువును నాలుగవనాఁడు సురాంభోనిధియును క్రమక్రమంబున హనుమదాభీలవిశాలవాలంబుపైఁ గడచి జానకియుం దానును జనకసుతునిశిరోమధ్యంబున రథంబుపైఁ దేజరిల్లుచుఁ బ్రతాపలంకాలంకారప్రాకారద్వారకవాటపరిఘాచమత్కారభర్మహర్మ్యప్రాసాదగోపుర శాతకుంభ కుంభ గంభీరవారణ రథతురంగభటబృందంబులం గల విశేషంబులు నక్కజంబుగాఁ బెక్కుచందంబుల నవలోకించుచుఁ జను

* ఈవచనములోఁ గొంతభాగము పరిషత్పుస్తకములో నీ సీసమున్నది.

సీ. ఈగతి నినకులేంద్రుఁడు సకలసే
నాసమేతంబుగా నచట నిలిచి
మఱునాఁడు దాను మారుతపుత్త్రుని
శిరమున రథముపైఁ జెలువు మెఱసి
ఘృతసముద్రము దాఁటె మూర్ఛిల్ల జగములు
దధిసముద్రముదాఁటె ధరణి దిరుగ
సురసముద్రముదాఁటె సురలు సన్నుతిసేయ
వలనొప్పు హనుమంతువాలమునను
గీ. సీతయును దాను రణకేళిసీమ వెలయఁ
దనర వేంచేసె నపుడు ప్రతాపలంక
గోపురద్వారప్రాకారగోష్యహర్మ్య
భర్మరథగజబృందముల్ పేర్మిఁదలఁచి.

నప్పుడు సకలదిక్కులయందును బిక్కటిల్లుచు భూనభో
మధ్యంబున నిరంతరంబుగా నిండి బలంబు లరుదెంచి శత
కంఠనిపురంబు డాసి కాహళమృదంగఢక్కాముఖబహువిధ
తూర్యనాదంబులు బోరుకలుగ మనుజదనుజశాఖామృగ
వాహినీసమూహంబులతో రఘునాయకుండు విడిసె బలంబు
లునుం దగినయెడల నుండిరి విభీషణసుగ్రీవాంగదముఖ్యులు
రాముని చేరువ నుండిరి భరత శత్రుఘ్నలక్ష్మణకుశలవవిజ
యాదులు సేనాసమేతంబుగా సీతం బరివేష్టించి రామునిం
గొలిచియుండిరి రఘువరుండును బట్టణంబు నెట్టన ముట్టడి
వేయ నూహించి విభీషణసుగ్రీవాంగదజాంబవన్మరున్నంద
నానుజానుమతంబున [1] 31

గీ. దక్షిణద్వారమున నీవు దక్షిణేశు
కరణి వానరబల మసంఖ్యంబు గొలువ
మెండుకొని పట్టువదలకయుండు మనుచు
నంగదునిఁ బంపె నప్పు డత్యద్భుతముగ. 32

గీ. వివిధభంగులఁ బడమటిగవనియందుఁ
గ్రూరభల్లూకములు నూఱుకోట్లు గొలువ
నప్రమత్తుఁడవై యుండు మనుచు జాంబ
వంతు నటఁ బంపెఁ బటుబలవంతముగను. 33

గీ. అగచరోత్తము లరయ నూఱర్బుదములు
నేర్పుతోడుత మిముఁ గొల్వఁ దూర్పు దెసకుఁ
జనుఁడు మీ రని గోముఖపనసవృషభ
శరభులను బంపె సంగరోత్సాహమునను. 34

1 పరిషత్పుస్తకములో నిక్కడకు రెండవయాశ్వాసము పూర్తియైనది.

గీ. అంత మిగిలిన సైన్యంబు నల్లనొక్క
మూఁక గావించి వారి నిమ్ముల నొసంగి
కదలు మనుచును శత్రువుల్ కళవళింప
నుత్తరంబున సుగ్రీవుననిచె నపుడు. 35

చ. వరుస విభీషణుం గొలిచివచ్చిన దైత్యులఁ గొమ్మకొమ్మ కొ
క్కరిఁ బురికొల్పి వారలను గాఁ బ్రధానులఁ జూపి యెల్లభూ
వరనివహంబులం బిలిచి వాహిను లల్పములైనచోట మీ
రరయుచు నుండుఁడీ యనుచు నల్లనఁ దా నియమించె
నెంచఁగన్. 36

ఉ. అంతట నన్ని దిక్కుల నయంబుగ నేర్పఱుపం గణంకతోఁ
గొంద ఱగడ్త లూఁచుచును గొందఱు కొమ్మలు కూల
వ్రేయుచుం, గొందఱుఁ దత్కవాటములఁ గుంజరయూథము
రీతిఁ ద్రోయుచుం, గొందఱు గర్భముల్ వగులఁ గ్రొవ్వున
నార్చుచు నుండి రత్తఱిన్. 37

సీ. ఆసమయంబున నవనీశుఁ డగు రామ
చంద్రుఁ డల్లన విభీషణునిఁ జూచి
యమ్మహాకుశలుని యనుమతిఁ గైకొని
మంతు కెక్కినహనుమంతుఁ బిలిచి
సేనల నమ్మును జేర్చితి విచట నీ
కృప నెల్లపనులు దిగ్విజయమయ్యె
నిటమీఁది కార్యమే నెన్నిభంగులనైన
ఘటియింపఁ జేయుమఁ గాండములను
గీ. గాన నింతకు నాశతకంఠుబుద్ధి
యెట్టిరూపున మెలఁగునో యెఱుఁగరాదు

రాయబారంబు తరుచరరాజ నీవు
[1]పోయివచ్చుటఁ గార్యంబు పొసఁగు ననుచు. 38

గీ. ఎల్లి పుష్యమి యాత్రకు నిది జయంబు
రమణ నీపేరఁ జంద్రతారాబలములు
గలిగియున్నవి చని శతకంఠుఁ జూచి
మమ్ము నెఱిఁగించి చయ్యన రమ్ము పొమ్ము. 39

గీ. వనజసంభవుఁ డొసఁగినవరములకును
మది మదింపకు మనిపల్కు మఱి మదించి
పోర నాచేత దగ్ధులై పోయినట్టి
దశముఖానేకదైత్యులఁ దలఁపుమనుము. 40

గీ. లీలఁ బురుషులచేఁ జావులేకయుండ
బ్రహ్మఁ గోరితి నని వాఁడు బలికెనేని
మించి యిచటికి నే నరుదెంచినట్టి
రాక తలపోయుమను మయ్య యోకపీంద్ర. 41

*గీ. వెఱచెనేనియు నిప్పుడే శరణుచొచ్చి
మనుట మేలని యెఱిఁగింపు వనచరేశ
శరణుచొచ్చినవెనుక నాదరణిసురలఁ
జేయుదుండగములు మదిఁ జేర్ప ననుము. 42

---

1 ధీరతను జని యంతయుఁ దెలుపవలదె.

*వ. అదియునుంగాక నీలంక నిశ్శంకబిరుదాంకంబుగా సాధించి నీకేతనంబు ధరాతలంబునంగూల్చి సకలసేనాసమేతుండనై సాకేతనగరంబునకుం జని సకలదిగ్విజయంబుగా సురగరుడయక్షకిన్నరగంధర్వసిద్ధవిద్యాధరామరేంద్రులచే మెప్పు గైకొని విజయంబు నొందెద మని చెప్పుము.

క. చనుమనిపంచిన నలరుచు
హనుమంతుఁడు కిష్కింధాకృతాంతుఁ డనుపమవిద్యా
ధనవంతుఁడు బలవంతుఁడు
జనవల్లభుచరణపంకజములకు నెఱఁగెన్. 43

వ. ఇవ్విధంబున నమస్కరించిన నమ్మహాత్ముండు దీవింప నచట
వీడ్కొని తా నరిగెడిమార్గంబున నున్నసుగ్రీవున కెఱింగించి
అనుపవచ్చినవిభీషణు నునిచి సకలవానరదానవమానవనిచ
యంబులు జయజయధ్వనులు గావింప నరిగి ద్వారంబులం
బలసియున్న మహాదానవులఁ బరికించుచు నదృశ్యశరీరుండై
నవప్రాకారంబులు గడచి తనమహాకారంబుఁ గొందలు గని
పఱచెడివిధంబుఁజూచి నవ్వుచు నరయవచ్చినవారల హుంక
రించుచుం జనిచని పట్టణంబు వీక్షించునప్పుడు. 44

*గీ. ఆలరు నప్పురిరమ్యహర్మ్యాగ్రశాత
కుంభకుంభవ్రజంబులఁ గొమరుమిగులు
ప్రకటజాంబూనదాంభోజముకుళములను
సరసమగునట్టి మానససరసిఁబోలె. 45

---

*సీ. మహనీయతరహేమమంటపప్రాకారసౌదామినీరత్నశాలలందు
వజ్రము ల్దాపినవరుసచిత్తరువులు వ్రాసినకుడ్యము ల్వన్నెమీఱఁ
బవడంపుఁగంబాలు ప్రభవించు నెఱగట్టు లలితమైనట్టివిలాసములును
సరసంపుమాణిక్యసంఘముల్ గట్టినసారమౌ ముత్యాలచందువములు

గీ. నింపుమీఱంగఁ బటికంపు పెంపుసొంపు
సంపదలమీఱు పందిళ్లసరసవింత
సంతసముమీఱ నుండువిశ్రాంతి దనర
నాత్మగనె నంత నాంజని యాత్మజుండు.

ఇట్టిపట్టణంబు నింద్రునికై వడి
నేలుచుండ కీతఁ డేల క్రొవ్వె
[1]ఘనతకలుగుటకును వినయంబు భూషణ
మదియు లేమి జన్మహానిగాదె. 46

అని యగ్గించుచు మఱియునుం జనిచని మరకతనీలప్రవాళ మౌక్తికవైడూర్య పుష్యరాగాద్యనేకరత్నఖచితాభ్రంకషసింహాసనంబున నూఱుతలలు నిన్నూఱుకరంబులును మిన్నుముట్టినపొడువునుం గలిగి గరుడగంధర్వసిద్ధవిద్యాధరకిన్నరకింపురుష దేవదానవోరగాష్టదిశారమణశిరశ్శోభితం బగుతలాటంబుఁ గాలంద్రొక్కి నిక్కుచుఁ జెఱలువట్టిన దేవభూదేవయోషాసముదయంబులు కన్నుల నశ్రువు లొలుకనులుకుచుం దగినపనులుసలుపఁ బ్రథానులుం దానును గొలువున్న శతముఖు నవలోకించి మహాద్భుతంబునొంది రావణునకు నితనికి ననేకాంతరాంతరం బని తలపోయుచు నవార్యధైర్యగాంభీర్యధుర్యుండై డాసి తదీయసింహాసనంబునకుఁ బురోభాగంబునఁ దనవాలంబు దివిసోఁకఁ బెంచి పీకం జుట్టి తదగ్రంబున నమ్మహాదానవేంద్రునికంటెఁ బొడువుగాఁ గూర్చుండిన నతని దారుణాకారంబు శతకంఠుండు గాంచి యాశ్చర్యంబును భయంబును నభిమానంబును గోపంబును బురికొనంగఁ జింతించి యమ్మహావీరున కిట్లనియె. 47

శా. ఏరా యోరివనేచరాధమ భయం బింతైనను న్లేక ప్రా
కారంబుల్ వెస దాఁటుటెట్లు మఱి పీకందాఁటి దుర్భీషణా

1 వైరమేలచేసె వసుధేశుతో వీఁడు, బ్రతుకనేరఁడయ్యోఁ బాపకర్మ.

కారం బొప్పఁగవచ్చునెట్లు తగ నల్కన్ వచ్చి నాముందటన్
ధీరత్వంబున నిల్చునెట్టు లివి చింతింపన్ మహాశ్చర్యముల్.

1శా. ఎవ్వాఁ డంపిన నెట్టువచ్చితివి నీవెవ్వాఁడ వెవ్వానికిన్
మవ్వంబై యుదయించినాఁడ విట కేమార్గంబున న్వచ్చితీ
వెవ్వం డింతటిరూ పొసంగె మఱి పేరేమందు విన్పింపరా
యివ్వేటం గలదానవుల్ గడునిరున్ హింసింతు రిట్లుండినన్.

ఉ. ఎవ్వనిఁగొల్తు వాతఁ డన నెవ్వఁడుదోర్బల మొప్పయుద్ధమం
దెవ్వని గెల్చె నిం కతఁడు నెక్కడ కిక్కడ కేగుదెంచెనో
జువ్వన మత్ప్రతాపములు చూడఁగ నూరకె నిన్నుఁ బంపెనో
యివ్విధ మెల్లఁ జెప్పఁగద రా దివిఁ జూచెద వింతగర్వమూ.

వ. అనినవినిమహాశూరుం డగుమరుత్కుమారుండు నిశ్శంక నిరాతంకమనఃపంకజుండై ప్రతాపలంకారమణుం డగుశత ముఖునిం జూచియుఁ జూడనివిధంబున నిరాకరించుచు నిట్లనియె. 51

గీ. ఓరిదనుజాధముఁడ వినరోరి రాము
నప్రతిద్వంద్వశౌర్య సాహసవినోదుఁ
బరమధార్మికు జానకీప్రాణనాథుఁ
ద్రిభువనాధీశు నధికులు దెలుప వినవె. 52

సీ. పదిరెండు నేఁడుల బాలత్వముననుండి
తాటకిఁ గూల్చినధరణివిభుఁడు
కౌశికుయజ్ఞంబు గావించి గౌతమ
సతిశాప మణఁచినశాంతమూర్తి

---

1 ఈశార్దూలమునకు పరిషత్ప్రతిలో నీయర్థమేకల యీషద్భేదమైన యుత్పలమాల కలదు.

త్రిపురాంతకునివిల్లు దెంచినబలుమేటి
జానకిం బరిణయం బైనఘనుఁడు
ముదముతోఁ బరశురామునిగర్వ మణఁచిన
దశరథరాజనందనుఁ డితండు
సత్యశీలుండు సద్గుణశాంతమూర్తి
నీలవర్ణుండు త్రిభువనపాలకుండు
శిష్టజనపాలదుష్టసంశిక్షకర్త
రమ్యతరవర్తి జానకీరామమూర్తి. 53

చిత్రకూటాద్రిని సేవించి శరణన్నఁ
గాకాసురునితప్పు గాచినాఁడు
పటువిరాధుని జంపి భద్రాద్రి వసియించి
ఖరదూషణాదులగర్వ మడఁచి
శబరిని రక్షించి చను దెంచి ఋష్యమూ
కాద్రిని నున్నట్టిభద్రమూర్తి
వనచరేంద్రుం డైనవాలితమ్మునితోడ
సరసంబు గావించె సరస మెసఁగ
నతనికిం బ్రీతి యగునట్లు లాబలాఢ్యుఁ
డైనవాలిని నొక్కమ్మునందుఁ గూల్చి
కలితసుగ్రీవుఁ బట్టంబు గట్టినాఁడు
విభుఁడు దశరథరాజభూవిభుఁడు నీచ!. 54

ఎఱుఁగవే రావణుశిరములు పదియును
ధరణిపైఁ గూల్చుప్రతాపమహిమ

[1]యెఱుఁగవే కలనిలో నలఘుబలోదీర్ణ
నకుంభకర్ణు గీటణఁచువిధము
తలఁపవే యింద్రజిద్దారుణాద్రినిఁ గూల్చు
భూరిదోర్దండదంభోళిఘనత
తెలియవే లంకకుఁ దివిరి విభీషణుఁ
బట్టంబు గట్టినపటువివేకి
గీ. నట్టిశాత్రవసంహారకుఁ డారఘూద్వ
హుండై మాస్వామి యతనికి నూడిగములు
నేయుచుందుము నే మొదల్ జేసి పెక్కు
వనచరులము మహీసురావనచరులము. 55

క. నాతండ్రి వాయుదేవుఁడు
నాతల్లి దలంప నంజనాదేవి మహా
ఖ్యాతంబు హనుమఁ డందురు
భూతలపతిఁ గొల్చి జయముఁ బొందెడికొఱకై. 56

*సీ. ఏలిక పనిబూని యేలంక కరుగుచోఁ
గంధి దాఁటితి నొక్కకాల్వకరణి

---

1 ఎఱుఁగవే ముందు సంగరమందు బలుఁ డైనకుంభకర్ణుని నేలఁ గూల్చు విధము.

*సీ. కమలాప్తబింబంబుఁ గబళింపఁగాఁ గోరి మత్స్యవల్లభురూపుమాపినాఁడ
శ్రీరామునాజ్ఞచేఁ జెన్నొంద లంకకుఁ దనరంగ వారిధి దాఁటినాఁడ
వనమెల్లఁ జెరిచి రావణతనూభవుఁ డైనయక్షు శిక్షాప్రౌఢి నలరినాఁడ
దశకంఠుపురమెల్ల దగ్ధంబు గావించి యసురులచేఁ గీర్తి నందినాఁడ
గీ. వినర నాసాటి యెవరు నీపీటిలోన
నన్ను గెలువంగ గలరె నీ కున్నబలము

వనమెల్లఁ బెఱికి రావణుకుమారుని నక్షు
ధాత్రిఁ గూల్చితిఁ దృణమాత్రముగను
దశకంఠుపుర మెల్ల దగ్ధంబుచేసితి
దివిజు లోహో యని ధృతి నుతింపఁ
బట్టవచ్చినవారిఁ బట్టపు రాజునై
వెలుచ దండించితిఁ బెక్కుగతుల
గీ. మరలివచ్చుచు లంకిణియురము ద్రొక్కి
జలధి లంఘించి జానకిజయముఁ జెప్పి
నట్టిశూరుండ నిప్పుడు నట్ల నిన్నుఁ
జూచి పోవచ్చినాఁడరా నీచహృదయ. 57
ఉ. వంచనలేక మోచికొని వచ్చితి నేనలనెల్ల వేగ దాఁ
టించితి నాల్గువార్ధులును ఠీవిగ వాలముమీఁద వాఁడె యే
తెంచె రఘూద్వహుండు తనదేవియుఁ దానును నిన్నుఁ
జంపఁగా, నెంచఁగ నీకు దిక్కు ధర నెవ్వఁడు చూడు
మిఁకోరి దుర్మతీ. 58
చ. అనవిని యప్పు డిట్లనె శతాస్యుఁ డిదేమిర యోరిదూత నే
మనఁ జనదంచునున్నఁ బలుమాఱును రాముఁడు గీముఁ
డంచు నృమ్మనుజకులాధముఁ వినుతి మాఱ్కొని చేసెద
విట్లు వాఁడుచే,సినపని నాభటుం డొకఁడుసేయు నిమేషము
లోనఁ జూచినన్. 59
1సీ. క్షుద్రమానవుఁ జెప్పి సుకృతాత్ముఁ డనుచును
బెక్కులు పలికెదు వెఱ్ఱికోఁతి

లోన వారలఁ జూపరా దానవాధ
· మా మదించకు రణమున మడియఁగలవు.

1 ఈ సీసపద్యమునకు సమానార్థమైనసీసమే పరిషత్ప్రతిలోఁ గలదు.

యెట్టిధార్మికుఁడుగా యింతినిఁ దాటక
నణఁచి పిన్నప్పుడె స్త్రీహత్యఁ జేసె
నొకప్రాంతవిలు వంచి వికలంబు గావించి
యిల మహాదేవున కెగ్గుచేసె
నాతికై నిష్కారణంబుగా నవ్వాలిఁ
బడనేసె నత్యంతపాప మొదవ

గీ. నట్టి కాంతాజనాంతకు నట్టిశైల
జాధిపద్రోహి నట్టిమహాఘచిత్తుఁ
జెప్ప నేమున్న దికనీవు చేరినట్టి
వార్త విన్పింపఁగదరోరి వదరులేల. 60

*సీ. అనవిని మది నాగ్రహంబంది శతకంఠు
తోడ నిట్లనె మరుత్సుతుఁడు గదిసి
యాదిదేవుని దేవతారాధ్యు ననఘాత్ము
శ్రీరాఘవుని నిందచేసితేని
యాయువు ద్రుంగు నీ కనుమాన మింక లేదు
దివిజాలు చెలఁగి నిందింతు రికను
అంతంబునకు రావణాసురుఁడును రాము
నిటునవలె దూషించి యిలను గూలెఁ

గీ గాన నీకును నెడలేదు కాల మింకను
నరవరునిచేత నీమరణంబు నిజము

---

*ఉ. పేరిక మేల నాకు నృపవీరుఁడు చెప్పుమటన్న నీతులన్
ఓగుణహీన చెప్పెదను నోరిమితో విను రామమూర్తి తా
న్వేగులవారివల్లఁ దగ నీఁపకీర్తపుమార్గ మంతయున్
దాఁ గనుఁగొంచు నన్నుఁ గని తప్పరి కేగు మటంచుఁ జెప్పెనన్.

దురితవర్తివి దేవతాద్రోహి వరయ
నిన్నుఁ గనుగొన్న దోషంబు నిష్ఠురాత్మ. 61

ఉ. నీ వెటువోయె దింక మఱి నేర్పున నీ కెఱిఁగింపనేల సీ
తావిభుఁ డెల్లసేనల ముదంబున ముట్టడిప్రేయఁ బంచి న
న్నీవిధితోడ నీహృదయ మెల్ల నెఱింగియు వేగరమ్ము నే
నావలికార్య మెల్ల విశిఖావళిఁ జక్కఁగఁ జేతు బొమ్మనెన్. 62

గీ. పురుషవర్గంబుచేఁ జావుఁ బొరయకుండ
వరముఁ జేకొంటి ననెడి కావరము వలదు
మించి జానకితోడ నే తెంచినట్టి
రాక తలపోయు మని చెప్పె రామవిభుఁడు. 63

గీ. ఎన్ని విధముల నిను వధియించికాని
పురికి నరుగము కావునఁ బోసఁగఁ దనకు
నమరభోగంబు లన్నియు ననుభవించు
మనుచు నీతోడ నెఱిఁగింపు మనియె నృపతి. 64

వ. అదియునుగాక బంధుమిత్రుల నాదరించుచు నాశ్రితులకు నిల్లు చూఱ లిచ్చుచుఁ బుత్రపౌత్రులనలవరించుచు నరుచి పరిహారంబుగా భుజించుచు నిమ్మూఁడుదినంబులు సుఖయింపు మని యెఱింగింపు మనియె వెనుక నెడగలుగనేర దెన్ని భంగులఁ దనప్రాణంబు లఱచేత నునిచి సంగరంబున కరుగు దెమ్మని పలికె పిదపఁ గరుణాసముద్రుండు గావున నేరాఁ గ్రమ్మఱం బిలిచి శతముఖుండును సంగరంబునకు భయంబు నొంది శరణుచొచ్చె నేని కాతు నని యెఱింగింపు మనియె. అత్తెఱంగైన నీవు చేసిన గోబ్రాహ్మణమునులబాధలు క్షమి యించెదఁ జెప్పుమని పంచిన వచ్చితి. ఇచ్చట నిన్నుం బురి

కొల్పుతుచ్ఛరాక్షసుల నమ్మకము అతం డాదినారాయణ మూర్తిగాని నరుండుగాఁడు ఇన్నియు విచారించి వైరంబు విసర్జించి శరణుచొచ్చి బ్రతుకుము. అది సహింపకయున్న యుద్ధంబున కరుగుదెమ్ము పురుషులచేఁ జావులేదని తలఁచితి వేని రామచంద్రునివెంట జానకీదేవి చనుదెంచుటెల్ల భవన్నాశనంబునకుఁ గారణంబు. తదీయ ప్రభావంబు దెలిసెదవని తలంతువేని మాతల్లిఁ జిత్రగంధి నడుగుము. ఆమ్మహాదేవి చేత నీవు త్రుంగుట సిద్ధం బని యనేక ప్రకారంబులఁ బలికిన నులికిపడి ప్రళయకాలాగ్నిచందంబున మండుచు నూఱు మొగంబులు ముడిపెట్టుచు హనుమంతునిఁ జంప నిశ్చయించి దూతధర్మంబు విచారించి యవ్వేళకు నదరుడిగి యాస్థానంబునం గల మహాదానవు లద్భుతంబున వినుచుండ నిట్లనియె.

శా. ఓరీమర్కట మద్భుజాబలము పెంపూనంగ శంకించుచున్
భీకరంబెల్లను వీడి భృత్యులగతిన్ బృందారకుల్ గొల్వ నా
హాకారార్హుం డగుమర్త్యుఁ జెప్పుచు భయం బందందఁ బుట్టించి నీ
వారాధిన్ బహుభాష లాడెద వహో ప్రాణంబులే యొల్లవో.

సీ. వేర్చి పైఁబడఁబూని పెరిఁగి నల్దిక్కుల
నడరెడుకార్చిచ్చు నుడుపనేర్తు
సమయంబువచ్చిన ఝంఝానిలమునైన
నెఱి మెదలఁగనీక నిలుపనేర్తు
నాహవంబున జయం బనుకూలముగ మంత్ర
సిద్ధిజపంబులు సేయనేర్తుఁ
గడువేడ్క రథములఁ గరితురంగంబుల
నడిపింపనేర్తు నర్ణవముమీఁద

గీ. నిన్నియునుగాక పరమేష్ఠి యిచ్చినట్టి
వరము లున్నవి జమునైన సరకుసేయ
నట్టియసమానబలశాలినైన నన్ను
జానకీరాము లెదిరింపఁ జాలఁగలరె. 67

వ. అదియునుంగాక. 68

సీ. మన్మీమతరనామమహనీయమంత్రంబు
సకలభూతగ్రహోచ్చాటనంబు
మద్బాహుదండంబు మత్తారి నృపకుమా
రాచలాభీలవజ్రాయుధంబు
మచ్చండకోపంబు మానితబ్రహ్మాండ
భాండంబులకునెల్లఁ బ్రళయకరము
మన్మందహాసము మనసిజకమలభ
వామరావళికెల్ల నమృతవృష్టి
గీ. సకలలోకంబులకు నేనె చక్రవర్తి.
నట్టి నాయుద్ధతికి నిల్చి యధముఁడైన
జనవరుండును నబ లగుజానకియును
దురము గెల్చెద రనుట యద్భుతముగాదె. 69

ఉ. ఇన్నియుఁ జెప్పనేల విను మీక్షణమందున నిన్నుఁ జంపి రే
పున్నతవృత్తి నేఁగి నృపు నుక్కణగించి తదీయకోమలిం
బొన్నసుగంధిఁ దెచ్చి బహుభోగపరంపరఁ దేలుచుణ్ సుఖం
బెన్నఁగఁ గందు దైత్యులు భళీయని సన్నుతిచేయ వానరా.

ఉ. చిక్కితి వెందుఁబోయెదవు చేకొని మ్రింగెద నిన్ను రామునిణ్
దిక్కెఁక నేది నీ కనుచుఁ దీవ్రరయంబున నాగ్రహించుచుం

చెక్కనిశాటకోటులను బిల్చి వనేచరుఁ ద్రుంపుఁ డన్న వా
రుక్కున నేగుదెంచి పటుహుంకృతి సేయుచు రాఁగ నుగ్రుఁడై.

ఉ. ఓరిశతాస్య నే నొకఁడ నూరక చిక్కితి నంచుఁ బట్టగాఁ
గోరితి చూడుచూడుమని గొబ్బున రాముఁదలంచి వాయుపుత్రుఁ
సారెకుఁ జీరి వాలము విశాలముగా రవిసోఁకఁ బెంచి దు
ర్వారశరీరుఁడై పెరిఁగె భగ్గున మంటలు నోరఁ బుట్టఁగన్. 72

[1]చ. వెఱచిరి కొంద ఱత్తఱిని వీనిమహాకృతిఁ జూచి కొందఱుం
బఱచిరి సందుసందులను బల్విడి కొందఱు భీతిఁ బోవలే
కఱచిరి కొంద ఱప్పుడు శతాస్య మముం గరుణింపు మంచుఁ బె
ల్లఱచిరి యిట్టిరీతిఁ గడునాకుల మొందిరి దానవుల్ వెసన్.

క. శతముఖుఁడును హనుమంతుని
మతమంతయుఁ జూచి భయము మల్లడిగొనఁ గా
మతి నడలుచుండెఁ దక్కిన
హితులును నిర్విణ్ణులైరి హృదయము లులుకన్. 74

మ. హనుమంతుం డపు డుగ్రుఁడై దనుజలోకాధీశ్వరుం డాసి క్రొ
వ్వున నన్బట్టఁగఁ బూని యిప్పుడు మదం బుర్విన్ నీకేల యం
చును ఘోరాశనిఁబోలుముష్టిహతిచే స్రుక్కంగ నద్దానవేం
ద్రుని నేలంబడఁ గూలఁగాఁ బొడిచె రుద్రుంబోలి లీలాకృతిన్.

. ఇట్లు పొడిచినఁ బడి తలలెల్ల బగిలి
యబ్బురంబుగ నెత్తురు లుబ్బిపాఱ
నపుడు మూర్ఛిల్లె నతనిసింహాసనంబుఁ
జూర్ణముగఁ దన్నె నమరులు చోద్యమంద. 76

1 ఈపద్యమునకే వేరుమాటలతోఁ బద్యమున్నది.

గీ. తన్ని యంతటఁ బోక యద్దనుజవరుని
వ్రేక్కి యున్నతలాటంబు దున్ని తివిచి
యేపునను గొని యొప్పటిరూపుతోడ
నచట వీడ్కొని రఘుపతి నాత్మఁ దలఁచె. 77

వ. ఇత్తెఱంగున రఘునందనచరణారవిందమకరందబిందుపరంపరా స్వాదనానందేందిందిరుండై మరున్నందనుండు తనకు నెదిరిన దైత్యులం బరిమార్చుచు సింహనాదంబు సేయుచుఁ గపి సేనాభిముఖుండై వచ్చి పురోభాగంబున సకలదళంబులతో నున్నసుగ్రీవునిం గాంచి యతనికిఁ దద్వృత్తాంతంబుఁ జెప్పి సంభాషణలుగైకొని అచట వీడ్కొని సకలకపినాయకులు దన్నెదుర్కొని గాఢాలింగనంబు గావించి పెక్కుతెఱంగుల నభినందింప రయంబున నరుదెంచి అనుజత్రయపుత్రపౌత్రపరి వేష్టితుండై జానకియుం దానునుదనరాక కెదురుచూచుచున్న రఘువరుం గాంచి వందనంబులు గావించి అనేకవిధంబుల సన్నుతించి ప్రతాపలంకాపురికిఁ దా నరుగుట మొదలుగా శతకంఠునితలలు పగులఁ బొడుచుట తుదయునుంగా నంతయు నెఱింగించి రేపు లగ్గకుసెలవు దయచేయవలయు ననిన ప్రార్థించి యక్కునం జేర్చి సీతయుం దానును బహు భంగుల దీవించుచుండె నంత నక్కడ. 78

క. దనుజేంద్రుఁ డంతకంబెను
మునుపడఁ దనమూర్ఛదెలిసి మునుకొని సింహా
సనమును బొడియగుటకు మఱి
తనదుతలాటంబుఁ బోవ దానికి నడలెన్. 79

క. ఆడలి తనయుడు గెలంకుల
నడలుచుఁ గనుపట్టుబలునిశాటుల హితులం
గడుమంత్రుల నొగి మొగములు
ముడివడఁగాఁ జూచి భయదముగ నిట్లనియెన్. 80

క. ఓయి సచివేంద్రులారా
మాయురె యిపు డొక్కకోఁతిమాత్రమె యిట్టుల్
చేయఁగ నిందఱు నేమియుఁ
జేయఁగ లేరైతి రేమి సేయుదుఁ జెప్పుఁడా. 81

క. ఏలాగు నమ్ముదును మీ
రీలాగునఁ బిఱికు లగుచు నిట్లుండఁగ నే
నేలాగు రాముఁ దునుముదు
నేలాగున బంటులుగను నేలుదు మిమ్మున్. 82

క. అని మనమునఁ గోపంబును
ఘనతరశోకంబుఁ బెనఁగఁగాఁ జింతాంభో
ధిని మునుఁగుచున్న దనుజేం
ద్రునిఁ గనుఁగొని యిట్టులనిరి తూర్ణస్ఫురణన్. 83

క. ఏ మప్పుడ యేమఱుచో
నామర్కటుఁ డేగెఁ గాక యటుచూడుము త
ద్రామునిఁ జంపి మఱాతని
కోమలిఁ గొనివచ్చి నీకు గొబ్బున నిత్తున్. 84

*క. మాయట్టిమంత్రు లుండఁగ
నీయదవద యేల నీకు నిప్పుడె మమ్ముం

*క. మావంటిబంటు లుండఁగ, నీ వేల యధైర్యమొంద నిప్పుడు మమ్మున్
భావించి పంపు రణమున, నేవిధముగ గెల్చి రాము నిలఁ గూల్తు మొగిన్.

బాయక పంపుము యుద్ధము
చేయుదు మెడపకను నీదుచిత్తము రాఁగన్. 85

†క. వనజజుఁ డొసఁగినవరముల
ఘనత విచారింపవలదె కదిసిన నీకున్
వనచరులన నరవరులన
విను తృణమాత్రంబుగాదె వివరింపంగన్. 86

క. సురలెల్లనీకు వెఱచుచు
పొరిదిగ సేవింతు రనఁగ సురలు పనుపఁగా
నరుదెంచుబేలరాముని
సరకుంగాఁ గొనఁగఁ దగునె సంగరధుర్యా. 87

క. దనుజేశ నీవు గడఁగినఁ
గనుఁగొనఁగా మృత్యువైనఁ గళవళపడు న
వ్వనచరులును గినచరులును
మనుజుఁడు గినుజుండు నిన్ను మార్కొనఁగలరే. 88

క. అని మంత్రులు బహుభంగులఁ
దనమదిఁ బురికొల్ప నసురధవుఁడు మహారో
షనయనమనస్కుఁడై య
ద్దనుజుల మన్నించి చనియెఁ దల్లియెదుటికిన్. 89

క. చని తల్లికి సాష్టాంగం
బొనరింపఁగఁ జూచి పుత్రు నొయ్యన విలస
ద్ఘనగాత్రుని సుతమిత్రునిఁ
గనుఁగొని దీవించి చిత్రగం ధిట్లనియెన్. 90

---

†క. సరసిజగర్భుఁ డొసంగిన, వరములు గలుగంగ నీకు వానరులును నా
నరు లనఁగ నెంతవారలు పరికింపఁగఁ దృణము గాదె ఖండన మందున్.

గీ. అన్న నీమొగ మదియేమి విన్న నగుచు
నున్న దిప్పుడీ వెన్నఁడు నుల్లమునను
వంతఁ జెందవు నేఁ డిది వింతవాఁడ మె
నేమి యెఱిఁగింపు నాతోడ నెద్దియైన. 91

సీ. అలిగెనో యుష్మదహంకారములు చూచి
యుగ్రుఁడై యిపుడు మృత్యుంజయుండు
మునుల నేఁచితి వని వనజసంభవుఁ డొండె
శపియించెనో కడుసాహసమునఁ
గింకరుల్ దానును శంకలేక కృతాంతుఁ
డురువడి దండెత్తెనో కడంగి
వరశరణాగతవజ్రపంజరుఁ డగు
రాముఁ డేతెంచెనో భీమముగను
గీ. వీఁక నెఱిఁగింపు విన్నయందాక నాకుఁ
గడుపులోపలఁ జెయివెట్టి కలఁచినట్టు
లున్న దిప్పుడు నీమోము విన్నదనము
గన్నయప్పటినుండి యక్కజముగాను. 92

సీ. అనవిని యాశతాననుఁడు దల్లికి హను
మంతుండు వచ్చినమార్గములును
వచ్చి రామునిఁ జెప్పి వాదించు తెఱఁగును
వాదించి కణఁగించువైఖరియును
బట్టంగ దైత్యులఁ బంపువెట్టుటయును
బంపువెట్టినవారిఁ బదరుటయును
డంబుగాఁ దనదురూపంబు చూపుటయును
జూపి తన్నొగిఁ బొడుచుటయుఁ బొడిచి

తనదుసింహాసనము గూలఁ దన్నుటయును
బూని బిరుదుతలాటంబు వోవుటయును
మఱలి వనచరుఁ డేఁగినమహిమములును
జెప్పినను విని తల్లి మూర్ఛిల్లి తెలిసి. 93

అన్న శతముఖ మీాతండ్రి యద్భుతంపు
వార్త నారదుచే విని వచ్చి మున్ను
నాకెఱింగింప నెఱుఁగుదు నీకు నట్టి
గోప్యమంతయు నెఱిఁగింతుఁ గోరి వినుము. 94

జ్యోతిర్మయ మగునాకమహాశక్తి చతుర్దశభువననాయకియై ప్రవర్తించుచుండి తనరూపం బగునట్టి *యోంకారస్వరూపంబున బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నుదయింపఁజేసి జన్మపోషణలయ కారులం గమ్మని నియోగించి వారలకు సుఖంబులు గలుగు మని తనకళలచే ముగ్గురు కన్నియలం బుట్టించి అందు శారద యనుచెలి నజునకు, లక్ష్మి యనుతరుణి నచ్యుతునకు, గౌరి యనునారి శివునకు దయచేసి ప్రపంచంబు నడుపుచునందుఁ దనపూర్ణకళ యగులక్ష్మినిం బిలిచి యతిరహస్యంబుగా నిట్లనియె. త్రేతాయుగంబున నీదుభర్త యగువిష్ణుండు రాముండై రావణువధార్థంబునకు నటింపఁగలఁడు తత్కాలంబున నీవు జనకునకు నుదయించి జానకీనామంబున రాము

* ఓంకారస్వరూపంబున విరాట్పురుషుం డగుమహారుద్రుం బుట్టించె నామద్రునివలన ముఖంబున బ్రహ్మయు భుజంబులవలన విష్ణువును శిరంబువలన నీశ్వరుఁడు వక్షంబువలన వానరాదులును నాభివలన నశ్వినీదేవతలును జానువులవలన యక్షకిన్నర గంధర్వాదులును ఊరువులవలన నూర్వశీమేనకాదులు పాదంబులవలన మంగళపాఠకులను......బుట్టించి. మొ.

నితో మెలంగఁగలవు రావణుమరణానంతరంబున శతముఖుఁ డనునొక్క రాక్షసవరుండు పుట్టి పురుషులచేఁ జావులేకుండ బ్రహ్మచే వరంబులు గొని తరుణులం దృణీకరించు తన్నిమిత్తంబున రాముని వెంట నీవు చని యతనికి శక్యంబు గానిసమయంబున శస్త్రాస్త్రంబులు ధరియించి యుద్ధంబుచేయుము అట్టియెడ నేవచ్చి నీయందు నావహించి నీచేత శతముఖునిం జంపించెదఁ జనుమని పంచిన భవన్నాశనంబునకుఁగారణం బగుచు సీత యన నుదయించినయది యని మఱియు నిట్లనియె. 95

సీ. సృష్టిపై విష్ణుండు దుష్టనిగ్రహమున
కై రాముఁడై పుట్టె నమరు లలర
వలనొప్ప నవ్విష్ణువక్షస్థలంబునఁ
జెన్నొందుశ్రీదేవి సీతయయ్యె
నరవి నాతఁడు పూనుశంఖచక్రంబులు
భరతశత్రుఘ్నులై పరఁగి రిప్పు
డాశౌరిపర్యంకమై యుండు శేషుండు
సౌమిత్రి యన మించె జగమునందుఁ
గీ. గాన రాముండు మనుజుండు గాఁడు చూడ
నతనిఁ గొలిచెడుకపులెల్ల నమరవరులు
గాని శాఖామృగంబులు గావు నీవు
వారితోడుత వైరంబు వలవ దుడుగు. 96

గీ. బ్రహ్మదేవునిచేతను బడసినట్టి
వరముమాత్రన గర్వింపవలవ దట్టి
బ్రహ్మ నీతండె పుట్టించెఁ బరఁగఁ గాన
మించి తనతండ్రిపూన్కిఁ దప్పించఁగలఁడె. 97

గీ. కాన రాఘవు నెదుర శక్యంబుగాదు
తవిలి వారలపై విరోధంబు మాని
శరణు చొరుము దురాత్ములజాడఁ బోకు
జగతి బెబ్బులిపైఁ గోలఁ జాఁపఁ దగునె. 98

సీ. అని రాము విక్రమం బతనితమ్ములలాగు
తనయులవిధమునుఁ దరుణిసీత
మహిమంబులును హనుమంతు తెఱంగును
సుగ్రీవుఘనతఁ దత్సుతులగతియు
బలములచలమును గెలువరాకుంటయుఁ
బెలుచ విభీషణు భేదములును
దమనిజశక్తియు ధర్మసంఘటనయుఁ
బాడియుఁ గీర్తిసంపాదనమును

గీ. దెలిపియును బుజ్జగించియుఁ బలువిధముల
మనసుఁ గలఁచియు నీతిగాదనియు భయము
లొదవఁజేసియు బహుగతి నూఱడింప
నాగ్రహించుచు నుడుగక యసుర వలికె. 99

ఉ. రాముఁడు విష్ణుఁడంచును బరాక్రముఁ డంచును నెన్నఁ
జొచ్చి తా, రాముఁడు విష్ణుఁడైనఁ దనరామను రావణుఁ
డుగ్రశూరుఁడై, ప్రేమను గొంచుఁబోవఁగ నభేద్యశరంబు
లఁ గూల్పరాదె యా,రామునిచాపనైపుణి పరాక్రమముం
గనవచ్చె నిందులన్. 100

చ. అదియునుగాక నాఁడును నరాధముఁడుం బటువిక్రమంబు
లిం, బొదవఁ గనంగఁ జాలఁడె యపూర్వశరావళిఁ జేతఁ
బూన నే, పొదవెనె యాశరంబులును బూన సమర్థుఁడు

గాఁడు వాని నా, పదమునఁ ద్రొక్కి సేనలను భస్మము
సేయుదుఁ జిత్రమాత్రమున్. 101

చ. చొనుపఁగ విష్ణుఁ డేడ మనుజుం డన నేడ మృషోక్తిచేత నా
మనసు కరంగఁ బల్కినను మర్త్యునకై భయమంద నేర్తునే
యనుపమయుద్ధమందు సుర లౌ నని మెచ్చ నృపాలుఁ జంపి
యా,తనితరుణీలలామను సతంబుగఁ గైకొను డెల్ల కాలమున్.

[1]చ. అనుచుఁ బ్రధానులన్ దొరల నాప్తుల మంత్రుల నక్క
డక్కడన్, ఘనముగ నుంచి మించి పటుకాండపరంపర లేర్చి
సాహసం,బునఁ జతురంగముల్ బలసి పొంగుచు నుండఁగ
రాముఁ దల్పుచుం, గనలుచు నుండె దండి శతకంఠుఁడు చండ
తరాగ్నికై వడిన్. 103

శా. రాముండుం బటుభేరికాహళమహారావంబు మిన్నంగ ను
ద్దామస్థైర్యగుణాభిరాముఁ డగుచుం దర్పించి సైన్యంబులన్
వేమాఱుం బురికొల్పి సారెకును మౌర్వీనాదముల్ పెల్లుగా
భూమిం బిక్కటిలంగఁ జేసి దినరాట్పుత్రాదులం బిల్చుచున్.

శా. లగ్గల్ పట్టుఁడు పొండు పొం డని మహోల్లాసంబునం బంప
వా,నగ్గాఢధ్వని మెండుగా విని మహోగ్రాకారులై కొమ్మలన్
నుగ్గుల్ సేయుచు నయ్యగడ్తలును మిన్నుల్ ముట్టగాఁ
బూడ్చుచున్, లగ్గల్ పట్టిరి దేవసంఘములు చాలం బొంగి
దీవింపఁగన్. 105

1 వ. అనిబిగ్గన లేచి తల్లికి నమస్కరించి రత్నశాలకుం జని సుఖా
సీనుండై యుండె నప్పుడు. చ. వినయముతోఁ బ్రధానులను విశ్రుతమంత్రుల
నెక్కడెక్కడన్.

వ. జడిగొని పర్వతంబులుఁ గుజంబులు దెచ్చి కణంగి కోటలం బొడిపొడిచేసి యందుఁగల భూరినిశాచరకోటులకా ధరం బడఁ బిడికిళ్లచే నడఁచి బాణపరంపర నుగ్గుచేసి బ ల్విడిని వనేచరుల్ దనుజవీరులతో ననిసేయఁ బూనుచున్.

వ. మఱియు ననేక ప్రకారంబుల సకలకపివరులును లగ్గ యగ్గలం బుగాఁ బట్టుచుండ వారితోడనే విభీషణుసైన్యంబులు వన చరభల్లూకశార్దూలరూపంబులం దలపడిరి మనుజబలంబు లును బట్టణప్రాసాదతోరణకుడ్యాదుల నమోఘబాణంబులం బఱపి నేలం గలుపుచునుండిరి శతకంఠునిబలంబులు నింతిం తని గణుతింప నలవిగాకుండఁ గదిసి పూర్వపశ్చిమసముద్రం బులతెఱంగునఁ గోలాహలంబు సేయుచుఁ బిడికిళ్లం బొడుచుచు గదల నడఁచుచుఁ గఠినపదంబులం దన్నుచు దీర్ఘదంతంబులం గఱచుచు మోఁచేతులఁ దాటించుచు బలువిధంబులఁ బెనం గుచు గజంబులకుంభస్థలంబులు వగుల మోదుచు హయం బులం బడ వ్రచ్చుచు రథంబులు భగ్నంబులు గావించుచు రథికులంగూల్చుచు సారథులం ద్రుంచుచు భటుల నందఱం ద్రెంచుచు నపారయుద్ధంబు గావింప వనచరభల్లూకశార్దూల మనుజబలంబు లెల్లవిఱిగి పాఱ క్రమ్మఱం బురికొని దైత్యుల మీఁదం గదిసి గదలు ద్రుంచియు ముసలంబులు పొడిగా వించియుఁ జాపంబులు విఱిచియు నఱచేతులం జఱచియు గళంబులు ద్రొక్కియు నింగికిముట్ట నిక్కియు నఖంబులం జీరియుఁ గుంభికుంభంబులం బగులఁబొడిచియు నలుకలు మీఱియుఁ బ్రతిపక్షులం దఱిమియు వాలంబుల మెఱిమియు ముష్టిఘాతులం గ్రుమ్మియు వాలరోమంబులఁ జిమ్మియు గుఱ్ఱం

బుల నదిమియు గుంజరంబులఁ ద్రుంచియు రథంబుల నుగ్గు చేసియు రథికులం ద్రోచియు సారథులం జంపియు శరంబులఁ ద్రెంచియుఁ బెక్కు చందంబుల నుక్కుమెఱసి యక్కపివీరులు పోర వారలం గని హర్షించి రామలక్ష్మణభరతశత్రుఘ్నులును దనుజులపై నందంద నలిగి యాగ్నేయసాయకంబులు పఱపినఁ గూలునేనుంగులును నేనుంగులతోడనే వ్రాలుహయంబులును హయంబులతోడనే పొడియగురథంబులును రథంబులతోడనే మడియురథికులును రథికులం గని పోరలు సారథులును సారథులదురవస్థలఁ జూచి తలంకుభటులును విఱుగువిండ్లును నుఱుమగుశరంబులును బఱియ లగుగదలును దునియలై పడినముసలంబులును భిన్నంబు లగుపట్టిసంబులును నుగ్గు లగుప్రాసంబులును దుత్తుమురు లైన శూలంబులును బడిరఖిండివాలంబులును దన్నుకొనెడిదైత్యులును జచ్చిన వారివాపునఁ జచ్చినయట్లు కదలకయుండురాక్షసులును గతజీవు లైనదనుజులును జొత్తుపాపలవలె నెత్తుటం జొత్తిల్లునిశాచరులును నవయవంబు లేర్పడక తునిసిన నక్తంచరులును శోణితప్రవాహంబులును బ్రవాహంబుల నీదులాడు భూతబేతాళ శాకినీఢాకినీ గణంబులునుం గలిగి యైదహోరాత్రంబులు చరణతలఘట్టనోద్ధూతధరాపరాగంబుచేఁ ద్రికాలంబులును సూర్యచంద్రికాజాలంబులు నేరుపఱపరాకుండఁ బోరి కపులు సింహనాదంబులు చేసిన దేవతలును పుష్పవర్షంబు గురియించి యభ్రతలంబున నిల్చి యాశ్చర్యంబు నొందుచుఁ జూచుచుండిరి బ్రహ్మదేవుండును బ్రళయసమయంబు గాఁబోలు నని కాలంబు లెక్కించుచునుండె ఏనును

రజతపర్వతగహ్వరంబున నీతోడం గదలకయుంటి నని చెప్పినఁ బార్వతీదేవి మహాశ్చర్యమానసయై యటమీఁద నక్కలహం బేమయ్యె నది వినిపింపు మన వినుపించుచుండె నంత. 107

క. హత శేషు లైనదానవు
లతిరయమునఁ గడుభయాత్ములై నల్దిశలన్
గతిచెడి యఱచుచుఁ బాఱిరి
మతిసంతసమంది కపులు మలయుచు నార్వన్. 108

క. గిటగిట మనుచును నెత్తుట
దొటదొప్పగ దోఁగి యపుడు తొట్రువడంగాఁ
గటకట యనుచును గుండెలు
తటతట నదరంగ వివిధదైన్యము లొదవన్. 109

సీ. [1]అదె వచ్చె నగచరు లిదె డాసి రనుచును
గడుశరీరంబులు గంప మొంద
నల్లదే కొల్లగా భల్లూకతతిమించి
పొంచియున్నా రంచుఁ బోక మరలి
మేదినీధరములుఁ బాదపంబులుఁ దమ
మీఁద వచ్చె నటంచు మెలఁగి తొలఁగి
యెందుఁబోవుద మింక నేది దిక్కని తమ
చేష్టలు దఱిగి మూర్ఛిల్లి తెలిసి
గీ. పుడమిమీఁదను జదికిలఁబడుచు నప్ప
టికిని లేచుచు నుఱుకుచు శివి మెరసి

---

1 మాఱుమాటలతో నిదియే వేఱొక ప్రతిలోఁ గొంత గలదు.

కొలువులోపలఁ గూర్చున్న ఘోరవిమత
లుంఠనప్రాభవుని శతకంఠుఁ గనిరి. 110

శా. ఇక్ష్వాకేశుర్ శతకంఠుఁ గాంచి మదిలో నేడ్పుర్ భయంబుం
దగం, గ్రమ్మర్ సాగిలి మ్రొక్కి యక్కపులరాకల్ మళ్లివీక్షిం
చుచుర్, దమ్ముం జేకొని పిల్చినం బలుక కెంతే ఖిన్నులై
సారెకుం, దమ్ముం గావు మటంచు నిల్చినను దద్దైత్యేంద్రుఁ
డాశ్చర్యుఁడై. 111

[1]గీ. ఓరి దానవులార మీ కుల్లములను
వగవనేటికి నేనుండ వలవ దుడుగుఁ
డేమివృత్తాంత మంతయు నెఱుఁగఁ జెప్పు
డిప్పుడే చని విదలింతు నెల్లరిపుల. 112

గీ. అనుచుఁ బలుమఱు నుడువఁగా నపుడు కొంత
మాట పోం దెలిసిఁగియును నేమఱక యతని
కభిముఖంబులతో నిల్చి యఖిలమంత్రి
వరులు విన నిట్లు పలికిరి వానితోడ. 113

సీ. దనుజేంద్ర మేము మీపనుపునఁజని లగ్గ
పట్టిన వనచరప్రకరములును
బెక్కువిధంబుల నుక్కునఁ బోరాడి
నెఱితప్పి మఱిచాల నేలఁ బఱచి
వెండియుఁ బురికొని విపులవాలంబులఁ
జుట్టియు ముట్టియు నెట్టుకొనుచుఁ
గఱచియుఁ జఱచియుఁ గఠినశైలంబుల
నడఁచియుఁ బొడిచియు నలుక మెఱసి

1 మాఱుమాటలతో నిదియే వేఱొకప్రతిలోఁ గొంతగలదు.

గీ. యుండునంతటఁ బ్రళయకాలుండువోలె
రాఘవుం డగ్నిబాణపరంపరలను
గప్పినను మనసైన్యంబు గలఁగి తలఁగి
పాఱఁగాలేక దగ్ధులై పడిరి యచట. 114

సీ. స్తనితభాషుఁడు చచ్చె శార్దూలవదనుండు
మడిసె రక్తాక్షుఁడు మహినిఁ గూలె
గతజీవుఁ డయ్యెఁ బింగళనేత్రుఁ డవనిపైఁ
గూలె నగ్నిముఖుండుఁ గుంజరాంగుఁ
డీల్గెఁ గరాళుండు నిలఁ గ్రుంకెఁ గపిలదం
తుఁడు చచ్చె శూలుండు పుడమిఁ గలిసెఁ
జిత్రుండుఁ గర్కశగాత్రుండు మొదలైన
బంటులు పీనుఁగుపెంటలైరి

గీ. యేము గొందఱ మిటకు నీకెఱుకఁ జెప్పఁ
జావునకుఁ దప్పి రాఁగ నీజాడఁ గంటి
మసురవిలయంబు సమకూఱె నకట మీక
నేమి చెప్పుదు దుర్వార్త లేము నొడివి. 115

చ. అనవిని యట్టహాసము రయంబునఁ దా నొనరించి నేతఁదోఁ
గినయనలంబుచాడ్పునను గెంటక మండి సమస్తలోకముల్
మునుకొనిమ్రింగఁ బూనుపెనుమృత్యువురీతిని హుంకరించు
చుం,దనదుప్రధానులన్ హితులఁ దప్పకకన్గొని వారి కిట్లనెన్.

ఉ. వింటిరె మంత్రులార మనవీటినిశాటులఁ బంపి క్రోఁతులం
గంటక మొప్పఁ జంపి నృపకాంతుని రాముని నేలఁ గల్పినా
కంటక మెల్లఁ బాపి కలకంఠినిఁ బల్లవపాణి జానకిన్
వెంటనె తోడితెం డనుచు వేగన పంపిన శౌర్యహీనులై. 117

చ. మడిసిరి దైత్యులంచు దనమంత్రులు మానవవానరావళిన్
విడుచుచుఁ జెప్పవచ్చి రిఁక వీరల నేమనువాఁడ నిప్పుడే
తడయక పోయి రాఘవునిఁ దమ్ములతోడుతఁ జంపి క్రోఁతులం
బొడ వడఁగించి వత్తు నిఁక బూమెలుగాదె బలంబుఁ బంపినన్.

చ. కదలుఁడు నాసహాయమున గంధగజాశ్వరథాదు లేర్పడన్
వదలక శత్రులం దునిమి వత్తము వచ్చి ధరాసుతామణిన్
గొదకొని తెత్త మిట్టియెడఁ గోఁతులు గీఁతులు నాకు నడ్డమే
కదనముఖం దెదిర్చినను గండలు చేతు సురేంద్రుఁడైననున్.

చ. అనవిని మంత్రులెల్లఁ బటుహుంకృతిమీఱఁగ లేచి నిల్చి యో
దనుజవరేణ్య నీ వనుపఁ దార్కొన రాముఁ డనంగ నెంత పె
ల్లనలమునైన మ్రింగెదము యాజిని మృత్యువునైన నోర్తు మ
వ్వనచరు లేమిలెక్క జయవర్ధన ఘోరతరారిమర్దనా. 120

సీ. భండనవేది యేర్పఱిచి మహోక్రోధాగ్ని
దరికొల్పి పటుశర స్తంభమునను
బరఁగ విభీషణుఁ బశువుగ బంధించి
కపిసమిధల నపకముగ వేల్చి
చెలఁగుచు నసిపత్ర స్రుక్స్రువంబుల నేర్చి
రక్త మాజ్యంబుగా రమణచేసి
తనయసహోదరతతులతో రామునిఁ
బూర్ణాహుతిగ వేల్చి భూరిజలధి
గీ. నవభృథస్నానములుచేసి యలరుసోమ
యాజివై యుండు మీవు మే మపుడు హోత
లనఁ జెలంగుదు మీయుద్ధమనుమఖంబు
చేసినను గాని త్రిజగత్ప్రసిద్ధి గాదు. 121

మ. అని యిక్కెక్కువడి మంత్రులాడఁగఁ దదీయాలాపముల్ మెం
డుగా, విని దైత్యేంద్రుఁడు మిన్నుముట్టి సకలోర్వీభాగముం
గంపిలన్, మనుజేంద్రుం దృణలీలఁ ద్రుంతునని దుర్మార్గంబునం
దల్చెనెం,దు నొగిం జచ్చెడివారి కన్యజనవృత్తుల్ గానఁగా
వచ్చునే. 122

మ. మఱియుం బెక్కువిధంబులం గనలుచున్ మత్తేభముం బోలె
మై, మఱచెం బ్రోద్ధతుఁడై నిలింపతతి పల్లాఱున్ భయం
బందఁగా, శిరముల్ నూఱిట దివ్యసన్మకుటముల్ చెన్నొం
దఁగాఁ బూని భాసురమార్తాండశతంబురీతి ముఖముల్
పొంపార భాసిల్లఁగన్. 123

ఉ. ఆరయ నింద్రపావకయమాసురపశ్చిమరాణ్మరున్మహో
దారకుబేరముఖ్యభయదస్ఫుటఘోరతరంబు గండపెం
డేరము వామపాదమున దీవిగఁ బెట్టి కరంబు లన్నిటన్
భోరున నస్త్రశస్త్రములు పూని రణంబున కుత్సహించుచున్.

చ. దనుజులు నూఱుకోట్లు తను దట్టముగాఁ గొలువంగ దివ్యకే
తనమణిచక్రషోడశసుధాకరవద్వివిధాతపత్రవే
గనయసహస్రచిత్రతురగప్రకటాసమసూతఘంటికా
స్వనయుతవిస్ఫురద్రథము చయ్యన నెక్కె జగంబు కంపిలన్.

సీ. శతయోజనోన్నతి శతశిరస్సులమీఁదఁ
గన్పట్టుకేతనకాంతి దనర
భుజము లిన్నూటిపైఁ బొలుపొందుభుజకీర్తు
లరసి విద్యుత్కాంతు లమర దిశల
ముత్యాలపేరులు ముంగిళ్ల నల్లాడఁ
జామీకరచ్ఛాయ ఛత్ర మలర

విలసితమాణిక్యవిద్రుమస్థాపిత
హారము ల్కంఠమునందు నమర
గీ. వెడలె నాయుద్ధకళ్యాణవేదిఁ జూడ
వేల్పుమూకలు నంబరవీథియందు
వెఱగు నందంగ దానవవిభుఁడు భాను
వంశజుని జూడ విజయుఁడై వచ్చె నపుడు. 126

ఉ. అప్పుడు వారిధుల్ గలఁగె నష్టదిగంతమదేభయూథముం
దెప్పిర లేక మూర్ఛిలె మది న్భయమందుచు లచ్చి విష్ణునిన్
గుప్పునఁ గౌఁగిలించె నదిగో మనపాలిటిమృత్యు వందఱం
జప్పరిసేయవచ్చె నని చయ్యన డాఁగిరి దేవసంఘముల్. 127

చ. పదువురుమంత్రులున్ యములభంగిని దండము లుగ్రచిత్తులై
వదలక పూని భేరులరవంబులు మిన్నులు ముట్ట గంధదం
తిదశకరాజి నెక్కి నలుదిక్కులు వ్రయ్యలుగాఁగ నార్చుచుం
బొదలుచు నాశతాననుని భోరునఁ గొల్చిరి తేజరిల్లుచున్.

చ. హరి రఘురాముఁ డంచును రమామణి జానకి యంచు వాన
రుల్, సురవరు లంచు గెల్పు లిఁకఁ జొప్పడ వంచు రణంబు
సేయకే, మరలు మటంచుఁ దల్లి పలుమాఱును దూతలఁ
బంప నాత్మలో, నిరుపమవిక్రమస్ఫురణ నెట్టుకొనన్ వినఁ
డయ్యె నత్తఱిన్. 129

క. నానాముఖముల నఱచెడి
సేనామధ్యమునఁ జంద్రశేఖరుమాడ్కిన్
మానుగ శూలము భుజమునఁ
బూనుక రణకాంక్ష వెడలె భువనము వణఁకన్. 130

సీ. ఆవేళఁ గంకగృధ్రావళి పురివిచ్చి
యాడఁగాఁ దొడఁగె శతాస్యుమీఁదఁ
గరము నెత్తురువాన గురిసె సేనలమీఁదఁ
బిడుగులు వడఁ జొచ్చెఁ బుడమి వణఁక
వఱడు లంతంతకు వాపోయెఁ దలయెత్తి
వెసఁ గొన్ని గొడుగులు విఱిగిపడియె
నెదురుగా నేతెంచె నేపుమైఁ బెనుగాలి
మురువేది తురగముల్ మెల్ల విఱిగె
తే. గడువిలాపించి యొఱలె నాకాశవాణి
చెలఁగి యడ్డంబుగా వచ్చెఁ జెవులపోతు
మఱియు ముందట నొకమహామలినమైన
[1]విధవరాలేద్చెఁ బోయినవిభునిఁ దలఁచి. 131

మ. అవియెల్ల న్వెసఁ గాంచియుం వికృతకోపావేశుఁడై పూని
శాంతివిధుల్ దా నొనరించి మానసమునం ధీరాత్ముఁడై భేరి
కా, వివిధానేకమృదంగనాదము మహార్ణవం బిక్కటిల్లంగ
భై,రవమూర్తి ప్రతిబింబమై తరుచరవ్రాతంబులం దగ్గఱెన్.

శా. ఈరీతిం గడుడగ్గఱం గపులు దైత్యేంద్రుం విలోకించి గం
భీరంబుల్ విడి హస్తకీలితధరాభృత్పాదపశ్రేణి ని
స్సారం బొప్పఁగ వైచి దానవమహాసైన్యంబు పెల్లార్వఁగా
మేరల్ దప్పివణంకుచుం బఱచి రెమ్మెల్ దూలి యాడాడకున్.

సీ. శతకంఠుఁ డనువాఁడు చనుదెంచె మనమీఁదఁ
బాఱిపోవుద మె యీపాటిమనము

1 విధవ యెదురయ్యె నాదైత్యవిభుని కంత.

దానవేంద్రుఁడు వాఁడె తర్లివచ్చెను రండు
వనచరులార యీవలికి నేఁడు
రాత్రిసేనుఁడు మహారణము సేయఁగవచ్చె
జరుగుఁడ మీఁక లెంక జాగువలదు
కర్బురధవుఁ డదె కాకతో నేతెంచెఁ
గదలుఁడ మిటనుండి వదలి మనము

గీ. అనుచు భీతిల్లి తమలోన నాడుకొనుచు
సైన్యములు నక్కడక్కడ జరిగి విఱిగి
తిరిగి తోఁపక యెంతయుఁ దెలివితప్పి
రూపములు మాఱి రంత విరూపు లగుచు. 134

సీ. గిరిగహ్వరముల కేగిరి మోహరంబులు
విడిచి కొందఱు కపు లడరుకొనుచు
రూపముల్ డాఁచి విరూపముల్ గైకొని
వ్రాలిరి కొందఱు వసుధమీఁద
దండముల్ గాని యుద్దండముల్ పనికిరా
వని కొంద ఱసురుల వినుతిఁ జనిరి
రామచంద్రుండె పరామరిసించు న
టంచు నల్లన శరణనిరి కొంద

గీ. ఱిట్టిలెఱుఁగున వానరు లెల్లదిశలఁ
బఱవ వారలఁ గనుఁగొని భానుసుతుఁడు
వారలకు రాముఁ గేల నొయ్యారముగను
జూపి యిట్లనె సైన్యముల్ చోద్యపడఁగ. 135

క. పాఱకుఁడీ భీతిల్లుచుఁ
దారకుఁడీ రిపులఁ జూచి దైత్యులనెల్లం

బోరాడఁగలము రణమున
శ్రీరాముఁడు గలుగ మనకుఁ జింతేమిటికిన్. 136

సీ. ఈరఘునాయకుం డినవంశరత్నంబు
జగదేకవీరుండు శౌర్యఘనుఁడు
వరశరణాగతవజ్రపంజరుఁడు దా
నవసంహారుఁడు ధరానాయకుండు
జానకీహృదయరంజనచరిత్రుఁడు పవి
త్రుఁడు వికచాబ్జనేత్రుఁడు కృపాత్ముఁ
డీశతకంఠుని నిప్పుడే తృణలీల
మడియించుచున్నాఁడు మనకు నితఁడు
గీ. దాపుఁ బ్రాపును దల్లియుఁ దండ్రి యగుచు
నుండ మీకేల భీతిల్ల యుఱుకుచుండ
రండు రండు రయంబున రాముకడకు
ననుచు మఱలించెఁ దనదుసైన్యములనెల్ల. 137

మ. మఱలింపం గపిసైన్యముల్ గిరివరక్ష్మాజవ్రజంబుల్ మహా
కరయుగ్మంబులఁ బూని పెల్లుగ జగత్కంపంబుగా నార్చి
యో, ధరణీనాయక మమ్ముఁ బంపు మసురవ్ ధాత్రీస్థలిం
గూల్చి మీ, చరణంబుల్ గనుఁగొందు మంచును రణోత్సా
హంబునం బల్కుచున్. 138

క. శరణయ్యాభక్తవత్సల
శరణయ్య మహానుభావ జానకిరమణా
శరణయ్య దానవాంతక
శరణయ్యా రామచంద్ర సద్గుణసాంద్రా. 139

వ. అని యిట్లు నుతియించినసుగ్రీవునిం గని సంతోషభరితమాన
సుండై తత్సైన్యంబు నవలోకించి మఱియును. 140

శా. రాముం డిట్లు ముదమంది వచ్చెడిమహారక్షోగణాధీశ్వరా
గ్రామప్రాభవముల్ శతద్వయసదోర్దండప్రచండత్వముల్
మోముల్ మూఱును దస్ముఖప్రకరసంభూతానలజ్వాలలున్
వేమాఱుం గని కోపముల్ భయము నావిర్భూతమై మాచు
మన్. 141

మ. నరనాథుండు విభీషణుం బిలిచి యన్నా యీమహాకాయుఁ డీ
శ్వరుఁడో చంద్రకృతాంతుఁడో యనలుఁడో చర్చింపఁగా
మృత్యువో, ధరపై నెవ్వఁడు వీఁడు పేరిఁ గని చిత్తం బంత
యమున్ భీతిలెం, గర మొప్ప న్వినుపింపుమా యెఱిఁగెదన్
గర్వంబు పోకార్చెదన్. 142

*మ. అనినన్ దేవ మహాభుజార విను వీఁ డాభీలతన్ దైత్యశౌ
ర్యనయుండైన శతాననుండు బహుమాయావర్తనుం డస్మదీ
యనితాంతాస్త్రుఁడు వీని యుద్ధమునఁ బోరాడంగ శక్యంబుగా
దు నరేశాగ్రణి యెట్లొ కాని వరరాడ్దుర్వారుఁ డీతం డిలన్.

---

*సీ. సత్యశీలాన్వాప్రసన్నశరణాభిమ విన్నవించెద మీకు విమలముగను
ఇతఁ డీశ్వరుండు గాఁ డినవంశవర్ధన వికృతాంతుఁడు గాఁడు విమలముగను
గాలమృత్యువుగాదు కమలయవంశయుంబుజపత్రనేత్ర సత్పుణ్యగాత్ర
ఘనతరమాయావర్తనుఁడు దౌర్జన్యుండు దానవాధీశ శతాననుండు
గీ. రణమునను వీని గెలువంగ రాదు విబుధ
వరులకును నైనఁ దలఁపంగ వానిఁ దునుమ

ఇట్లు మనకు నుపాయంబు నెసఁగు నిపుడు, రమ్యగుణసాంద్ర దశరథ
రామచంద్ర, వ. మఱియుఁ వినుము.

మ దనుజాధీశునియంగమందుఁ గలర క్తం బింత యిద్ధాత్రిపై
నొనరంగాఁ బడెనేని నూఱ్వురుశతాస్యుల్ సంభవంబై రణం
బున కత్తాఁడుదు రిందు కేమి తెలుగో పోరాడ నెట్లోర్తురో
వనచారుల్ వనజాతజాతువరగర్వం బెట్లు నాశిల్లునో. 144

గీ. ఇతనిచేతను మనబలం బెల్లఁ ద్రుంగు
నితని గెలువంగఁ జొప్పడ దెవ్వరికిని
నుర్విఁ బురుషుల కితఁడ జేయుండుగాన
నెట్లుజయమందు మోమన కెఱుఁగరాదు, 145

వ అని మఱియుఁ బెక్కుచందంబుల విభీషణుండు శతకంఠుని
ప్రకారంబు లెఱింగించి నృపవరా యుద్ధంబు సేయునెడ
నద్దానవేంద్రునిపై నాగ్నేయబాణంబు లేమఱక యేయు
చుండుము దానంజేసి రక్తబిందువులు ధరం బడనేరవు అందు
వలన ననేకశతకంఠోద్భవంబు మిథ్య యగునని యెఱింగించి
తత్తత్ప్రధానులమహిమంబు లెఱింగించి వారివారికిఁ దగిన
శూరుల నేర్పరించి యింక నాలస్యంబు దగదనుచుం జెప్పి
హనుమంతుని వీక్షించి మహాత్మా యిట్టిసమయంబున నెట్లైనం
గెలుపు సమకూఱంజేయు మదియునుంగాక నాపైని దానవుం
డెప్పుడు విగ్రహించుచు నుండుఁ గావున నన్ను నేమఱక
కాపాడు మనిన నొడంబడి రామునిసాన్నిధ్యంబున వాలంబు
ద్రిప్పుచునుండె భరత శత్రుఘ్న లక్ష్మణ కుశ లవ విజయ
సుగ్రీవాంగదులును మిన్నువగుల నార్చుచుఁ బరివేష్టించి
యుండిరి రాముండును ధనుర్గుణటంకారరవంబుల దిశలఁ
బగిలించుచు నమోఘశరంబు లేర్పరించుచు సీత కభయంబు
దెలుపుచు లక్ష్మణుం బురికొల్పుచు ననేకవిధంబుల విజృంభిం

చుచు నుండె అంత నుభయ బలంబులుం దలపడి శరవర్షంబులు గురియించుచు శైలంబులు ఉవ్వ్యచుఁ బాదపంబుల నడఁచుచు మోఁకాళ్లఁ బొడుచుచుఁ బిడిగిళ్ల గ్రుద్దుచు వాలంబులం జుట్టి త్రిప్పుచు వృక్షమూలంబుల వ్రేయుచు నిట్టిరీతి బహుఁగతులం బోరఁ జొచ్చిన దేవగంధర్వవిద్యాధరగరుడకిన్నరకింపురుషాదు లభ్రతలంబున నిల్చి యమ్మహాకలకలంబాకర్ణించుచుఁ జూచుచుఁ బరమాశ్చర్యంబు నొందుచుండిరి బ్రహ్మదేవుండును మనంబున వగచి యిట్టివరంబు లేల యొసంగితి వద్దురాత్మునిచే నఖిలకపివరరాక్షసప్రళయంబు సమకూఱుచున్నయది యని యింద్రాదు లెగ్గింప విన్ననై యుండెఁ బ్రళయకాలావసానంబున నొదవుసకలభువనసంహారంబు ననుకరించి యుభయకటకంబులయందును బీభత్సంబై యుండె నంత.

సీ. ఈపాటిమాంసంబు లెన్నఁడు లేవని
యేచి యుప్పొంగుపిశాచములును
బాటించి దాఁటించి మేటిరై యాడకా
డకుఁ దాండవము లాడుఢాకినులును
ఢాకినీగణముల డాసి మెదడు ద్రావి
యోకిలించుచుఁ జను శాకినులును
శాకినీకులముల దీకొని నెత్తుట
నోలలాడి చను భేతాళతతులుఁ
గీ. గదిసి పురివిచ్చియాడెడి కాకములును
గేరి కాకుల గమకించుగృధ్రములును
గలిగి కావిరి దిశలెల్లఁ గప్పి దివము
సంధ్యయును రేయుఁ దెలియ నశక్యమయ్యె. 147

గీ. భూరితరఘోరరక్తంబు పొంగి భువిని
వఱదలై పాఱె నామడ వనరుదప్పి
వృక్షమూలాగ్రములు గప్పి పీఁగె నంత
సురలు మునులును గడుమహాచోద్యమంద. 148

శా. ఆరీతిం దమసైన్యముల్ ధరణిపై నందందఁ గూలంగఁ దాఁ
గ్రూరక్రోధమనస్కుఁడై దివిజు లాఘోషింపఁ గాలానలా
కారం బొప్పఁగ దీర్ఘజిహ్వుఁ డురుసంగ్రామంబు గావించుచో
నారూఢిం గపిసేనపైఁ గవిసె నుద్యత్ప్రాభవం బేర్పడన్.

చ. కవిసిన నుగ్రరాక్షసునిఁ గన్గొని రామునను గ్రహంబునన్
వివిధశరంబు లేయుచును వేగమున న్భరతుం డొగి న్మహో
గ్రవిశిఖ మానిశాచరుఁడు గ్రక్కున నేసినదాని నొంచి భై
రవరవ మేర్పడం గణఁగి రాక్షసుఁ గన్గొని యప్పు డిట్లనెన్.

ఉ. ఓరి నిశాచరుండ విను ముగ్రరణంబున నిల్చి నేర్పుతోఁ
బోరుము చూచెదన్ యముని ప్రోలికి నిన్నును బంపెద
న్మహో,దారశిలీముఖంబుల హతంబుగఁ జేసి వనేచరావళిం
జేరి ముదంబు నెక్కొనఁగఁ జేతు నిమేషములోన నిచ్చటన్.

చ. అనవిని దీర్ఘజిహ్వుఁడు దురాగ్రహుఁడై భరతున్ ధనుర్గుణా
స్వనబధిరీకృతాఖిలదిశావలయుం గని యోరి చూడరా
మనుజకులాధిపాధమ సమర్థునకున్ బహుభాష లేలరా
కనదసిధారచేఁ గదిసి కండలుచేయుదు నిన్నుఁ జూడరా. 152

చ. పడిన నినుం గనుంగొని నృపాలుఁడు రాముఁడు వచ్చెనేనియ
ప్పుడమినిఁ గూల్తు నందులకుఁ బోర విభీషణుఁ డగ్గెనేని బ
ల్విడి మెడఁ ద్రొక్కి చంపెద నవీనబలంబున వానికై యజాం
డుడుగక వచ్చెనేని తగ నుక్కణఁగించెద నొక్క ప్రేల్మిడిన్.

ఉ. నాటిని రాఘవానుజుఁడు నవ్వుచు నొక్కయమోఘబాణ
మూ, దేవతలెల్ల కీవెనలు తీవ్రముదంబున నిచ్చి మెచ్చఁగా
వావిరి నారిఁ బూని బలవర్ధనుఁడై తగ నిండఁదీసి యా
రావముమీఱ నేసె బవరంబున దైత్యునిజిహ్వ ద్రెవ్వఁగన్.

శా. జిహ్వానష్టమునొంది దానవుఁడు కస్తిం దోఁగి యుద్ధక్రియా
రంహూంబై ప్రళయాగ్నికైవడిని వైరం బొప్పఁగా మండుచున్
సింహాధ్వానము చేసి యబ్బురతుపై శీఘ్రంబునం జందరా
ద్రాహావ్యాస్త్రం బొగి నేయఁబూనిన సతం డాభీలశౌర్యంబునన్.

శా. ఆటోపప్రబలప్రతాపచటులోగ్రాకారుఁ డౌచు న్నిరా
ఘాటాగ్నేయశరంబునం దను మహీకాంతుండు మెచ్చంగ న
క్తాటాక్షిశునివాస్త్రముల్ దునిమె ధైర్యప్రౌఢిమన్ వేల్పులున్
సూటిన్ పన్నుతిసేయ వానరబలస్తోమంబు పెల్లార్వఁగన్.

ఉ. నాలికయుం గరంబులుఁ వ్రణాంబులరీతి నణంగఁ బావక
జ్వాలలు చూపులం బొఱగఁ జయ్యన మండుచు నట్టహాస మా
భీలతఁ జేయుచున్ భరతుఁ బెల్లుగ మ్రింగెదనంచు మృత్యు
వ్వుం, బోలి మహోగ్రతం గవిసి హోరె వనేచరులెల్ల భీతిలన్.

ఉ. అక్కకులేంద్రుఁడున్ దనుజు నల్లనఁ జూచి యమోఘవృత్తి
న్మైఁ, గర్కశభల్ల మొక్కటి ముఖంబున మంటలు గ్రమ్మఁ
బూనుచో, మార్కొని యార్చి యేసినను మత్తనిశాచరు
మస్తకం బొగిం, బెర్కొని త్రుంచి నేలఁ బడ బిట్టుగఁ ద్రోచె
భయప్రదంబుగన్. 158

ఆ. అట్లు ఖండనమున నవనిపైఁ బడుదీర్ఘ
జిహ్వపాటుఁ జూచి శిఖిముఖుండు

కణఁగి విలయకాలకాలభైరవుఁబోలి
బలిమి మెఱసి కవిసె భరతుమీఁద. 159

ఆ. అన్నమీఁదఁ గవియునట్టిదురాత్మునిఁ
జూచి బలములెల్లఁ జోద్యమంద
శత్రుభీష్ముఁడైన శత్రుఘ్నుఁ డొగినేసె
నర్ధచంద్రబాణ మతనిమీఁద. 160

ఆ. శిఖిముఖుండు దాని జీర్ణంబు గావించి
యతనిమీఁదఁ బఱపె నైంద్రశరము
దాని నడుమఁ ద్రుంచి దైత్యుపై నురగాస్త్ర
మేసె దనుజసేనలెల్ల నులుక. 161

మ. సరగ న్గారుడబాణ మేసి యురగాస్త్రం బుచ్చిపోఁజేసి యా
శ్వాసబాణత్రయ మూఁచి దుర్మదమునన్ శత్రుఘ్నుపై నేయనా
శరముల్ దేహముగాఁడి పోవ్వసిలి గర్జాతక్షతల్ మీఱఁగా
నసుదారం గుపితాత్ముఁడై ప్రళయకాలాభీలతం బొంగుచున్.

మ. నరనాథానుజుఁ డంత నుగ్రుఁ డగుచు న్నారాయణాస్త్రంబు
వింట రయం బొప్పఁగఁ బూని నిష్ఠురులు మింటన్ ఘూర్ణిలంగ
నబ్బుర మేపారఁగ నార్చి వేయ నది యాఘూర్ణమానంబుల న్నిండి
విస్ఫురదగ్ని ప్రకరంబు లీనుచు రిపుస్తోభంబు గావించుచున్.

మ. చనుదేరన్ భువనంబులెల్ల నదరెన్ పర్వతాచలంబుల్ భయం
బున నంచంద పణంకె నింకె సకలాంభోధుల్ గతుల్ దప్పె సూ
ర్యోనచంద్రుల్ వెసమ్రొగ్గె దిగ్గజచయం బేపాఱఁ గాలాగ్ని
చ్యుత సావిత్రవమయ్యెఁ దప్పుటకు నారాయణాస్త్ర ప్రయోగం
బునన్. 164

గీ. అట్టహాసకాండ మీక్షించి యసురవరుఁడు
బిట్టు వణఁకుచు నటు మొఱవెట్టుచుండ
వచ్చి విచ్చులు గురియుచు వానిశిరము
ధరణిఁ బడఁద్రోసె దైత్యులు తల్లడిల్ల. 165

గీ. శిఖిముఖుఁడు గూలుటకు వానిసఖుఁడు కినుక
నుగ్రుఁడై స్థూలకంఠుఁ డత్యుగ్రశూల
మపుడు హస్తంబునను బూని యమరు లడల
రూక్షిఁ బోరాడఁ గవిసె శత్రుఘ్ను మీఁద. 166

సీ. స్థూలకంఠునిబాహుశూలంబు వీక్షించి
లక్ష్మణుం డతనిపై లావు మెఱసి
యడ్డంబువచ్చి సాయకపరంపర లేయ
నసుర మహాకోపమంది కినిసి
యాలంబులోఁ గూలు మని శూల మపు డేసె
నేసిన భువనంబు లెల్ల వడఁకె
భూనభోమధ్య మద్భుతముగా ననలంబు
నిండె భయం బందె నృపవరుండు

గీ. నప్పు డెడఁజొచ్చి హనుమంతుఁ డాత్రిశూల
మెల్ల సైనికు లలరంగ నేపు మెఱసి
పద్మజాండంబు పటపటఁ బగుల నార్చి
విపులబలధుర్యుఁడై పట్టి విఱిచివైచె 167

గీ. వరుస నమృతంబు గురిసిరి వాయుసుతుని
మీఁద నమరులు దీవించె మేదినీశుఁ
డపుడు సౌమిత్రి సంభ్రమం బంది మాకుఁ
బ్రాణబంధుండ వగుదని ప్రస్తుతించె. 168

గీ. వెండియును లక్ష్మణుఁడు మహోద్దండుఁ డగుచుఁ
గౌశికుఁడు దనకిచ్చినకాండ మొకటి
వింట సంధించి పెల్లార్చి విపులరోష
మొదవ నాస్థూలకంఠుని నుర్విఁ గూల్చె. 169

గీ. స్థూలకంఠుఁడు గూలినఁ జూచి కుపితుఁ
డగుచు యోజనహస్తుఁ డాహవమునందు
మెఱయ సౌమిత్రి నొగిఁ బట్టి మెదలకుండ
నతనిచేతులు దెగవేసె నక్కుశుండు. 170

గీ. హస్తముల్ పోవ యోజనహస్తుఁ డపుడు
కుశుని ద్రింగెద నని మహాకోప మెసఁగఁ
దివిరి వక్త్రంబు దెఱచి యేతేర నతఁడు
సరసతూణీరముగఁ జేసె శరచయముల. 171

గీ. మించి వెండియు శరములఁ ద్రుంచివైచి
యఖిలవానరసేన లందంద నార్వఁ
దనదుచాపంబునను మహోద్దండశరముఁ
దొడిగి యోజనహస్తునిఁ బుడమిఁ గూల్చె. 172

చ. కనలుచు నక్కుశాహ్వయునిఁ గాంచి దురాగ్రహుఁ డౌచు
దుర్ముఖుం, డనియెడువాఁ డిటోరి మనుజాధిపనందన నన్నుఁ
జూడరా, తునిమెద నిన్ను నిట్టె యని తోరముగా నరుదేర
వానిఁ గన్గొని లవుఁ డుగ్రుఁడై పఱపె ఘోరశరంబులు
చిత్రవైఖరిన్. 173

ఉ. అప్పటిబాణముల్ నడుమ నన్నియుఁ ద్రుంచి లవాఖ్యు
మీఁదటన్, గుప్పున నగ్నిసాయకము గ్రూరత నేసిన దాని
లీలతోఁ, నప్పుడు వారుణాస్త్రమున నట్టె యణంచి నిలింపు

లెల్ల బొ, గొప్ప జయధ్వనుల్ సలుప సుగ్రశిలీముఖ
మొక్క ఁటేర్చుచున్. 174

వ. అప్పానవునిహస్తంబులుఁ జరణంబులు ఖండించి పిదప లీలమై వానిమస్తకంబును ఖండించె వానిమరణంబు గనుంగొని కోపతాపంబులు మీఱ శూర్పకర్ణుండును రక్తాక్షుండును పింగళాక్షుండును గజోదరుండును త్రిముఖుండునుం గదిసి యొక్కఁ పెట్టునఁ గుశలవులం జంపంబూనిన నెఱింగి వారల మహోగ్రంబులు సూచి రాఘవుండు ప్రళయకాలాంతకు పగిది హుంకరించుచు నందఱకు నన్నిసాయకంబులు బఱపి తలలు ద్రుంచె నంత. 175

చ. పదువురుమంత్రులు న్నృపులపాలును భృత్యులపాలునైనఁ దా, నదవదనొంది రోఁజుచు శతాస్యుఁడు మృత్యువుఁబోలి నిక్కుచుం, బ్రదరపరంపరల్ కడునభస్థలముఁ భువియుఁ మహానలా, స్పదముగ నిండనేసె బహుభంగుల వానరులెల్లఁ గూలఁగన్. 176

వ. [మఱియును బిఱుతివియక నూఱుబాణంబుల నంగదుం గూల్చి యిన్నూఱుశరంబుల సుగ్రీవు నొంచి యేనూఱు శిలీముఖంబుల భల్లూకపతిని మూర్ఛిల్లఁజేసి అఖిలవానరులను క్షణమాత్రంబునం జమరిపైచి క్రమ్మఱ దేశాధీశులం గదిసి కొందఱఁ బదతలంబున హతంబు గావించి యందఱ నొక్కఁ పెట్టునఁ దనవక్త్రగహ్వరంబులం జొనిపి మఱియును హత

[ ] ఈమధ్యభాగము పరిషత్ప్రతిలో సీసపద్యమున్నది.

సీ. నూఱుకరంబుల నూఱుబాణంబుల వాలిపుత్రుని గూల్చె వసుధమీఁద
నిన్నూఱుచేతుల నిన్నూఱుశరముల సుగ్రీవు నొప్పించె సురలు బెగడ

శేషు లగుమనుజవనచరబలంబులం బోకార్చి విభీషణు నవలోకించి వీనికతంబున రావణకుంభకర్ణమేఘనాదప్రముఖానేకదానవప్రళయంబు సమకూరెం గులద్రోహియైనవీనిం దెగటార్చెద నని బ్రహ్మాస్త్రంబు సంధించి సకలలోకంబులు దల్లడిల్ల నార్చి పేర్చి యేసిన నది విలయానలకీలాకరాళంబును మృత్యుంజయఫాలనేత్రసంభూతమహోగ్రంబును వీరభద్రకోపంబును కాలభైరవోగ్రంబును గూడ నైక్యంబు నొందిన విధంబునం జనుదెంచెనొక్కొ యని గరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరామరలోకంబులు హాహాకారంబులు సేయం జిచ్చులు గురియుచు వచ్చి విభీషణు నవయవంబులు బంధించి నేలం బడం ద్రోచె నంతయు కాని రాఘవకరుణాకటాక్షప్రభావామృతసంసిక్తశరీరుం డగుటం జేసి చంపనోపదయ్యె నవ్విభీషణుసైన్యంబులు నాడాడం బఱచి డాఁగె వెండియు నమ్మహాదానవుండు కుశలవవిజయభరతశత్రుఘ్నలక్ష్మణులతోడంగూడ రాముని వధియింపం బూని యొక్కపెట్టున ధనుశ్శతంబులు ధరించి బాణసహస్రంబుల హనుమంతుని వివశుంగావించి శరవర్షంబు గురియుచు నట్టహాసంబు

---

నేనాఱుశరముల నేసఁగ భల్లూకనాథుని గూల్చె నుర్విపై దొరలియాడ
వానరబృందంబు మానుగాఁ జక్కాడి క్రమ్మఱ నృపతుల గదిసి మెఱసి

గీ. అన్యనృపతుల బడబాగ్నియందు వేల్చి
కోరి కొందఱ నొకమాఱు నోరు దెఱచి
మ్రింగె హతశేషులైనవా రంగమెల్ల
నెక్కి చక్కాడె నంతట నుక్కు మెఱసి.

సేయుచు నుండెను [సీతామహాదేవి యతని భీషణాకార ప్రకారంబు నిరీక్షించి తనయాదిమహామహిమం బాకర్షించి శతకంఠునికిం దన్నెవ్వరికిం గానరాకుండం గనుపట్టిన శతముఖుండను రాక్షసునిం జంపెదనని యార్చుచు దాసి పురోభాగంబున నున్న జానకిం గనుంగొను] ననపరంబున నవబ్రహ్మలును ఏకాదశరుద్రులును ద్వాదశసూర్యులును ప్రేతాత్ములును ముప్పదిమూడుకోట్లదేవతలును గనంబడిన భయంకరంబగు నాకారం బిది మృత్యువుగాని యాడుదాని మాత్రంబుగాదని నిశ్చయించి తా నరుదేరం దనతల్లి రణయాత్రకు ననుగ్రహంబు సేయకుండుటకును క్రమంబున దుర్నిమిత్తంబులు కనంబడుటకును సంగరంబునం దనప్రధానులు బలంబుతోంగూడ భస్మంబు గొనుటకును జిత్తంబు వికలంబైన నేటికి యుద్ధంబు సేయం దగదు జేపు చనుదెంచి సహోదరసహితంబుగా రాముని నెగటార్చెద నని ప్రతాపలంక కరిగె రామచంద్రుండును విషణ్ణహృదయుండై విభీషణు బ్రహ్మాస్త్రబంధవిమోచనంబుగా

[సీ. సీతామహాదేవి చెన్నొంద నాకారమును విభీషణముగ నొనరం జూచి
తనయాదిరూపంబుం దగం దాల్చి శతకంఠునకుం దప్ప నేరికిం బ్రకటముగను
గానరాకుండినం బూని యాదైత్యునిం జంపంగ నోపును క్షణములోన
ననుకొనియుండం దా నపుడు దానవభర్త నవనిజాధిపు గూల్తు ననుచు మదిని
గీ. మచ్చరమునొంది రాముని మఱియుం జూచి
కిన్కు మాపుచు రామునివెన్కనున్న
జానకిం జూచి యిది మహాశక్తి యనుచు
మదిని భీతిల్లి యంతటం గదలి నిలిచె.] పరివర్తితము.

బ్రహ్మమంత్రంబు లుచ్చరించుచు మూర్ఛిల్లినకపులం దనహస్త స్పర్శచే నలవరించుచుఁ దమనిమిత్తంబునకై వచ్చినదేశాధీశు లంగని వగచుచు తేపు మగిడి దనుజుం డరుదెంచునెట్లో కో యని చింతించుచు సీతకు సంగరచాతుర్యంబులు దెలుపుచు హనుమంతుని వినుతించుచు నుండె నని మహాదేవుం డెఱిం గించిన విని పార్వతీదేవి శిరఃకంపంబుచేసి మహాత్మా శతకం ఠుండు మఱునాఁ డరుదెంచి నృపులతో నెట్లు పోరె సీత యేరీతి నతని హతంబుచేసె నెఱింగించి సంతుష్టం గావింపు మనిన నటమీఁదివృత్తాంతంబు పురహరుం డద్రిజకు విని పింప వినఁదొడంగె నంత. 177

క. కదనామరవరతనయా
సదమలచారిత్ర రాజసన్నుతగాత్రా
మదననిభరూప సంతత
మదశాత్రవహరణ పోచమక్ష్మారమణా. 178

---

పరిషత్ప్రతిలో—

ఉ. శ్రీరమణీయవైభవవిశేషగుణాకర యర్థిలోకమం
దార యశోవిశాల వరతార పటీర హిమాద్రి కాశనీ
శారదనీరదస్ఫురదవిశాలమరాళ తుషారహీరక
ర్పూరనిభస్ఫుటస్ఫురణభూరిజితత్రవ తరెడ్డిభూవరా.

మాలిని. సరసగుణవిశేషా సాధుసంశీలభాషా
దురితవిపినఘోషా దూరజైత్రప్రదోషా
నిరుపమబుధతోషా నిర్మలారూఢవేషా
పరమపురుషతోషా భావజాకారవేషా.

ఘనప్రభూతకల్మషాదిభంజనానపేనకీ
ర్తినరమర్త్యనాయకాశుభాయకా?
అనక్రవిక్రమాబుధావనాత్యనక్రమా ?
రవిప్రకాశహాచమస్థిరాకృపాకరా.?

గద్యము. ఇది శ్రీమదేమకూర్తినివాసలక్ష్మీనృసింహాకరుణా కటాక్షసంప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణ సుమహితాంధ్ర గీర్వాణ భాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రా త్రేయసగోత్రపవిత్ర ధర్మనార్యపుత్ర నిఖిల మహీసురాశీ ర్వాద ప్రవర్ధమాన భాగధేయ సకలనృపవిధేయ వినయ విధేయ మర్ధననామధేయ ప్రణీతంబైన సీతావిజయం బను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# శ త కం ఠ రా మా య ణ ము

## చ తు ర్థా శ్వా స ము.



క. శ్రీనీలకంఠ సేవక
దానకళాకర్ణ మానధనసంభరణా
దీనసుర ద్రుమ సన్నుత
మానవధవవితతి పోచమత్స్మాధిపతీ. 1

వ. అవధరింపు మత్తెఱంగునఁ బార్వతీదేవికి మహాదేవుండు విని పించుచు వెండియు నిట్లనియె అట్లుశతకంఠుండు ప్రతాపలంక కరిగి కలహావృత్తాంతంబును సీతామహిమంబును తనపరాభ వంబును దనతల్లికివినిపింప నమ్మానినియును జింతించి తనయున కిట్లనియె. 2

గీ. వలదు వలదని పలుకఁగాఁ జలము మెఱసి
యనికి నరిగితి వటునీవు చనినపిదపఁ
గలఁగి యావంతనొందుచుఁ గన్ను మూసి
యొక్కకలఁగంటి నది విను నిక్కముగను. 3

గీ. రాముఁ డనునాతఁ డాదినారాయణుండు
తోడరి నిల్చిన నాతనితోడ నీవు
కణఁగి యెదిరింప శక్యంబుగాదు వినుము
తల్లివచనంబుఁ బాలింప ధర్మమండ్రు. 4

వ. అదియునుంగాక. 5

సీ. పురుషులచే నీకు పొలియకుండఁగఁ దొల్లి
వనజజుఁ డొసఁగినవరము లెల్ల
నిలిచెద నిలిపి యేనెప్పుడనైన నా
దిమశక్తిఁ బూని ప్రార్థించి యప్పు
డంజోల్లితనలన నీరాక్షసుఁ బరిమార్త
నని లోకమాత నొయ్యనఁ దలంచెఁ
దలఁచిన నయ్యష్ట పటువిశిఖంబుల రాము
చే విల్లునమ్ములు చేరి తివిచి
గీ. తాన కైకొని ఘోరయుద్ధంబుచేసి
యాహవంబున నీతల లవనిఁ గూల్చె
డాసి యడలిరి నాదుకోదండప్రు వినుము
ఇట్లు కలఁగంటి నీకిమీఁద నెట్లొకాని. 6

సీ. ఏఁగన్నకలసత్య మింతయేకాని త
ప్పఁగనేర దెల్లింటిబవరమునను
సీతామహాదేవి శితశరంబులచేతఁ
బడునప్పుడైనను దలఁచు బుద్ధి
నీసేనలన్నియు నిమిషమాత్రంబున
ధరఁ గూలునప్పుడైనఁ దలఁచు బుద్ధి
పటువిశిఖంబుల బలువిడి నీతలల్
దండించునప్పుడైనఁ దలఁచు బుద్ధి
గీ. యొక్కకపిమాత్రుఁ డిచ్చట నుక్కుమెఱసి
రాఘఁ బిడికిటఁ గదిసి నీఱొమ్ముఁ బొడిచి

నీదుసింహాసనము గూల నిలిచి తన్ని
యరిగె నదియైనఁ దలఁప వేమందు నిన్ను. 7

సీ. మర్కటాలికి వశమా సముద్రంబులు
నాలుగు దాఁట నేనాఁటనైన
నరులకు శక్యమా నవ్వుచు నీలంక
యగ్గలంబుగఁ బెనులగ్గపట్ట
భవదీయదానవాపారబలంబుల
నలవియే పరులకు నవనిఁ గూల్ప
సురసంఘములనెల్ల చెఱలువట్టిననిన్ను
నెదరింపఁ దరమె మఱెవ్వరికిని
గీ. గాన రాముండు విష్ణుండు గాఁ దలంపు
నెలఁత సీతను మాయగా నిశ్చయింపు
హనుమఁ డీశ్వరుఁ డని బుద్ధియందు నిలుపు
మనుము శరణని రఘురాముమఱువు చొరుము. 8

గీ. భానుకులవర్ధనుం డాదిపరమపురుషు
చరణములమీఁద సాష్టాంగ మెరఁగి భక్తి
నిరపరాధిని ననుఁ గావు నీవె దిక్కు
పరఁగఁ గనుమన రామభూవరుఁడు నిన్ను 9

సీ. అలవిభీషణుఁ గాచినట్టిశౌర్యంబునఁ
గాకాసురునితప్పు గాచురీతిఁ
బొసఁగ నెంగిలిపండ్లు భుజియించి శబరిని
గరుణ రక్షించినకైవడిగను

---

1 మాటలభేదముతో నీయర్థమే ప్రత్యంతరమునఁ గలదు.

జాపకారై యున్న తాపసిదేవికి
శాపంబు వాపినసరణి ధరణిఁ
వాటకఁ దెగటార్చి తపసియజ్ఞము గాచి
కరుణతో మానులఁ గాచినట్టు
గీ. లఖిలసురమునిబృందంబు నౌ ననంగ
శ్రితజనాధారు శాత్రవజితవజీరుఁ
గోటిసూర్యప్రతీకాశుఁ గుజననాశు
సిద్ధమని నమ్ము నిన్ను రక్షించుఁ బుత్ర. 10

క. పుత్రా నామాటలు విను
సుత్రామాదు లొగి నిన్ను సొంపు దలిర్పం
బాత్రునిగా నుతియింతురు
శాత్రవజిత యింతకన్న సమయము గలదే. 11

వ. అని మఱియు ననేకవిధంబుల భయంబు పుట్టించినం గనలి తోఁకద్రొక్కినభుజంగంబు తెఱంగున దండతాడితం బైనకంఠీరవంబుచందంబున ఆజ్యాహుతం బైన ప్రళయాగ్నిమాడ్కి మండి మిట్టిపడి మొగంబులు ముడివెట్టుక కన్నుల నిప్పులురులఁ దల్లి వియని యిమ్మాటలకు సహించితింగాక యొండొరులైనం దెగఁజూడనే. స్త్రీబుద్ధిః ప్రళయాంతకీ' యనుసామెత నిజమయ్యె నీబుద్ధి వినియెడు వెఱ్ఱియునుం గలఁడే యని యచటు వీడ్కొని ప్రళయప్రచండమహోద్దండసప్తార్చి విధంబునఁ గ్రాలుచుఁ బటహాదిరవంబుల బ్రహ్మాండంబు ఘూర్ణిల్లమఱునాఁడు సూర్యోదయకాలంబున రథంబుపై నెక్కి కొంత చిక్కినసైన్యంబులం గొని విలయకాలాంతకువిధంబునఁ గదలి రాఁ దొడఁగె నంత నిక్కడ. 12

ఉ. అడ్డమువచ్చి తల్లి తనయాత్మజునింగని ప్రేమమీఱఁగా
గడ్డము వట్టి నామనవి గైకొని యిప్పుడు వద్దు రాముతో
జడ్డుతనంబు మాను సరసంబున నీవును సంధిచేసి నీ
బిడ్డల నన్నుఁ గోడలిని బెంచుము శాశ్వతకీర్తి వర్ధిలన్. 13

వ. అనినఁ దల్లింజూచి బొమలు ముడివెట్టి పెద్దకాలంబున నిట్టి బుద్ధి వొడమి మతిచెడియున్ననీతో నాకు భాషణంబేల అంతశ్శత్రువులతోడ సంధి గావింపుమని పలుకవచ్చిన నిన్ను సహించితిఁ గాని నాప్రాణంబులు నాకు రుచికరంబులు గావే నిన్ననఁ బనియేమి విడువు మని కరంబున నదల్చి సకలబల సంపన్నుండై యరుగుదెంచుచున్న నంత నిక్కడ. 14

*గీ. రామచంద్రుండు నలసుమిత్రాతనూజుఁ
బ్రేమతోడుతఁ జూచి విభీషణార్క-
తనయపవనజజాంబవత్ప్రభృతి తరుచ
రేంద్రు లెల్లను వినుచుండ నిట్లు లనియె. 15

ఉ. నిన్న శతాస్యుఁ డిచ్చుటికి నిక్కుచు వచ్చి యనేకసేనలం
బన్నుగ సంహరించి మనపైఁ జనుదెంచిన వానియుగ్రతం
గన్నులఁ బాఱఁ జూచి యొకకైవడి నుంటిమిగాని వానితో
నున్నతవృత్తిఁ బోరుటకు నోపఁగనైతిమి నీచవర్తనన్. 16

ఉ. ఎంతటివానికైన నొకయొక్కఁడుదాడిని నొక్కవేళలన్
వింతగ బుద్ధి చంచరిలు విశ్వములో నటుగాన నైత్యుఁడ

---

*గీ. రామచంద్రుండు సౌమిత్రి రవితనూజు
రావణానుజుఁ బవనజు రమణజాంబ
వంత తరుచరమానవవరులఁ జూచి
యిట్టులనె వారు వినుచుండ నింపెలర్ప.

త్యంతరణోత్సవంబున రయంబున వాఁ డొగివచ్చె వానితో
నెంతయుఁ బోరఁగావలయు నెల్లసురావళి సంతసిల్లఁగన్ 17

ఉ. నావిని లక్ష్మణుం డనియె నవ్వుచు నీగతిఁ బల్క నేల నా
లావును దైత్యులావును బరామరిసించెదుగాక దివ్యబా
ణావళి నద్దురాత్ముని రయంబునఁ గూల్చెద లేనినాఁటికిన్
వావిరివానిచేత నిల వ్రాలెదఁగాక తలంక నేర్తునే. 18

సీ. అనులక్ష్మణునిమాట కనుకూలముగ భర
తుండు శత్రుఘ్నుండు దండనిలిచి
చూడుమీ దేవ మాసుమహితవిక్రమం
బని చాపములు పూని రాక్షసంబ
కుశలవు లిద్దఱు ఘోరయుద్ధము సేయ
నట్టాడఁగాఁ జొచ్చి రలముకొనుచు
సుగ్రీవుఁ డారాముఁ జూచి సేనలతోడఁ
దలఁకక నిలిచె నంతకునిరీతి

గీ. నంత హనుమంతుఁ డప్పు డత్యంతశౌర్య
వంతుఁడై మిన్నుముట్టుచు వచ్చి రాముఁ
గంజదళనేత్ర నీకేల కళవళింప
నాశతాస్యునిఁ దృణలీల నవనిఁ గూల్తు. 19

గీ. అనుచు సన్నద్ధు లగుచు శంఖాద్యనేక
తూర్యనాదంబు లందందఁ దోడఁబడంగ
రథము లెక్కిరి తమమనోరథము లెక్క
భాతి నార్చుచు శత్రుగర్వములు వగుల. 20

సీ. రాముండు చటులవిక్రమశీలుఁడై వేగ
హనుమంతు భుజములయందు నిలిచి

జానకీదేవిఁ బశ్చాద్భాగమునఁ బొందు
గా నిల్పి భేరులు ఘనత మెఱయఁ
గడు ధనుర్గుణవిటంకారముల్ దిక్కులు
జగతిఁ బిక్కటిలంగఁ జలువుకొనుచుఁ
బవనజుమెఱుఁగునఁ బరఁగ విభీషణుఁ
బొంచియుండఁగ నియమించి మించి
గీ. దైవసంఘంబు జయజయధ్వనులు సేయఁ
గపులు పెల్లార్వ బ్రహ్మాండఘటము పగులఁ
గెరలి శతకంధరుని విలోకించుకొనుచు
ధరణిజకుఁ జూపుచును బ్రమోదమున నుండె. 21

ఉ. అంత శతాననుండు విలయాంతకుకైవడి హుంకరించుచుం
బంతముతోడ వచ్చి పటుబాణపరంపరచే గపీంద్రులన్
వింతగఁ గూల్చ వారలును వృక్షమహీధరసంఘముల్ వెసన్
వంత ఘటింప వైచినను వాఁ డవి చూర్ణముచేసె ప్రేల్మిడిన్.

చ. మఱియును మూఁడుబాణముల మైందుని గీటణఁగించి యుగ్ర
తన్, శరనవకంబుచే శరభుఁ జయ్యనఁ గూల్చి పదింట నీలు
నిన్, ధరఁ బడ నేసి గోముఖునిఁ దప్పక యేడిట సంహరించి
తా, నరుదుగఁ బన్నొకొంటను గవాక్షుని మూర్ఛిలఁజేసి
వెండియున్. 23

సీ. దశకద్వయంబునఁ దారకుఁ బడనేసి
మొనసి జ్యోతిర్ముఖు ముప్పదింటఁ
దివిరి ఖండించి యాద్వివిదుని నలువది
శితవిశిఖంబుల హతునిఁ జేసె

యిషుపరంపరలచే ఋషభుని వెసఁ ద్రుంచి
గవయుని డెబ్బదికాండములను
జక్కఁగావించి పెంపెక్కుచు నొకనూఱు
శరముల నంగదుఁ జమరివైచి
గీ. జాంబవంతుని మున్నూరుసాయకముల
నురవడిని గ్రుచ్చి ధాత్రిపై నొరఁగఁజేసి
గంధమాదనముఖమహాకపుల వేయి
మార్గణంబులు పరఁగించి మద మణఁచి. 24

గీ. పరఁగ నార్చుచు నిన్నూఱుబాహులందు
నస్త్రశస్త్రాళి ధరియించి యమరు లడలఁ
గడఁగి రాముని వెదకుచుఁ గదలిరాఁగ
నప్పు డెడఁజొచ్చి సుగ్రీవుఁ డడ్డుపడియె. 25

మ. వడివాలంబున వానిచేతు లణఁగం బంధింపఁగాఁ బూని యి
ప్పుడ మెల్లన్ వణఁకంగ నార్చుచు బలస్ఫూర్తిం జనుం దేర నే
ర్పడ నద్దానవచక్రవర్తి కినుకం బాటించి సుగ్రీవునిం
బడఁగూలన్ వెసఁ దన్నె రాఘవమహీపాలుండు చింతింపఁగన్.

ఉ. రాముఁడు నవ్విభీషణుఁడు రామునితమ్ములుఁ బుత్రులు న్మహీ
జామణియున్ మరుత్సుతుఁడు సంగరవీథినిఁ దక్క వానర
స్తోమములు న్నరావళియుఁ జూర్ణములైరి వెలుంగుచిచ్చుపై
నాము నెదిర్చి చచ్చుశలభావళికైవడి నొక్కపెట్టునన్. 27

ఉ. వెండియు నాశతాననుఁడు వేగమ రామునిపై రథంబు ను
ద్దండతఁ దోల సారథిని దప్పక తిట్టుచు హుంకరించుచుం
గాండపరంపరల్ ధరణిఁ గప్పుచుగుండెలు వ్రయ్యనార్చుచున్
దండిగ రాఁగ లక్ష్మణుఁడు దైత్యునిపై నెదిరెన్ మహోగ్రుఁడై.

చ ఎదిరిన రాఘవానుజుని యేపును రూపును బాణతూణముల్
సదమలశౌర్యముఁ విమలచాపమునుం గని యొక్కతీక్షణ
ప్రదరము వింటఁ బూని యలపద్మభవాండము వ్రయ్య నా
ర్చుచో, వదలక రోషభీషణవివాదము మీఱఁగ నప్పు
డిట్లనెన్. 29

గీ. పాఱిపో మ్మోరి యెటకైన బవరమందు
నెదిరి మద్బాణములకు సహింపఁగలవె
యిట్టె చంపెద నినుఁ జలపట్టి యింత
నందనుని మళ్లి తల్లి యెన్నఁటికిఁ గాంచు! 30

సీ. ఏఁడిరా లంకపై నేగి దశాస్యుని
ధాత్రిపైఁ గూల్చుప్రతాపఘనుఁడు
ఏఁడిరా బాణంబు లేర్చి యార్చుచుఁ గుంభ
కర్ణునిఁ జంపువిక్రమధురీణుఁ
డేఁడిరా కోపోగ్రహృదయుఁడై యని నగ్ని
వర్ణునిఁ జంపినవరబలుండు
ఏఁడిరా మున్ను మహేశ్వరచాపంబు
భిన్నంబు గావించుభీమశౌర్యుఁ

గీ. డతనిపైఁగాని నాదుసాయకము లేయ
శరధిఁ జొచ్చినఁ దలచూప వెఱచియున్నఁ
గొమ్మ మఱువున దాఁగినఁ గోరి విప్రుఁ
డైన గిరినున్నఁ బోనీయ కవనిఁ గూల్తు. 31

చ. అన విని యోరిదుర్మతి వృథావచనంబులు పల్కనేల లా
వున నెదిరించి నిల్వుము మహోగ్రశరంబులచేత నీతలల్
గనియలు నేతుఁ జూడు సురకాంతుని వజ్రినిఁ గెల్చుమేఘనా

దునిఁ దృణలీలఁ జిత్రముగఁ ద్రుంచుటెఱుంగవె యాజివ్రేల్మి
డిన్. 32

చ. అని చటులోగ్ర బాణముల నాశతకంఠుని నేసె నేసినం
గనలుచు నాశరాగ్ని లధికంబుగఁ గాల్పఁదొడంగె నందుఁ బా
వనమున నాగ్రహించి గరిమన్ వరుణాస్త్రము లేసి తచ్ఛరా
గ్నిని శమియింపఁ జేయుచు ననేకశిలీముఖసంచయంబులన్.

ఉ. నేలయు నింగియున్ దిశలు నిండఁగ నేయఁ దదాశుగానల
జ్వాలలు చుట్టుముట్టుకొని చయ్యన నయ్యరదంబు దగ్ధమై
కూలఁగఁ జేసెఁ జేసిన నకుంఠితశౌర్యమనస్కుఁడై కడున్
నేలకు డిగ్గఁగా నుఱికి నిల్చి కురించె మహాస్త్రవర్షముల్. 34

చ. అవి నడుమన్ హతంబుగ రయంబునఁ జేసి సుమిత్రపట్టివి
ల్లవికళలీల నొక్కచటులాస్త్రమునం దునియించి యొక్కటన్
వివశునిఁ జేయ మూర్ఛిలి వివేకము దూలఁగ వ్రాలి వెండియుం
బ్రవిమలవృత్తిమైఁ దెలిసి బాణపరంపర లేర్పరించుచున్. 35

ఉ వేఱొకవిల్లుపూని యొకవింతరథంబున నిల్చి వేగ బృం
దారకు లుత్సహింప నలదానవసేనలు చంచలింప దు
ర్వారపరాక్రమస్ఫురణ రాముఁడు చూచి ప్రియంబునొంద ర
క్షోరమణున్ రథంబుఁ బటుచూర్ణము చేసె జగంబు గంపిలన్. 36

ఉ. అందుకు దానవుండు విలయానలము న్బలె మండి వేఱొక
స్యందన మెక్కి చాపములు చయ్యన నూఱొగిఁ బూనియార్చి
సంక్రందనముఖ్య దేవతలు కన్గొని భీతిలుచుండఁ గోపముం
గ్రందుకొనంగ నూఱువిశిఖంబుల లక్ష్మణు గ్రుచ్చెఁ జెచ్చెరన్.

గీ. లక్ష్మణునిగాఁడి మఱియును లఘుతరముగ
ధరణి వెసఁ దూఱి యలరసాతలము సోఁకి

మరలఁ జనుదెంచి శతకంఠు మహితతూణి
మధ్యమున నిల్చె దైత్యులు మలసియార్వ. 38

గీ. వెండియును శతకంఠుఁ డుద్దండుఁ డగుచు
శక్తివైచిన సౌమిత్రి జలదరింప
వచ్చి విలుఁ ద్రుంచి దేహంబు సొచ్చి చింప
వ్రాలె నరదంబుపైనప్పుడాలమునను. 39

గీ. హా మహోదార లక్ష్మణ యకట యంచు
సీతయును రాముఁడును శోకసింధువునను
*దేలి రదిచూచి భరతుండు దివిరి యాశ
తాస్యుపై నేసె వివిధసాయకము లపుడు.

పరిషత్ప్రతిలోనున్నది.—

*మునిఁగి తేలుచు నాజి నిర్ఘోషు లగుచు
నెన్నఁ డెడఁబాయవైతి నాకన్ను నెదుర.

సీ. ఈదుఃఖవారాశి నెట్లోర్తుఁ దమ్ముఁడా నను జూడు లెమ్ము మానవవజీర
నాతోడునీడ హా నామనోరథసిద్ధి నినుబాసి నిముసంబు నిలువఁజాల
మోమెత్తిచూడవా మోహనాకార నీవది నెపై నీభక్తి వదలినావ
రణభూమిపై నీవు రాణింపఁజాలక ధరణిపైఁ బటునిద్ర దాల్చినావ

గీ. యకట పైవచ్చినట్టి నాయాపదలను
నీవ భరియించుచుండెద వెచటనైనఁ
గాని యిఁకమాకు దిక్కేది కరుణమాలి
తొలఁగఁ దగునా మహావీర తోయజాక్ష
దైవతరుభూజ హా సుమిత్రాతనూజ.

క. విలపించుచున్నయన్నను, బలుకుల భరతుండు ధైర్యప్రాభవుఁ డగుచుం
బులకించి చూచి యిట్లనె, తలఁపఁగ నీ విట్టులుండఁ దగునా సుగుణా.

ఉ. ఏఁచిన నుగ్రుఁ డౌచు ననుజేంద్రుఁడు నబ్బురతాహ్వయుఁ డ్రణో
ల్లాసునిఁ జూచి చూడు మదె లక్ష్మణుపాలికి నిన్నుఁ బంపెదన్
భాసురసాయకంబులను భగ్నము సేయుదు నంచుఁ జెప్పి పై
ల్లైసె సహస్రబాణములు హెచ్చుగ దిక్కులు పిక్కటిల్లఁగన్.

క. ఆయమ్ములు తృణలీలల
వేయమ్ములఁ ద్రుంచి వైచి వేగన దైత్యుం
గాయమ్ము పగిలి వెక్కులుఁ
గాయమ్ములు గనఁబడంగఁ గాండము లేసెన్. 42

క. వెండియును దోడఁదోడనె
కాండపరంపరలు దొడిగి కరములఁ గలకో

---

వ. అత్యంతరణోత్సవవిలాసభాసమానుండై యన్న నూరార్చి కదనసంత్ర
మంబున జనకపుత్త్రిం గాంచి నీమహాగుణతత్త్వంబు సకలసురాసురులకు
సర్వమహర్షులకు నగోచరంబు నీవంటిమహాపతివ్రతగలుగ సకలమహో
త్పాతంబు లడంగు నీవెగ్గించిన మహాదారిద్ర్యంబు లొందు నీమహాకరు
ణారసంబున నానందంబు నందు సర్వసంపత్కరంబై యుండు నిట్టిగుణ
సంపత్తి నీయందుఁగలుగ నీమత్స్వైచారంబులు వలువను వధూవరులు
మీరిద్దఱు మమ్ముల నాదరించి నామనోభీష్టంబు లీడేర్చి ధైర్యశౌర్య
గాంభీర్యంబులం జెంది సర్వప్రయత్నంబుల రణంబున కరుగుమని పలుక
నప్పుడు రఘుపుంగవునకు నమస్కరించి వెడలి శతాస్యుం గనుంగొని
యనేకసాయకవర్షంబులు గురిపించిన.

ఉ. అప్పుడు నుగ్రుఁడై కదలి యాదనుజేంద్రుఁడు లక్ష్మణాగ్రజుం
దప్పక చూచి లక్ష్మణుని దారిని నిన్నును వేఁగఁ బుత్తు మే
లొప్పఁగ నాశరంబులను నోరి దురాత్ముఁడ నిన్నుఁ గూల్తురా
యప్పుడు చూడు మంచు ధను వెత్తుచుఁ దా వెస నేసె బాణముల్.

దండములు నూఱు వ్రయ్యఁగ
దండిగ విట్టేసె సకలదనుజులు పఱవన్. 43

క. ఆతనిశోణితకణములు
భూతలమునఁ బడకయుండ భువనము నిండన్
ఖ్యాతిగ మహాగ్నిశరముల
చేతను బ్రభవింప బెదరఁజేసె జగములన్. 44

చ. అవిగని మండి దానవకులాధిపుఁ డొండుశరాసనంబులన్
వివిధశిలీముఖంబులను వేగన పూని యమోఘవృత్తిమై
భువి వణకంగ నార్చి రఘుపుంగవుఁ డద్భుతమందఁ దద్రథం
బవిరళలీల దగ్ధముగ నప్పుడుచేసె మహోగ్రచిత్తుఁడై. 45

చ. మఱియును వేయిబాణములు మార్గొని యేసి శరాసనంబు న
చ్చెరువుగఁ ద్రుంచి సూతుని నశింపఁగఁజేసి మదించి తోడనే
సురవరులెల్ల నుల్కఁ బటుశూలము కేల నమర్చి యోరి యీ
సురుచిరధారచేతఁ బటుచూర్ణముగాక తలంగి పాఱరా. 46

చ. అరివెస నార్చివైవ జగమంతయుఁ గంపమునొందె వార్ధులున్
సరగఁ గలంగె మిట్టిపడె శైలములన్నియు రామచంద్రుఁడున్
వెఱవెఱనొందె లోకములు వింతగఁ గావిరి గప్పె చంద్రభా
స్కరు లటుత్రోవదప్పి రతిచంచలవై ఖరిఁ దద్భయంబునన్. 47

సీ. ఈరీతి నది రాఁగ నేపుమై నమ్ముల
వానలు నిగిడించె దానిమీఁద
నవి త్రుంచి శూల మత్యంతరయంబునఁ
జటులమై యరుదేర శక్తివైచె
నది త్రుంచి మండుచు నది రాఁగ మదిలోనఁ
దలఁకక నిశితకుంతలము వైచె

నఱిత్రుంచి వెండియు గదకొని యేతేరఁ
బూని కఠారిని బొడిచె భరతుఁ

గీ. డక్కఠారిని నఱిగించి చక్కఁగదియ
నుగ్రుఁడై ముష్టిఁ బొడువంగ నుక్కుమెఱసి
యడిదముఁ గైకొని కాశూలమెఱికి యవయ
వములు ఖేదించి లీలమై వసుధఁ గూల్చె. 48

సీ. హా తమ్ముఁడా యని భ్రాతలాధీశుండు
సీతతో నడలి నిశ్చేష్టుఁడయ్యె
నలవిభీషణుండును హనుమంతుఁడును బాష్ప
నివహానిర్గతరక్తనేత్రులైరి
చిక్కినదానవసేన లన్నియు మిన్ను
పగుల నార్చిరి మేటిమగలరీతి
నింక నెవ్వఁడు దన్ను నెదురునో యని శత
కంఠుఁ డుండెను రణోత్కంఠుఁ డగుచు

గీ. నంత శత్రుఘ్నుఁ డంత కాలాగ్నివోలె
మలసి తనకన్నుగవఁ బెనుమంట లెగయ
మెఱసి చిచ్చులవానలు గురిసికొనుచు
సరభసంబున దానవేశ్వరునిఁ గదిసె 49

చ. కదిసిన వానియుగ్రమును గర్వమునుబ్బును శౌర్యధైర్యముల్
కదనమహోత్సవంబును వికాసము హాసముఁ జూచి దానవుం
డదనమహాగ్నికల్పవిశిఖావళిఁ జాపములందుఁ బూని యా
త్రిదశులు తల్లడిల్ల నతితీవ్రత నేసె రఘూద్వహానుజున్. 50

ఉ. ఏసిన యమ్ములం దునియనేసి ధనుర్గుణటంక్రియల్ మహో
ల్లాసత నిండ సంగరవిలాసమునన్ రిపుమీఁద నుగ్రుఁడై

ఘనులు దివిజులు జయజయధ్వనులు సేయ
దగ్ధముగఁ జేసి పొడిలోనఁ దరలకుండె. 55

గీ. అందు కత్యంతకుపితుఁడై యసురవరుఁడు
నూఱుకరములఁ బటుగదల్ నూఱుపూని
యార్చి వైచిన నన్నియు నతిరయమున
వచ్చి శత్రుఘ్నుఁ దాఁకె భూవరుఁడు వగవ. 56

గీ. [1]అట్లు సకలగదాతాడితాంగుఁ డగుచుఁ
దూలి వణఁకుచు నెత్తుటఁ దొప్పదోఁగి
మెదలఁగాలేక శల్యముల్ వదలి యపుడు
రథముపై వ్రాలె హా రామ రామ యనుచు. 57

గీ. ఇట్లు మువ్వురు తమ్ములు నిలను గూలఁ
గాంచి రాముండు మది లయకాలుగతిని
యాశతాస్యునిఁ బరిమార్ప నపుడు తలఁచె
నంతలోఁ గుశుఁ డసురకు నడ్డుపడియె. 58

ఆ. [2]పడినవానియలుక పాటించి దానవ
భర్త కినిసి యైదుబాణములను
బూని యేసె వాని భూపాలతనయుండు
తొడరి చేసె నపుడు తునియలుగను. 59

ఉ. వెండియు నన్నిశాచరుఁడు వింతగ నక్కుశుమీఁద నల్కమైఁ
గాండపరంపరంబులను గప్పిన నయ్యెడఁ జొచ్చి యాలవుం

1 ఇట్లుదాఁకిన శత్రుఘ్నుఁ డిలను నెందు.

2 అడ్డుకొన్నదాని కలిగి దానవభర్త, కినిసి పంచబాణములను బూని వేయఁదొడఁగె వాని వీరాధివీరుఁడు, తొడరిచేసె నిట్లు తునియలుగను.

డండజబాహురీతి దనుజావలినెల్లను ద్రుంచి ఖండనో
ద్దండతరాశుగంబులను దానవనాయకు గ్రుచ్చెఁ జెచ్చెరన్.

చ. [1]శిశువు లటంచునుంటి ననుఁ జేకొని మ్రింగఁగఁ బూని వచ్చిన
పృశుపతియుగ్రమో విలయభైరవుయుగ్రమొ మృత్యుయు
గ్రమో, యశనులయట్లు దాఁకి వివిధాస్త్రము లేసి కటంచు
విస్ఫుర, ద్విశిఖము లేసె నేసిన నవిం బొడిచేసి కుశుండు వెం
డియున్. 61

ఉ. క్రమ్మఱ నగ్నికల్ప మగుకాండశతంబుశరాసనంబునన్
సమ్మదవృత్తిఁ బూని నృపచంద్రుఁడు రాముఁడు సత్యశీలుఁడై
యిమ్మహి మించనేని దనుజేంద్రునిహాస్తశతవ్యయంబు వై
రమ్మునఁ ద్రుంచుఁ గా కని తిరమ్ముగ నార్చుచు నేసెఁ జెచ్చెరన్.

చ. ధరణి వడంకె వార్నిధులు తల్లడమందెఁ గులాద్రులెల్ల ది
ద్దిరముగఁ బెల్లుగాఁ దిరిగె దేవతలున్ భయమంది రెల్లది
క్కరులును మ్రొగ్గెనంతశతకంఠుఁడు చూచియమోఘవృత్తిమై
శరనిచయంబు లేసె నతిసాహసలీలల హుంకరించుచున్. 63

చ. దనుజుఁ డొనర్చుబాణమును దక్షిణమందునఁద్రుంచివైచుడున్
ఘన మనలంబు లోకమున గ్రక్కున నిండి తదీయహాస్తపం
క్తిని విదళించెఁ దోడనె యెదిర్చి లవుం డనలాస్త్రసంఘముల్
కనలుచు నేసి రక్తములు గాఱకయుండ నొనర్చె వ్రేల్మిడిన్.

1 చూపులఁ జిన్న వాఁడటని చుల్కనఁ జూచితి మ్రింగ మాని యీ
పాపఁడు శూలియో విపులభైరవుఁడో ఘనమృత్యువో మహా
తాపసమూర్తియో మిగులఁ దాఁ గొని యస్త్రశతంబులేయ నే
నేపునఁ ద్రుంచివైతు నని యేసినఁ జూర్ణముచేసె నాతఁడున్.

చ కరములు వ్రాలినన్ దనుజకాంతుఁడు బ్రహ్మఁ దలంచె సంతటం
గరములు వెండియు న్మొలచె గ్రక్కున మొల్చినవెంటనే ధను
ర్ధరుఁ డన మించి యుగ్రతరఘోరశరంబులు పావకార్చు లే
ర్పఱుపుచు నేసె నేసినను బాలుఁడు మూర్ఛలనొందె రందులన్.

చ. మఱియును శబ్దభేదు లగుమార్గణసంఘము లన్ ధరాసుతా
వరభుజయుగ్మ మేయ నిరువంకలగాఁడి మహాద్భుతంబుగా
సరవరుఁడున్ మనంబున ఘనంబుగఁ గంపిలుచుండ దేవతల్
హారహారయంచుఁ జూడ విగతాయువులన్ వెసఁజేసెనుగ్రతన్.

మ. తనపుత్రుల్ తనతమ్ములున్ దనుజుచే ధాత్రీస్థలిం గూలినం
దననేత్రంబుల నశ్రువుల్ చెదరఁ జిత్తం బందులన్ మండుచున్
ఘనతన్ వాయుజుమీఁద నెక్కి తనవెన్కన్ సీత శోభిల్లఁగా
దనుజాధీశుని డాసె నెల్ల సురబృందంబుల్ విలోకింపఁగన్.

మ. దనుజేంద్రుండును డాసె రామునిమహోద్దండప్రతాపంబునన్
వనధుల్ పిండలివండులయ్యె నచలవ్రాతంబులుం దూలెఁ జ
య్యన ధాత్రీస్థలి గ్రుంగె దిక్కరిసమూహంబుల్ వెసన్ మ్రొ
గ్గె దిగ్గనఁ బుట్టెన్ ధర నొక్కమ్రోఁత యజుఁడుం గాలంబు
లెన్నెన్ మదిన్. 68

సీ. వీఁడా మహోద్దండవీరప్రతాపుని
దశకంధరునితలల్ దరిగినాఁడు
వీఁడా సుఖానిద్రవిభవంబు గలకుంభ
కర్ణుని దెగటార్పఁ గన్నవాఁడు
వీఁడా మహారణవిక్రమధైర్యులు
మారీచుబాహుల మాపినాఁడు

వీఁడా మహోద్దండవిపులప్రభావుని
నతికాయు నాజిలో నణఁచినాఁడు

గీ. అనఁగ వింటినిగాని యీయవనిపతిని
నెన్నఁడును జూచి యెఱుఁగను నితని నేఁడు
చూడఁగంటిని నాకోర్కి వీఁడె సహా
బలుశరంబులఁ దెగటార్తుఁ బ్రాభవమున. 69

ఉ. రెండుపయోధులో తలఁప రెండుకులాద్రులొ రెండుచిచ్చు
లో, రెండుమదించునేనుఁగులొ రెండుమృగేంద్రములో
యటంచు నింద్రుండును రుద్రుఁడుఁ వరసరోజభవుండును
గూడి యద్భుతాఖండమనస్కులై దివినిఁ గన్గొనుచుండిరి
మాటిమాటికిన్. 70

వ. ఈక్రమంబునఁ జాపవిద్యాగురుం డగు రఘువరుండును,
త్రిలోకకంటకుం డగు శతకంఠుండును మహాయుద్ధసన్నద్ధులై
కదిసిన మేరునగంబునుంబోలె హనుమంతుం డట్టిసమయం
బునఁ దనవాలంబు రామచంద్రునిముందట నడ్డంబుగా నిలుప
నది దనుజవరుం డేయు శరంబులకు గుఱి యనఁ జెలంగె
విభీషణుండును మానవదానవనాయకులు వెనంగు నెడ
రామునిశరంబులచే నసురరక్తంబు చెదరి క్రిందఁబడకుండ
నడుమ నడుమ నాగ్నేయవాయవ్యాస్త్రంబు లేసెద నని
పావని మఱువున నిల్చి యుద్ధసన్నద్ధుండయ్యె అంత విలయ
సమయమహానలకీలాకరాళంబుచాడ్పున నూఱుమొగంబుల
మంట లాదవ ననేకసాయకంబులు నృపవరునిపైఁ బ్రయో
గింప నవియెల్లను హనుమదాభీల విశాలవాలవజ్రపర్వతంబు
సోఁకి తునియలయ్యె నంత. 71

మ పటుకోదండము పంచి రాముఁ డమరుల్ భాసిల్లి దీవింప వి
స్ఫుటనారాచము లూని యార్చి యల రక్షోనాథుపై నేయ
నా, చటులాస్త్రంబులు నింగిముట్టి తగ నాశ్చర్యంబుగా నాటి
యొక్కట నన్నిం జటుమార్ణమయ్యె దనుజాంగప్రాభవం
జే మొకో. 72

సీ. ఒక్కటిదివ్యాస్త్ర మత్యుగ్రశరాసనం
బునఁ బూని రఘురాముఁ డొనర నేయ
నది భటునకు నైదు హయమున కిరువది
కరికిఁ బంధురగతిఁ గలితశతము
సారథి కిన్నూఱు చక్రంబులకు వేయి
పాలుపారు కేతనంబునకు లక్ష
రథికున కఱువదిలక్షలు నై భూమి
యంతయు నిండ నత్యంతశీఘ్రి
గీ. మింతవట్టును దనుజేంద్రుఁ డంత వేగ
నడుమ నేత్రుంచి కుపితుఁడై పుడమి వణఁక
రాముపై నేయు బాణపరంపరలును
దక్షిణంబున వాలంబు దాఁకి విఱుగు. 73

ఉ. వెండియు దానవేశ్వరుఁడు విం ట్లొకనూఱు కరంబులందు ను
ద్దండతఁ బూని సాయకశతంబు దిశల్ వణఁకంగ నార్చి యు
గ్రుండయి రాముమీఁదఁ బురికొల్పి రయంబున నేసె నేసినన్
దండిగ లోకమెల్ల వివిధస్థితి నిండె మహాగ్ని పెల్లుగన్. 74

శా. అకాండంబులు కొన్ని వాయుజమహోగ్రాభీలవాలం
బొగిం, జక్కం దాఁకి హతంబునొందె మఱిపీఁకం గొన్ని
భూపాలకుం, బ్రక్కల్ వ్రయ్యఁగ దూఱిపాఱె నతివైరం

బొప్పఁగాఁ గొన్ని పెం, పెక్కన్ వచ్చి విభీషణుం పగిలె
దేవేంద్రాదు లీక్షింపఁగన్. 75

శా. రామక్ష్మాధిపుఁ డందుకున్ మది మహోగ్రం బొప్పఁగాఁ
గర్కశో, ద్దామాభీలశరంబు లేర్చి గుణమున్ దర్పోద్ధతిన్
మీటి సంగ్రామం బందుల రాముఁ డుండవలె లేకన్ వానరుం
డుంటకు, న్నేమం బొప్పఁగ సిద్ధమొందవలె వర్ణింపంగ రెం
డుండు నే. 76

మ. అనుచున్ వింట సమర్చి యార్చి నిజబాహాశక్తి నుంకించి చ
య్యనఁ బెల్లేసినఁ దచ్ఛిలీముఖము లత్యంతప్రచండాకృతిన్
దనుజాధీశునిగాడి యవ్వల వినోదం బొప్పఁగాఁ దూఱి వే
గన యచ్చేరువ నున్నకొండపగులంగాఁ దాఁక నుగ్రంబుగన్.

శా. అంతన్ మారుతి చెంత నిల్చి పటురోషాయత్తుఁడై వింట న
త్యంతోగ్రానలబాణముల్ దొడిగి యాదైత్యేంద్రురక్తం బిలం
బంతం బొప్పఁ దొరంగకుండఁ బఱపెన్ బ్రహ్మాదు లాశ్చ
ర్యులై, వింతం జూడఁగ నవ్విభీషణుఁడు హృత్క్షోభన్ ముదం
బందుచున్. 78

శా. దానం జేసి స్వదేహరక్త మిలమీఁదం జెందకున్నన్ హరి
ధ్యానం బొప్పఁగ నట్టహాస మొదవన్ దర్పంబుమై నార్చుచున్
మానంబుల్ చెదరంగఁ దిట్టుచును దుర్మార్గంబునన్ హా పరా
ధీనా యోరివిభీషణా తుని మెదన్ దిక్కేది వీక్షింపరా. 79

మ. అని పెల్లార్చి సమంత్రకంబుగ మహోద్యచ్ఛక్తి సంధించి యు
ద్దనుజాధీశకులాపరాధు నిలమీఁదం గూల్చి రమ్మంచు వై
చిన నంతంతకుఁ జిచ్చు లీనుకొనుచున్ శీఘ్రింబునం బోయిగ్ర

క్కన బంధించె విభీషణుఁ సురవరుల్ ఘోషింపఁగాఁ
జెచ్చెరన్. 80

సీ. అదిచూచి రాఘవుం డనలాస్త్రములు వైచెఁ
గంటకుం డగుశతకంఠుమీఁద
నవి ద్రుంచి దానవుం డైంద్రాస్త్రములు వైచె
నవి ద్రుంచి నృపుఁడేసె నహిశరములు
నవి ద్రుంచి వాయుబాణావళి దనుజుఁ డే
సిన నవి ద్రుంచి యజ్జనవరుండు
నారాచతతు లేసె నగుచు నద్దానవ
భర్త రథంబెల్ల భస్మముగను
గీ. విరథుఁడై యంత వేఱొక్కయరద మెక్కి
పృథివి వణఁకంగ విండ్లెక్కు వెట్టఁబూను
నతనిచాపంబులును విశిఖాలివలన
ఖండములుచేసె భండనోద్దండుఁ డగుచు. 81

సీ. చాపముల్ పోయినఁ గోపగించి శతాస్యుఁ
డురవడి మండుచు నున్నయట్టి
శూలంబు కరమునఁ జోద్యంబుగాఁ బూని
బ్రహ్మాండమంతయుఁ బగుల నార్చి
కనలుచు జనవల్లభునిఁ జంపు మని యేసె
నేసినజలనిధు లెల్ల నింకెఁ
గులగిరు లదరె దిక్కులు వ్రయ్యలగుచుండె
నింద్రాదు లద్భుతహృదయులైరి
గీ. యంత నదిడాసి విలయకాలాగ్నిరీతి
మండుచును రాఁగ నాహనుమంతుఁ డపుడు

వాల మల్లార్చి వచ్చెడిశూల ముగ్ర
వృత్తి వేసఁబట్టి నడిమికి విఱుచుచుండె. 82

సీ. హనుమంతుఁ డందుచే నదవదపడుచుండ
నిది సమయము రాము నిలనుగూల్ప
ననియొక్కగదతోడ నడిచె ఱివ్వున దాని
తాఁకున కొక్కింత తల్లడిల్లి
మనుజవల్లభుఁ డాత్మఁ గనలుచు నర్ధచం
ద్రాస్త్రశతంబు శరాసనమున
సంధించి దేవతాసముదయంబులభక్తి
యొనర నాపైఁ గల్గియుండెనేని

గీ. వానిహస్తంబులును దలల్ వసుధఁ గూలుఁ
గాక యని వైచె దైత్యుండు గళవళింప
నమరు లద్భుతమంది హాహా యనంగ
ఖండమై కూలెఁ దలలును గరశతమును. 83.

సీ. కూలి క్రమ్మఱఁ దొంటిపోలిక మొలచెను
గరములుఁ దలలు నక్కజముగాఁగ
నాశతాస్యునిరక్త మవనిపైఁ దొరఁగిన
మొనసి నూర్వురు శతముఖులుపుట్టి
యెక్కడఁ జూచిన నక్కడ నటువంటి
వికృతదైత్యులు వెల్లివిరిసియుండ
నన్ని దిక్కులఁ బోర నందుకు రఘురాముఁ
డందరఁ బోరుచు నడలుచుండ

గీ. నంత హనుమంతుఁ డాశూల మపుడు ద్రుంచి
సీత నెక్కడఁ దగులునో శితశరమ్ము

లనుచు వాలమ్ము చుట్టిరాఁ దిగిచియుండె
నగుచు సుర లుబ్బగా మేరునగమురీతి. 84

ఉ. రావణకుంభకర్ణుల శరంబులఁ గూల్చితి నంచు మమ్ము దు
ర్భావమునం బెనంగ వెసఁ బొల్పడి తెందుల కేగువాఁడ వీ
వేవిధినైన నిన్నుఁ దునియించి భవత్తనుమాంసఖండముల్
వావిరిమై భుజింతు మిఁక వార్ధులు సొచ్చినఁ బోవనిత్తుమే 85

గీ. కొంద ఱిట్లని తిట్టుచుఁ గొంద ఱలిగి
సాయకంబులఁ గప్పుచు శౌర్యమహిమ
చూడు మనుచును నెక్కడఁ జూచినను శ
తాస్యమయమయ్యె నటసురలకట యనఁగ. 86

గీ. అపుడు నిర్విణ్ణుఁడై చాప మచట వైచి
చేతులాడక మిగుల నిశ్చేష్టుఁ డగుచు
నవ్విభీషణు నీక్షింప నతఁడు శక్తి
బద్ధుఁడై యున్నఁ బవనజుఁ బొఱఁజూచి. 87

శా. ఏచందంబున గెల్చువాఁడ నిఁక నే నేలాగునం ద్రుంతు నీ
నీచాత్మున్ డెచటం గనుంగొనినఁ దానేయున్నవాఁ డేగతిన్
భూచక్రంబున నెత్తెఱంగు మునులం బోషింప నేలాగునన్
నాచేతన్ మనఁగోరువారు నెప మొందన్ హేతువయ్యెంగదా.

వ అని యనేకప్రకారంబుల విచారింప నారఘుపుంగవునిం గనుం
గొని యాంజనేయుండు నిర్విణ్ణుఁడై యూరకుండె సకలబల
క్షీణంబైనమనము మరలి వార్ధిచతుష్టయంబు నెట్లు గడ
తుము పుత్రపౌత్రానుజవియోగంబున కెట్లు నిలుతుము
ఈదురార్త మాముగ్గు రమ్మల కేమని వినిపింతు నీపరమ
పతితుం డైననిశాచరుని సర్వశస్త్రాస్త్రంబులవలన సంహారింపం

జాలక బలక్షీణంబై యుంటి నింక నేది యుపాయం బనిన మారుతనందనుండు రామచంద్రుని పరాజయంబునకుం జింతించి యూరకుండె నప్పుడు మగనివగపుఁ గనుంగొని సీతామహాదేవి తనయాదిమరూపమహిమాసామర్థ్యంబు తలపోసి తనచేత నంతయు సాధ్యం బగుట సిద్ధంబుగాఁ దెలిసి కరంబులు మొగిడ్చి రఘుకులసుధార్ణవసంపూర్ణిమాచంద్ర మదీయప్రాణనాథ రఘునాథ భవన్మహిమంబునఁ గొంతసేపు నేను మీచేతివిల్లును బాణంబులును బూని రిపులతోడఁ బోరెద నాఁడు దాన నని యాగ్రహంబు సేయందగ దిట్టిసమయంబున మీకు నలయిక దీఱుదనుకను దివిరి వివిధవిశిఖపరంపరలచేఁ బెనంగెద నావిన్నపం బాకర్ణింపుమని పెక్కుచందంబులఁ బ్రార్థింప రామభద్రుండును దనమనంబున నద్భుతంబు నొంది మున్ను దనతోడ వసిష్ఠుం డెఱింగించుటయును జానకి తన్ను సెలవు దయచేయుమని వేఁడుటయును మొదట విరించిఁ గోరునెడ స్త్రీలఁ దలఁపకుండుటయు ననేకప్రకారంబులఁదలపోసి దనుజుండు మడియుట సిద్ధంబని మనంబునం దోఁచిన నలరి బాణాసనబాణ తూణీరంబులు దీవించి యొసంగిన నవ్వేళ నవ్విమలాంగియును బరంజ్యోతిస్స్వరూపంబు గైకొని హనుమంతునిభుజంబుపై మిన్నుముట్ట నిలిచి తన మహాతేజంబు భూనభోంతరాళంబు పరిపూర్ణంబుగా నిండ మహోద్దండకోదండం బెక్కిడి సకలబ్రహ్మాండభాండంబులు ఘూర్ణిల్ల గుణటంకారంబులు గావించి తనమహామాయ నాకర్షించిననది పొడచూపిన నీవు దనుజుని రక్తబిందుపరంపరలు ధరం దొరంగక యుండ నెవ్వరికి నదృశ్యంబవై నాలుక

యెటుచూచిన యోజనంబు నేలఁ బఱపియుండుమని నియోగించిన రాఘవుం డాశ్చర్యమానసుండై చూచుచుండ నమోఘబాణపరంపర నిగుడించి శతముఖుల నందఱ నొక్కదిక్కునకు వాయవ్యాస్త్రంబులం ద్రోయుచు మహోద్దండప్రచండఖండనంబు గావించిన నద్దానవనాయకనిచయంబును దదీయతేజోవిశేషంబువలనఁ జేతులాడక చూచికొనుచుండి రాసమయంబున. 89

గీ. విల్లు జళిపించి కర్కశభల్లశతము
పూని దేవతలెల్ల నద్భుతమునొందఁ
బ్రహ్మజాండంబు పటపటఁ బగుల నార్చి
యెలమిఁ దనపతి వినుచుండ నిట్టులనియె. 90

[1]గీ. మూఁడుమూర్తులకును నేనె మూలదుంప
నగుదునేని శ్రుతుల్ సత్య మగునయేని
పుడమి నిజశతకంఠుఁ డొక్కఁడును దక్క
నున్న శతముఖహీనమై యుండుఁగాక. 91

---

1గీ. మూఁడుమూర్తుల మొదటి యామూర్తినేని
వేదములు నిక్కమైన సీఁపులపృథ్వి
నిజమ యగునేని నా దగునెమ్మిశరము
లను శతాస్యుండు ధరఁ గ్రుంగు ననుచు వేసె.

గీ. ఆశరంబు మహోగ్రానలాంశకరణి
ధరణి బగబగ మంటలు దిరుగఁ బెరుఁగఁ
జిచ్చుపెచ్చున మదిహెచ్చు విచ్చలవిడి
నాడుకొనె బాణదావాగ్ని నాశతాస్య.

గీ అనుచు వైచిన నందఱు నాక్షణంబ
నీఱుగావింప మాయమై పోరు మాని
చనిరి వెండియు దానవచక్రవర్తి
సీతపై నేసె నుద్దండశితశరములు. 92

గీ. ఇవ్విధంబునఁ దనరక్త మిలను దొరఁగి
యందుఁ బుట్టినశతముఖు లణఁగ నందు
వలన నిది మాయ గాఁబోలు వనితయైన
నిట్టితెఱఁగునఁ బోదురే పెట్టిదముగ. 93

గీ. అనుచుఁ గ్రమ్మఱ జానకి నరయుచుండ
విష్ణుఁడును బ్రహ్మయును నలవిశ్వపతియు
విలయపావకుఁడును మహావిధియుఁ గానఁ
బడిన నదిచూచి మది భయపడియె నసుర. 94

---

గీ. అటులు వచ్చినబాణాగ్ని కాఁగలేక
నీరుగావింప మాయమై పోరు మాని
చనిరి తమతమయిండ్లకు సైఁపలేక
బ్రదికియుండిన సౌఖ్యము ల్పడయవచ్చు.

వ. అనుచు రాక్షసేంద్రుని సేన బాణాగ్నిజ్వాలలు గ్రమ్ముకొని జుమ్మని వచ్చుచున్నయవి భరింప నెవ్వ రోపుదురు ఇతనికిం దగుగాక యని విడిచిరి యప్పుడు తదగ్నిజ్వాలామాలికల కెదురువడి తిరిగి వెలుఁగు నొక్కవారుణాస్త్రంబు బంధించి వేసినఁ దదగ్నిచలువం బొందినమీఁదటఁ దా నొక్కరుండై యాదానవచక్రవర్తి జనకజంగాంచి యుద్దండశరవర్షధారలు గురిపించిన.

క. శరవర్షధార లన్నిటిఁ, బరిమారిచె నొక్కబాణబడబాగ్నిమహా
త్వరితగతి యైనబాణము, కరమున సంధించి వేసె శతకంఠునిమీఁదన్. (?)

ఉ. రాముని పేరిబాణముల రాక్షసనాయకుమీఁద నార్చి యా
రామ చెలంగి వైచిన నరాతిభయంకరమై కణంకతో
వేమఱుఁ బోయి దానవునివిం ట్లొగిఁ ద్రుంచి కిరీటపంక్తులన్
భీమము మీఱ డుల్చి సరివెట్టెఁ దదీయశరీరతేజమున్. 95

ఉ ఎచ్చటఁ జూడ నచ్చటనె యొమ్మిని మృత్యువుఁ బోలి సీత దా
మచ్చర మొప్ప నిల్చి తనుమార్గణపంక్తుల నొంపఁ బూనఁ దా
నచ్చెరువంది యాహరిహరాదులకైన వశంబు గాదుగాఁ
జెచ్చెర నిమ్మహామహిమచేఁ దనకున్ మరణంబు చొప్పడున్.

చ. అనుచు రథంబుపై నిలువ నద్దనుజాధిపుమీఁద నల్కపై
ననలశిలీముఖంబులు సహస్రశతంబులు వైచె వైచినన్
దనుజుఁడు సొమ్మసిల్లి యరదంబున మూర్ఛిలి వ్రాలె వ్రాలినన్
గనుఁగొని సూతుఁడున్ రథము గ్రక్కునఁదోలె రణంబు
పాయఁగన్. 97

వ. శ్రీరామచంద్రుండు సీతామహత్త్వంబు గనుంగొని తన
మనంబున. 98

సీ. పుష్పంబు లఱచేతఁ బూననేరని చెలి
యిషుపరంపరఁ బూన నెట్లునేర్చెఁ
జిల్కపల్కులకు బిట్టులుక్కుకోమలి యిల
యెల్ల భీతిల నార్వ నెట్లునేర్చె
నేఁ దక్క నన్యుల నీక్షింపనేరని
యింతి సేనలఁ గూల్ప నెట్లునేర్చె
విసవిస నడువంగ నసియాడుకొమ్మ నేఁ
డెడసి యుద్ధముసేయ నెట్లునేర్చె

గీ. యనుచు రాఘవుఁ డద్భుతహర్ష వార్ధి
నోలలాడుచు హనుమంతువాలమహిమ
వినుతి సేయుచు నాతనివీఁపుమీఁద
నుండె జానకిపైఁ బ్రేమ నిండుకొనఁగ. 99

ఉ. అంతట దానవుండును రయంబున మూర్ఛయుఁ దేఱి సారథిన్
వింతగఁ జూచి యోరి పరవీరులు నన్వ రథంబుఁ దెత్తురే
యెంతటివారలైనఁ బరమేష్ఠి యొసంగిన యవ్వరంబుచే
నింతయు నన్నెనంకఁగలరే మహిఁ గూలుదు రింతె కాకొగిన్.

చ. అనవిని సూతుఁ డిట్లనియె నక్కట నాథుఁడు దండలేనిచో
ఘనవిశిఖంబులన్ మనల గ్రక్కున శల్యము లుచ్చిపాఱఁగాఁ
గనలుచు నేయుజానకిని గాంచి సురల్ వినుతింప నట్టిచో
దనుజకులాధినాయక రథంబు మఱల్పక యుంట ధర్మమే.

వ. అదియునుంగాక. 102

చ. వెఱచినయట్టివేళ మఱివింతగఁ గైదువు చక్కఁ బూనఁగా
మఱచినయట్టివేళఁ బలుమాఱు నరాతికి వెన్నుఁ జూపుచుం
బఱచినయట్టివేళ నగుబాటు ఘటింపఁగఁ జేరిఁ పూరిఁ దాఁ
గఱచినవేళలందు నెడగల్గ రథంబు మఱల్చు టొప్పగున్.

చ. అనుడు తదీయనీతివచనాలికి నుత్సవమంది వానికిన్
ఘనత ననేకవస్తువులు గ్రక్కున మక్కువ నిచ్చి నేఁటి కా
జనకజతోడఁ బోరుటకు శక్యముగా దటుగాన రేపు స
య్యన నరుదెంచి రాముని శరావళిచే నణఁగింతు వేగనన్.

ఉ. ఘోరుననఁ బోవనిమ్ము మనభూరిరథంబు గృహంబు చేరఁగా
నారఘురాముదేవి విను మల్లదె చంపఁగఁ బూనివచ్చె నా

క్రూరశిలీముఖంబు లలకోమలిపైఁ బని సేయ వెట్లుగాఁ
గారణమున్నదో యనుచుఁ గుందుచు నేగెశతాస్యుఁ డింటికిన్.

శా. ఆరీతిన్ శతకంధరుండు దనగేహం బొప్పుగాఁ జేరి యా
కారం బెల్లను జూచి భీతి నతిదుఃఖప్రాప్తుఁడై మిాఱి సాం
పారన్ జానకి మృత్యువై దగుమహోగ్రాగ్నేయబాణంబులన్
వైరం బొప్పఁగ వైచెనో యనుచు గర్వం బెల్లఁ దూలన్ వెసన్.

వ. మఱియు ననేకమార్గంబుల జానకి దివ్యతేజోమహిమంబును శరంబులవేగంబును బాణసంధానచాతుర్యంబును ఉప సంహారచమత్కృతియును నుగ్గడించుచు నెక్కడఁ గనుఁ గొన్న నక్కడఁ బరంజ్యోతిస్వరూపం బగుసీత గనఁబడిన భీతిల్లుచుఁ దనకు నింక మరణంబు సిద్ధంబని నిశ్చయించుచు నెజ్జపయిం బొరలుచుండుతనయుని విలోకించి తల్లియగు చిత్రగంధి డగ్గఱి తనకరంబునఁ దద్గాత్రంబు నివిరి రక్తప్లుత నిమ్నోన్నతంబులై యపరిమితశరంబులు నాటి యందు విఱిగియున్నఁ గనుంగొని విలపించి యిట్లనియె. [అయ్యా నెయ్యంబున నేఁబలుకువచనంబులు వీనులం జొరనియ్యక యింతచేసికొంటివి. ఆయమ్మ యెక్కడ నలుగు నక్కడ నిర్మూ

[ ] ఈమధ్యభాగము సీసముగా నున్నది.

సీ. రామునితో సంగరంబున కీవు పోవద్దని చెప్పిన బుద్ధిలేక
వైరంబు గావించి వసుమతీశునితోడఁ గలహంబుచేసి తకారణముగ
నామహావిభుదేవి యాదిపరంజ్యోతి నిఖిలజగన్మాత నిర్మలాంగి
యెక్కడ నల్గిన నక్కడ నిర్మూల మైపోవు నెక్కడ నేఫుమిాఱ

గీ. నెక్కడైనను గరుణింప నక్కజముగ, సిరులు వర్ధిల్లు నామహాసీతవలన
బ్రహ్మరుద్రామరేంద్రులు భాసురముగఁ, దగఁబ్రకాశింప నేరరు దానవేంద్ర.

లంబగు. ఎక్కడఁ గరుణించిన నక్కడఁ గళ్యాణపరంపరాభి వృద్ధియగు. అప్పరంజ్యోతిమాయకు బ్రహ్మరుద్రేంద్రులు లోనె కాని వెలియై ప్రకాశింప నేరరు] భూనభశ్శైలసముద్రాద్యపారస్థావరంబులును మృగాండజోరగపిపీలికాద్యసంఖ్య జంగమంబులును గలుగు బ్రహ్మాండంబులు నూలుకోట్లు పుట్టుచు గిట్టుచు నమ్మహాశక్తియందు నటించు. ఆదిమధ్యవిల యంబులు నమ్మహామహిమంబునకుఁ గనఁబడవు. నీకు మొదట విరించి పురుషులచేఁ జావులేకుండ వరంబు లొసంగునపుడు దేవతలు గినిసి యిట్టివరంబు లొసంగిన నద్దానవుండు లోకంబుల బాధపెట్టు నింతవత్సలత నీకుం దగదని దూఱిన నతండు లజ్జించి శతముఖుండు పురుషులం దడవెనె కాని తరుణులఁ దలంపఁ డటుగాన మిమ్ముఁ గోబ్రాహ్మణుల నెప్పుడు చెనంకు నప్పుడే జానకీదేవి తనతొంటిదివ్యరూపంబున వధించు నిందులకు సందియంబు లేదని పలికె నదిగావున సీతయుఁ జిద్రూపంబగుమాయగాని సామాన్యకన్యకగాదు. ఇట్టిచందంబున నమ్మగువచే భవన్నాశంబు సత్యంబు నమ్ముము. అసురలును విరించి పల్కినపల్కులకు నానందహృదయులై యుండిరి. ఇట్టి యమ్మహాశక్తి నెదురం జని చరణారవిందంబుల కెరఁగి నమస్కరించి మమ్మును బుత్రమిత్రకళత్రములను మనుపంజూచెదవేని సీతారాములకు శరణుచొచ్చి తలిదండ్రులు మీరు మీరుదప్ప మాకు నితరులు లేరు రక్షింపు మనిపలికి సకలభోగంబులం దేలుచు బ్రతుకుమని పెక్కుచందంబులఁ బలికిన నప్పలుకులు ములుకులచందంబునఁ గర్ణరంధ్రంబులు సోఁకిన నులికిపడి తల్లితో నిట్లనియె.

సీ. ఏ నర్థిచూచిన నినుఁడు శైత్యదముగాఁ
బూని యెండలుగాయఁ బొదల వెఱచు
వలసినప్పుడె కాని మలసి యెచ్చటనైనఁ
జెలరేఁగి యనలంబు మెలఁగ వెఱచు
నాకు భృత్యులరీతి నాకులందఱుఁ గను
సన్నలఁ బను లెల్లఁ జరుపుచుండు
రఖిలజీవుల నేర్పు యముఁడు నాముందఱఁ
గోలకాఁడై యుండు వేళ యెఱిఁగి
గీ. మృత్యువున కేను మృత్యువై మెఱయుచుండు
మఱియు నాయందుఁగల మహామహిమ శివున
కైనఁ జొప్పడ దట్టి నరాధముండు
నతివయును గెల్వఁగలరె యే నఱతుఁగాక. 108

గీ. రేపు చని శాత్రవుల నెల్ల నేపు మాపి
వత్తుఁగా కొండువార్తలు వలవ దుడుగు
మీ యటంచును దనతల్లి నింటి కనిచి
నెలఁతయును దాను నారేయి నిద్రచెందె. 109

సీ. అక్కడ రఘురాముఁ డనుజులుఁ దనయులు
పొరిడిఁ గూలినఁ జూచి శోకమంది
యేమని చననేర్తు నింటికి వీరల
నెచ్చోటఁ బొడఁగందు నెప్పటట్లు
కుశుఁ డెన్నటికి నన్నుఁ గొమరొప్ప వీక్షించి
వేడుకఁ బ్రతిభాష లాడుచుండు
లవుఁ డెన్నటికిఁ గల్గు లక్షణవంతుండు
బాలుఁడు నామీఁదఁ బ్రాణపదము

గీ. అనుచు నొఱలంగ సీత నాయకునిఁ జూచి
యేడసోదరు లధికుల కేడసుతులు
రణగతులు మాని యిట్లొఱలంగఁ దగునె
అనఘ సంసారములు మాయ లనఁగ వినవె. 110

సీ. *అనుచుఁ దానును రాముఁ డాహనుమంతుండు
నవ్విభీషణుకడ కరిగి యతఁడు

---

*సీ. అనెనుసీతను జూచి యారామచంద్రుఁడు
పుత్రమోహముచేతఁ బొవలి వొదలి
హా తమ్ములార యాహా పుత్రవరులార
రారోయి నను జూడ రాజసమున
మనతల్లులకు నేమి మనసారఁ జెప్పుదు
నేలాగు తాళుదు నేమిచేతు
దిక్కెవ్వరు లేరు నొక్కఁడ నైయుంట
దిక్కుగాఁ జూడరో దిక్కులందు

గీ. క్షణము మిముఁబాసి నేఁదాళఁజాల నహహ
సంభ్రమమువీఱ మీతోడ సాగరములు
నాల్గు నవలీలఁ జనుదెంచినాఁడ నిపుడు
నొంటినై యుంటి నను జూడుఁ డంటు నడలె.

సీ. తగదు శ్రీరామచంద్ర సద్ధైర్యధుర్య
శౌర్యగాంభీర్యములు మాని సంగరమున
జాలివడ సాహసంబునఁ జేలు టొప్పు
ననుచుఁ దెల్పిన ధైర్యంబు నందుకొనుచు.

వ. మఱియుఁ గొండొకసేపు విచారించి ధైర్యాత్మగతప్రాణపుండై తన్మనంబున
జానకి ధైర్యస్థితిగతులు గనుంగొనుచుండె నప్పుడు

మము నమ్మివచ్చి యిమ్మాడ్కి-ని బద్ధుఁడై
యున్నాఁడు రక్షింపకున్న దోష
మని శక్తి శరమున నలుకమై ఖండించి
మొనసి యాతఁడు పెందుమూర్ఛఁ దెలిపెఁ
దెలిపిన నతఁడును ధీరాత్ముఁడై లేచి
వారికోమలపదవారిజములఁ
గీ. బడిన దీవించి యతనితోఁ బ్రథనభూమి
చూడవలె నని దివటీలు పొరిదిఁ బూని
కపులఁ జూచుచు నంతంతఁ గదలుచుండఁ
బరఁగ భల్లూకపతి గానఁబడియె నచట. 111

సీ. ఆతని డాసి రామానుమతంబునఁ
బవనజుఁ డల్లనఁ బలుకరించె
జాంబవంతుఁడ నన్ను సరవిమై నెఱుఁగుదే
యోపుదే లేచి రానొక్క- దెసకు
నావిని మారుతనందనుం డీతఁడు
గాఁబోలు నని ధృతి కలిగి తెలిసి
హనుమంత రమ్ము రామావనీనాథుండు
పరిణామమునఁ దనభామతోడ
గీ. నున్నవాఁడె విభీషణుఁ డున్నవాఁడె
బ్రతికియున్నాఁడె పవనజ భానుసుతుఁడు
పరమబంధుండ వగు నీవు పలుకరించి
నపుడె బ్రతికితి నీకృపఁ గపివరేణ్య. 112

సీ. కన్నులశరములు గాఁడి యొక్కి-ంతయుఁ
దెఱవ శక్యముగావు తెలివిపడవు

వీనులు వినరావు వివశత్వ మొదవెడు
దేహంబు మరణపుదేహమునను
లోలమై పలుక నాలుకరాదు నోటను
దడిలేదు లేచినం బడుదు మరలఁ
గావున శరములు గాఁడియున్న వి మేన
నన్నియుఁ దివియుమా యన్న యనిన
గీ. రాముఁ డన్నియుఁ దీసి కరంబులందు
దేహ మెల్లను నివిరి చింతింపనేల
నేను రాముఁడ నన లేచి నృపునిపాద
వనజములమీఁద నందంద వ్రాలి తెలిసె. 113

వ. మఱియుం బరికించుచుఁ జనియెడుసమయంబున. 114

సీ. కొండలవలె నేలఁ గూలినమదగజ
ఘనకళేబరములు మేఘములుగాఁగ
మోఁకాలిబంటితో నేకమై యాడాడఁ
గనుపట్టు మెదడు పంకంబుగాఁగ
నలుగులతాఁకున నిలఁబడుమాంసఖం
డములు దామింద్రగోపములుగాఁగ
బలువిడి నెడనెడఁ బాఱెడిరక్తంబు
లంబుప్లుత ప్రవాహంబుగాఁగ
గీ. వాహినులగుంపు శరముల వానగాఁగ
మొనల హుంకృతు లవి యుఱుములును గాఁగ
వర్ష కాలంబుచాడ్పున వారికన్ను
గవలకును దోఁచె నప్పు డక్కజముగాను. 115

ఉ. అంతటఁ దెల్లవారె విలయాంతకుకైవడి నాశతాస్యుఁ డ
త్యంతపరాక్రమంబున మహాగ్రహుఁడౌచు రథంబుమీఁద ని
శ్చింతగ నెక్కి బాణములు చేకొని దుశ్శకునంబు లట్టిచో
నంతకు నంతకుం బొడమ నన్నియుఁ గైకొనకున్న నంతటన్.

ఉ. ప్రొద్దున లేచి తల్లి తనప్రోలికి వచ్చి కుమారరత్నమా
ముద్దులుగూర్చి ప్రేమమున మోమును వీక్షణచేసి నేఁటికిఁ
వద్దుర మాను దుశ్శకునవారము పుట్టె నటంచుఁ జెప్పఁగాఁ
బెద్దయెలుంగు నెత్తి భువిఁ బెల్లుగ నార్చి తొలంగఁ ద్రోచినన్.

వ. అంతట నడ్డంబు వడి యతనిభార్య యగుయయాతి కుమారుం
డగునీలకేతనుం దోడ్కొనివచ్చి నీతల్లి చిత్రగంధిబుద్ధులకు
సహింపఁజాలక తొలఁగం ద్రోచితి విదియేమికారణం బొకో
యని తననాథుపాదంబుల కొరఁగి నీకుమారుం డగునీలకేత
నుండు వచ్చియున్నాఁడు నన్నుం గృపఁజూచి నామాట
లాలించి యిప్పుడు రణయాత్రకు సమయంబుగాదు మాను
మని చెప్పిన వినంజాలక తనయుని గారవించి రాముని
జయించి జానకీసహితంబుగా నేతెంతు నందాఁక నీలంక
నిశ్శంకంబుగా నుండు మని చెప్పినఁ గుమారుం డామాట
లకు సందేహంబు నొంది యోయి రామచంద్రుండు సర్వ
దేవాసురులకు నజేయుండు. అదియునుంగాక పూర్వంబున
రావణాంతం బెఱుంగవె! నీవెంత! దుష్టవరంబు వేఁడినంగాని
నీకు నజేయుండుగాని నీచే రణమరణావస్థనొందఁడు. ఇతని
సతి మహాపతివ్రతాచారిణి. కళ్యాణి యగుసీతామహా
దేవిచే నశింపంగలవాఁడవు. ఇది పూర్వంబున మీతల్లిచే
వింటిని నాఁటనుండి నీదురాచారంబు లెవ్వరిం జీనునో యని

చింతించుచుంటి నదినిమిత్తంబున సీతారాములు చనుదెంచి
సమస్తసేనలం బరిమార్చిరి. నీవొక్కరుండవు నన్మహాశక్తిని
జయింపలేవు. రణయాత్ర మాని మన్నాదరించి సకలభోగం
బులం దేలుమని చెప్పిన విని యోరీ! పితృద్రోహంబునకుం
బాలుపడి దురాలాపంబు లెట్లాడ నోరాడె నని కుమారునిం
గదిసి కోపారుణితలోచనుండై యయ్యాతని నెడఁద్రోచి
కుమారుని వదలించి సకలశరంబులుం గైకొని వచ్చె నిష్టుట.

ఉ. వచ్చినదైత్యుఁ జూచి స్పృహపన్యుఁడు తన్మతిలోనఁ గొంకి యా
చిచ్చులమంటకైవడిని జేరెను శిరసరాక్రమంబునన్
సచ్చరితంబు భాగ్యమని సంఘటనం దెపుడైనఁ గృష్ణతో
విచ్చలవిడిఁగ నీని రణపీఠిని నెట్టులు గాల్చు సీతయున్. 119

వ. అని సీతం జూచి మధురవచనరచనాలాలిత్యంబున నవలో
కించుచు నుండె నంత దానవేంద్రుండు బాణపరంపరాభివృష్టి
యొనర్చి విజృంభించి సోత్సాహుండై జానకిం గదిసి మెఱసె. 120

ఉ. సీతయు విల్లు నమ్ములును జేకొని రాఘవు నాజ్ఞఁ బూని వి
ఖ్యాతపరాక్రమంబున మహాహవదీక్ష వహించి యామరు
జ్జాతుభుజంబుల న్నిలిచె జానకి చెంతను రామచంద్రుఁడుం
బ్రీతి దలిర్ప నుండెను విభీషణుఁడుం జనె వారిపొంతకున్.

చ. అపుడు సమస్తలోకములు నచ్చెరువందెఁ గృశించె దానవుం
డపుడు పయోనిధుల్ గలఁగె నప్పుడు పర్వతముల్ చలించె
నా, రపమునిమృత్యువు వచ్చుటఁ బరామరిసించుచు నుండె బ్రహ్మ
యుం, గుపితమనస్కుఁడయ్యె నదిగో విలయం బని మాటి
మాటికిన్. 122

ఉ. సర్వసుపర్వులున్ సకలచారణులున్ వరకిన్నరేంద్రగం
ధర్వులు సిద్ధసాధ్యులు ముదంబున నభ్రమునుండి వారిదో
ర్గర్వము బాణనైపుణియు గాఢతరప్రతిభాషలున్ దయా
ఖర్వమనస్కులై నిలిచి కన్గొనుచుండిరి యద్భుతంబుగన్. 123

ఉ. జానకి వారిఁ జూచి దనుజప్రభుఁ ద్రుంపఁ దృణంబు నాకు ని
ద్దానవనాథుతోడ విపిధస్థితిఁ బోరఁగఁ జూడఁగోరి ఖ
స్థానమున న్నిలింపులు విశాలత నల్లదె యున్న వారు నేఁ
బూని తదీయచిత్తములు పొంగఁగఁ బోరెదఁ జిత్రవైఖరిన్.

చ. అని శరసంఘమేయ దనుజాధిపుఁ డన్నిశిలీముఖంబులం
దునియఁగ నేసి వాయుజనిదుష్టతరాగ్రహవృత్తిఁజూచి యా
వనచరుఁ జంపినన్ మనుజవల్లభుఁడున్ సతియు న్నశింతు రో
య్యైన నిజమంచు నిష్ఠురమహాస్త్రము లేర్చి శరాసనంబునన్.

ఉ. ఇగ్గతి బాణముల్ దొడిగి యెమ్మె దలిర్పఁగ నార్చుచున్ సుధా
భుగ్గణమెల్ల నద్భుతముపొందుచుఁ జూడఁగ నేసె నేసినన్
దిగ్గున సీత చూచి యతితీవ్రశరంబుల వానినెల్లఁ దా
నగ్గలమైనకోపమున నల్లనఁ ద్రెవ్వఁగ నేసె నుగ్రతన్. 126

ఉ. అందులకున్ మహాద్భుతమునందుచు శాతశిలీముఖంబులం
గ్రందుకొనంగ జానకిని గ్రక్కున నేసిన నెల్లదేవతా
బృందము లుత్సహింప నతిభీషణబాణపరంపరంబుచే [గన్.
ముందుగఁ ద్రుంచెఁ దచ్ఛరసమూహములన్ రఘురాముఁ డుబ్బఁ

చ. అవియునుగాక ఘోరవిశిఖావళి వింట నమర్చి యార్చి పే
ర్చి వికృతదైత్యనాయకకిరీటములుం బటుచాపముల్ కడున్
భువిఁ బడ నేసి చండతరభోగిశరంబుల వానితేజము
గ్రవిధి నణంగఁజేసె నతిగాఢతరప్రతిశౌర్యకోపయై. 123

ఉ. చాపములుం గిరీటములుఁ జాలశరీరవిశాలతేజముల్
ఏపును బోయినన్ రఘుకులేంద్రుని దేవిపయిన్ మహామహా
టోపగదాచయంబును గదల్ వడి బుష్పిన నగ్గవాళి ను
ద్దీపితసాయకంబుల ధృతిం బొడిచేసె సురల్ నుతింపఁగన్. 129

వ. మఱియు దర్పంబున. 130

ఉ. అంతటిలోన సీత విలయానలకీలయపోలె నాత్మలో
నెంతయు రోషమెత్తి దనుజేంద్రశిరంబులు గూలఁగాఁబ్రతిన్
వింతగ నంచు నేసె నొకవిష్ణుశరంబున నేయ నెల్లరా
ప్రాంతములందుఁ బిక్కటిల నగ్నిపరంపర లీనుచున్ బడిన్.

చ. చని శతకంధరుం దలలు చయ్యనఁ ద్రుంచి తదీయహస్తముల్
తునియలు చేసివచ్చె నటుతోడనె తచ్ఛిరముల్ కరంబులున్
ఘనతరలీల మొల్చె నవిగాంచి ధరాసుత వెండియున్ రయం
బునఁ బడనేసె నప్పటికి బోరన మొల్చెను మస్తహస్తముల్.

ఉ. ఎప్పుడు విల్లుఁ బూనునొకొ యెప్పుడు నిక్కుచు నెక్కు
పెట్టునో, యెప్పుడు తూణమందునొకొ యెప్పుడు బాణము
లేర్పరించునో, యెప్పుడు పూనునో శరము లెప్పుడు ద్రుం
చునో యెప్పు డాతలల్, గుప్పన మొల్చునో యనుచుఁ
గోరి సురల్ గనుచుండి రద్దివిన్. 133

క. నక్తంచరలోకేంద్రుని
రక్తము నిలమీఁదటను దొరంగకయుండన్
యుక్తముగ నపుడు మాయా
శక్తి వెసం ద్రావుచుండెఁ జయ్యన నడుమన్. 134

క. ఇవ్విధమునఁ బోరాడఁగ
నవ్విమలశరీరి జనకజాత్మజఁ జూడన్

మన్వయముగ నజుఁడు రుద్రుఁడు
నవ్వుచు దివినుండి రవులు రమణులతోడన్. 135

ఉ. అప్పటికిన్ ధరాసుత రయంబున దానవనాథమస్తముల్,
గుప్పునఁ గూలనేసె నవి గొబ్బున వెండియు మొల్చె
మొల్చినం, దప్పక మళ్లఁ ద్రుంచు నిమె దాకొని క్రమ్మఱ
మొల్చెఁ దా మఱిం, జప్పుడు గాకయుండ శితసాయక
ఘాటిని గూల్చెఁ జెచ్చెరన్. 136

ఉ. ఖండలు సేయగా మొలవఁగాఁ దలకాయలు తండతండమై
కొండలరీతిఁ బ్రోవులయి కోరి మఱిన్ దివిసోఁకి యుష్ణహి
మండలమెల్ల నిండిన రమామణిజానకి చూచి యద్భుతా
ఖండవిచారియై యపుడు కాండము లేయకమాని యాత్మలోన్.

చ. శిరములు ద్రుంచి వేసరితిఁ జేకొని చండతరాస్త్రకోటిచేఁ
గరములు ద్రుంచి వేసరితి కాండములున్ సరిపోయె దానవే
శ్వరుఁ డిలఁ గూలుటల్ మఱొకజాడలు చొప్పడ వేమి
చోద్యమో, వరములసత్త్వమొక్కొ గెలువన్ వశమే
మియుఁ గా దిఁ కెట్లొకో. 138

చ. అని దనుజేంద్రుఁ డేసెడిశరావళికిన్ హనుమంతువాల మొ
య్యన నరికట్టుచేసి మనుజాధిపు రాముని బల్కరించుచుం
దనమహిమంబు దివ్యులు ముదంబున సన్నుతిసేయుచుండఁగా
మనమునఁ జింత నొందఁగ రమామణిసీతను గాంచి యాడకున్.

ఉ. హారవరాహిరాజతుహినాచలతారకశైలమల్లికా
శారదనీరదస్ఫురితచందనకుందనిభప్రభాంగుఁ డా
నారదసంయమీంద్రుఁడు మనంబునఁ బొంగుచు సీతపాలికిన్
ధీరదయార్ద్రవృత్తిఁజను దెంచె రఘూద్వహుఁ డుత్సహింపఁగన్.

సీ. అది యెటువలెనన్న నతిశీఘ్రవృత్తిమై
నెఱిఁగింతు వినుము మహీతలేశ
తనప్రధానులు గొల్వ దైత్యేంద్రుఁ డఖిలది
క్కులు గెల్వ నరిగె నుక్కునను దొల్లి
యరిగి సమస్తామరాదుల స్రుక్కించి
మరలివచ్చుచుఁ గణ్వమౌనివనముఁ
జొచ్చి కలంచుచో శోధించి యమ్ముని
కూరిమిపట్టినిఁ గోరి చూచి
గీ. పొలఁతిచక్కఁదనమున కద్భుతము నొంది
మదనచలితాంగుఁడై తాను మదినిఁ గలఁగి
యంతకంతకు విభ్రమాయత్తుఁ డగుచుఁ
జెలఁగి విమలాంగి యనుదానిఁ జేరి పలికె. 147

సీ. వనట నొందఁగ నేల వరసౌధములఁ గల్గు
తూఁగుటుయ్యెలలందుఁ దూఁగరాదె
కందమూలము లేల కడుఘృతప్లుతముగా
మించుదేరఁగ భుజియించరాదె
నారచీరె లివేల సారమాణిక్యంపుఁ
బట్టుపుట్టంబులు గట్టరాదె
నేలవ్రాలఁగ నేల పూలపాన్పులపయి
లీల నాతోఁ బవ్వళింపరాదె
గీ. యేల ననుఁ జూడ వీవనం జేల యిట్టి
జోలెకాఁడైన తిరిపపుజోగి యేల
యఖిలలోకంబులకుఁ బతినైననన్నుఁ
గదిసి వర్తింపఁ జెల్లదే కమలనయన. 148

1సీ. అనవిని విమలాంగి యడలుచు నోరిదై
త్యాధమ యిట్టివాక్యములు దగునె
పరసతీజనములఁ బరధనంబులకుఁ దా
నాశించువారికి నాయు వణఁగు
గురుధర్మహానియై నరకంబు సిద్ధించుఁ
జేసినపుణ్యముల్ చెడుఁ దలంప
మాతండ్రి కణ్వుఁ డీమాటలు వినెనేని
కది నిటు భస్మంబుగా శపించు
గీ. నోరి కావరమునఁ బరనారిఁ జెనఁకి
మడిసిపోయిన కుజనులమాట వినవె
పాము పా మింటి కిందు హాతమ్ముగాక
తరుణితో నేలయిట్టిమదంబు కుమతి. 149

వ. అని మఱియుం జతురోపాయంబుల ధర్మంబు దెలిపియు, మర్మంబు గలంచియు, వెఱపించియుఁ బాటిగాదనియుం జెప్పి యతనితమకంబునకు భయం బంది నలుదిక్కులు బరికించుచు నుండ నుద్దండుం డగుశతముఖుండు గదిసి, సకలైశ్వర్య హీనుండగుపేదతపసిం జెప్పి వెఱపించినం దలంకుదునే యని మదనకదనమునకు నొదవిన తహతహలఁ బలిమిమైఁ బైఁబడి పెనంగి శతముఖంబులఁ జుంబనంబులు గావించి యత్యంత ప్రయాసంబుగాఁ గూడిన నది సద్యోగర్భమై బాలకుం గని యమ్మహాదనుజునిదేహంబు తనపయింబడుటం జేసి తద్భరం బున శరీరంబువిడిచెఁ దదనంతరంబాకణ్వుండును సమిధల

1 దీనికి మాఱుమాటలతో నీయర్థముగలపద్యములు రెండు ప్రత్యంతరములో నున్నది.

నిమిత్తంబున నరణ్యంబునకుఁ జనినవాఁడై తనపట్టి యొంటి నున్నదని రయంబునవచ్చి యచ్చోట విహరించుచున్న శత ముఖునిం గని భయంబునొంది పర్ణశాల కరుదెంచి అందు శిశువావురని యొఱలం గనుంగొని యవ్వేల శవంబై పడి యున్న కన్యనవలోకించి *శోకించుచు దనతపోమహత్త్వం బున నంతయుం దెలిసి కోపంబున శతకంఠునిం జేరి ఓరీ! యిట్లు దుర్మదంబున నరుదెంచి నా పెంపుడుకూఁతు నిత్తెఱం గున మానభంగంబు గావించి ప్రాణంబులుం గొనియున్న వాఁడవు గాన నింతిచే నిట్లునీతలలు తునియలై మరణంబు నొందఁ గలవని శపించె అంత శతముఖుండు నేడచేడియలని తనపురంబున కరిగె. అదియునుంగాక పరమేష్ఠిని వరంబులు

* తనమనంబున.

సీ. నను జూడవే తల్లి నాముద్దురత్నమా నామందిరము నెవ్వ రోమువారు
పుష్పసంఘాతంబుఁ బొల్పుమీఱఁగ మాకుఁదెఱఁగొప్ప నెవ్వరు తెచ్చువారు
స్నానసంధ్యలయందు జపతపంబులయందు నుపచారముల నెవ్వ రొసఁగువారు
దేవతార్చనవేళఁ బావనంబుగ నిష్టవస్తువు నెవ్వరు వందువారు

గీ. అతిథి కభ్యాగతికిఁ బూజ లందువారు
నెవరు దిక్కగు నీవని నిచట నంచు
నొరఁగెఁ దనపట్టితనువుపై నోర్మి లేక
మూర్ఛజెందెను బుత్త్రిపై మోహమునను.

వ. మఱియుఁ గొంతసేపునకు దెలిసి లేచి సొలసి ధూళిం గలసి యత్యంత దుఃఖసాగరంబునందేలి కొండొకసేపునకు ధైర్యం బవలంబించుకొని యాప్రేత శరీరంబు దహించి విహితక్రమంబునఁ దిలోదకంబు లిడి శుచిర్భూతుండై క్రమ్మఱఁ బర్ణశాలకుం జని కొంతవిచారంబునొంది.

వేఁడునప్పుడు స్త్రీలచేతఁ జావు లేకుండ నడుగఁడయ్యె నిప్పుడు తచ్ఛాపం బనుకూలంబయ్యెఁ గావున నాదిపరంజ్యోతి యగుజానకిచే నవశ్యంబును గూలు నాలంబునకుం నీదేవిం బురికొల్పుమని హితోపదేశంబుచేసి యంతర్ధానంబు నొందె రామచంద్రుండును బరమాశ్చర్యచిత్తుండై సీతకుఁ దద్వృత్తాంతంబంతయు నెఱింగించి యింక జాగుసేయక దనుజునిం బరిమార్పుమనిపురికొల్పిన నలరి భేరీమృదంగతూర్యాది నానావిధంబు లగువాద్యంబులు వినోదంబులుగా నఖిలభువనంబులును నిండ నుద్దండ ప్రచండభుజాదండంబునఁ గోదండం బంది యనలకల్పకాండపరంపర లేర్చి హయంబులం గూల్చి సారథిని వ్రాల్చి కేతనంబులు పొడిచేసి చక్రంబులు విక్రమంబున ఖండించి పలుక లలుకమై ప్రక్కలు గావించి మఱియును. 150

గీ. భండనోద్దండదండ వేదండతుండ
చండకిరణప్రభాబాహుమండలమున
గండుమీఱి శరంబులు గప్పుచున్నఁ
జేతులాడక యసుర నిశ్చేష్టుఁడయ్యె. 151

వ. మఱియు ననేకప్రకారంబుల జానకీప్రభావంబు గని శతాస్యుండు తనప్రభావం బాత్మలో నూహించి యేను సకల సురగరుడోరగయక్షకిన్నరగంధర్వ సిద్ధవిద్యాధరామరేంద్రులకు నసాధ్యుండనైతిఁ గాని యీవిపరీతం బెన్నఁడు నెఱుంగనైతి నీవీరవనితచే మరణంబు నాకు నొందవలసెఁ గాని విరించివరంబులు వృథాస్థూలంబయ్యె నదియునుం గాక యౌవనప్రాదుర్భావంబున నిఖిలదిశలం జని నాకెదిరిం

చినశత్రులందునిమి మిత్రుల నాదరించి సకలమహోత్సాహం బునం బుకంబున కపుదెంచుసమయంబునఁ గణ్వవనంబున కరుగుదెంచి కామాంధత్వంబున మునిపుత్రికతో విహరించిన ...తాపసుండు...ఇంతిచే మరణంబు నొందగలవాఁడవని శపించె నని ప్రధాని సుబుద్ధితో నని జానకిదెసం జూచి యివ్విధంబున నాఁడిమశక్తియైన దీనిచేత మరణంబుగలుగుట మహాపుణ్యలోకంబు గలదని ధైర్యం బవలంబించి యెదు ర్కొనె నంత. 152

చ. బలువిడిఁ గర్కశక్రకచభల్లశతం బరివోసి వానిచే
తులుఁ దలలుఁ ధరాస్థలిని దోడనె గూల్చి శరీరమెల్ల వ్ర
క్కలుగ నొనర్చి యార్చినను గర్వముదూలి వశంబుగాక చం
చలముననున్నఁగాంచియలజానకియుగ్రత మిన్నుముట్టుచున్.

మ. అనలాస్త్రం బరివోసి యేసె నది హాహాకార మొప్పంగఁ జ
య్యన జీవంబులు సంహరించుచు మహైశ్వర్యంబుగా వానినా
భినిఁ దాముండు మహౌషధీలతలు నాభీలంబుగాఁ గాల్చి గో
బ్బున భస్మంబుగఁజేసివచ్చెను సురల్ భూషింపఁగాఁ జెచ్చెరన్.

శా. బ్రహ్మాస్త్రం బరివోసి దిక్కటము లభ్రంబుఁ వెసన్నిండఁగఁ
బ్రహ్మాండంబు వణంక నద్రులు చలింపం గా విరుల్ మీఱ నా
బ్రహ్మేంద్రాదులు దల్లడిల్ల శివుఁ డోపంజాల నంచుం బర
బ్రహ్మంబుఁ వినుతింప సీత బలశుంభద్వృత్తిమైనార్చుచున్.

గీ. అవనిపై నే పతివ్రత నైతినేని
యరయ రాముండు ధర్మాత్ముఁ డయ్యెనేని
వేదములు సత్యమగునేని వీఁడు నిమ్మ
హాస్త్రమున దగ్ధుఁ డగుఁగాక యనుచు నేసె. 156

అప్పు డాదివ్యసాయక మతిరయమునఁ
జిచ్చు లీనుచుఁ జని వానిచేతు లెల్లఁ
ద్రుంచి యొకతలచిక్కఁ దుండుడుకు మెఱసి
కడమతల లెల్లఁ దృణలీలఁ బడమిఁ గూల్చె. 157

వ. మఱియును శక్తివైవ నది మండుచు శీఘ్రత నేగి దేహ మ
బ్బురముగఁ జించి యున్నతల బోరునఁ గూల్చినఁ ద్రుంగి య
మ్మహా, సురవరుఁడుగ్ర వజ్రమునఁ జోద్యముగాఁ బడుగొండ
వోలె నిద్ధరఁ బడెఁ దచ్ఛరంబునకుఁ దల్లడమందె ఫణీంద్రుఁ
డత్తఱిన్. 158

సీ. అప్పుడు గురియించి రమరులు కుసుమంబు
లప్పుడు విమలంబు లయ్యె దిశలు
నప్పుడు తగనాడి రప్సరాంగన లెల్ల
నప్పుడు రవిచంద్రు లలరుచుండి
రప్పుడుచేసె సింహాధ్వాన మాసీత
యప్పుడు రాముండు హర్ష మొందె
నప్పుడు నారదాద్యఖిలతాపసులును
జనుదెంచి రచటికి సంభ్రమముల
జానకీదేవియును రాముచరణములకు
నొరఁగె నొరఁగిన నక్కున నొనరఁ జేర్చి
నీకతంబున వైరంబు నేఁడువాసెఁ
గంటిఁ గీర్తులటంచు నక్కడఁ జెలంగె. 159

పరమకల్యాణి శాంభవీ పద్మనేత్ర
నీప్రతాపంబు సత్కీర్తి నెగడఁదరమె

యనుచు నుతియించె సురవరు లౌననంగఁ
గడుముదంబునఁ బరమేష్ఠి పుడమిసుతను. 160

ఉ. శంకలు మాని యబ్జజుఁడు జానకిపాలికి నేగుదెంచుచోఁ
బొంకముగా నుతించి మఱిబోరున నొక్కవరంబు వేఁడు మో
పంకజనేత్ర యన్నఁ దనభర్త యనుజ్ఞనుజేసి వారితో
నుంకువమీఱ నిట్లనియె నుల్లమునన్ ముదమందుచున్ వెసన్.

క. మాకొఱకు నఖిలనృపతులు
దాకొని సైన్యములువచ్చి దైత్యునిచేతం
బ్రాకటముగఁ బడి రిటు మీ
రేకంబుగ వారినెల్ల నిండు ముదమునన్. 162

ఉ. వారల నిచ్చి వెండియును వారిజనేత్రనుఁ గోరుమన్న గం
భీరతఁ బొంగి వానరవిభీషణసైనికులన్ మఱందులన్
వారకపుత్రపౌత్రులను వైశమునన్ బ్రతికింపుఁ డంచు వి
స్తారమృదూక్తి వేఁడినను జయ్యన నిచ్చిరి దేవసంఘముల్.

చ. సకలధరాధినాథులును సైన్యములున్ భరతాదిసోదరుల్
సకలకుమారకుల్ దనుజసంఘములుం బటువిక్రమోజ్జ్వల
ప్రకటశరీరులై మనిన బాగుగ దేవతలెల్ల వారిపై
సుకరముగాఁ గురించి రతిచోద్యముగానమృతంపువర్షముల్.[1]

గీ. అంత హతశేషులైనవా రాశతాస్యు
మరణ మెఱిఁగింప మూర్ఛిల్లి మహిని వ్రాలి
తెలిసి యాచిత్రగంధి యొత్తిలి విలాప
మొదవఁ గోడండ్రు తనవెంట నొఱల వెడలి. 165

1 దీనికిని బైమూఁడుపద్యములకును వచనము గలదు.

గీ. కదన మంతయుఁ జూచుచుఁ గదలివచ్చి
తలలు దివినోర్కఁగాఁ బడి వెలయుకొండ
వలెను గూలినతనయు నవార్యలోక
కంటకుం డైనయాశతకంఠుఁ గనియె. 166

వ. కని యనేకప్రకారంబులఁ గోడండ్రను దానును నతని
పయింబడి మోదుకొనుచు నేలలు దడుపుచుఁ దమకు
దిక్కేది యనుచు సీతను దూఱుచు బాష్పంబులు రాల్పుచు
విలపించి మఱియును బుత్రశోకంబును దరింపఁజాలక
ఱొమ్మును శిరంబును మోదుకొనుచుఁ జిత్రగంధి యిట్లనియె.

సీ. సురవర్గములనెల్లఁ జెఱలువట్టిన నీదు
పాజ్ఞ దా నెచ్చట నణఁగెఁ దండ్రి
దిక్కరిఘటముల ప్రక్కలుగావించు
నీభుజాబలము యేనీటఁ గలసె
మొగమెత్తి కనుఁగొని ముక్కంటినైనను
వెఱపించులావు నేవీటఁ బోయె
నీతపంబునకు విధాతృఁ డిచ్చినయట్టి
వరములమహిమ యేవఱదఁ గలసె

గీ. వెలయ రాఘవుఁ డాదిమవిష్ణుఁ డంటి
సుదతి జానకి యప్పరంజ్యోతి యంటి
గపులు సుర లంటి జయములు గలుగవంటి
నకట విననేరవైతి వేమందుఁ దనయ. 168

గీ. రాఘవుని జంపి జానకీరమణి కీవు
తలఁతు వెప్పుడు మదిని వైధవ్య మొదవ

నది మృషావాదమై నీనిజాంగనలకు
నహహా వైధవ్య మొదవెనటంచు మఱియు. 169

ఉ. రా యనుఁ బోకుమంటిఁ గదరా యను నిన్నిఁకఁ బాసి యోర్వ లే,రా యను హాశతద్వయకరా యను మమ్మిటు బాధపెట్టితే, రా యను నీతనూజుఁ గనరా యను నెక్కడఁ గందురా కుమా,రా యను నల్లనేల వినరా యను హాశత కంధరా యనున్. 170

వ. ఇట్లు విలపించుచున్న దనుజసతి యయాతి పతికళేబరంబున వ్రాలి సోలి మూర్ఛిల్లి మెల్లనఁ దెలిసి హా ప్రాణనాథ! హా శతాస్య! హాబలపరాక్రమ! చెడితి ధూళిఁ గలిసితి నీకుమారునిఁ జూడవేమి నాతోఁ బలుకవేమి లెమ్ము లెమ్మని కరంబుల శరీరస్పర్శచేయుచు ఱొమ్ము గ్రుద్దుకొనుచు సీతనుజూచి పురుషుల వధియింపంబూని నీపిట్టిజన్మంబు నొందితివి పాపాత్మురాల వదియునుంగాక యిట్టిసాహసురాలవు కాకుంటివేని నానాథుండు నిష్కారణంబున వహ్నికుండంబునం బ్రవేశింపంబెట్టిన యప్రమాణవర్తినివి మనబుద్ధులు ప్రళయాంతరంబులని లోకంబునఁ బ్రశస్తంబయ్యె నిన్ననఁ బనియేమి నాఫలంబు నే నిట్టిదురవస్థఁ బొందితి ననుచు సంతాపించి మఱియును. 171

ఉ. మాయను మోసపెట్టితివి మాయురె నీ కిది ధర్మమా నెరా మా యను నయ్యె నాదుఫలమా యను దానవలోకసార్వభౌమా యను డాయ వింతచలమా యను నేఁటికిఁ జేసి తింత భామా యను దుర్లభంబులను మాయను బాపురె దైవమా యనున్. 172

గీ. అనుచు నొఱలంగ వారల ననునయించి
రాముఁ డిట్లనె నేలవిలాపమొంద
నాహవంబున నెచట జయాపజయము
లందఱకుఁగల విహము నిత్యంబుగాదు. 173

వ. చిత్రగంధిం జూచి. 174

క. కులవృద్ధవు గుణవృద్ధవు
నెలకొని విలపింపఁదగునె నినుబోటులకున్
తలులకు సద్ధర్మిణులకు
గులకులమని యెద్వఁదగునె గుణాధీరులకున్. 175

గీ. ఎవ్వఁ డనిలోన నాతోడ నిట్లుపోరె
నెవ్వఁ డనిలోన మాచేత నిట్లుగూలెఁ
జెల్లు నితనికి రణమున విల్లుపూన
నరయ నెన్నిటనైనఁ గృతార్థుఁ డితఁడు. 176

గీ. రావణునికన్న వీఁడు పరాక్రముండె
యెఱుఁగవా రాముబాణాగ్ని ధరణిఁ గూలెఁ
బార్థివులతోడ నెదిరింపఁ బాటిగాదు
ఎంత బలవంతుఁ డీబలవంతు నెదుర. 177

వ. అనుచు విభీషణుండు పలికినఁ జిత్రగంధి దుఃఖావేశంబున
నిట్లనియె. 178

చ. వినుము చలంబుపట్టి నృపవీరుని ప్రాపునఁ జేరి నీకులం
బును దగఁ బోవఁజేసిన యపూజ్యుఁడవై తగియుండి వమ్ములం
దునియలు చేయఁజేసితివి దోషమె నీవును నీకుమారులున్
వినయముతోడనుండఁ బదివేలుసుమీ వినవో విభీషణా.

గీ. అనుచు నీరీతి నడలుచు నప్పుడుండ
హానుమదాఖ్యుండు చనుదెంచి యచటివారిc
దోడుకొనిపోయి దుఃఖంబు దొలcగcజేసె
జానకీపతి యావిభీషణుని జూచి. 180

వ. ఈశతాస్యునకుc బరలోకక్రియలు చేయింపుము. 181

గీ. అని విభీషణుc బంపించి యగ్నివిధులు
సలుప నియమించి తీరినసమయమందు
నాశతాస్యునితనయు మహాగుణాఢ్యు
నీలకేతనుc డనువాని నృపుcడు కృపను. 182

గీ. డంబుగా నప్పురికిని బట్టంబు గట్టి
పెక్కుభంగుల దీవించి ప్రేమ నిగుడ
రమణ నగణితతూర్యనాదములు మ్రోయ
క్షితిపరుం డరుదెంచె దేవతలకడకు. 183

చ. సురలును మానులుర్ నృపులు శోభిల దీవనలిచ్చి మెచ్చుచోc
నరిగిరి రాముcడుం బటురయంబున మారుతిc జూచి క్రమ్మఱన్
శరధులు దాcటcజేయు మని చయ్యన వేcడిన వాయుజుండు చె
చ్చెరc దనతోcకపై నడపె సేనల నందఱ నొక్కపెట్టునన్.

ఉ తమ్ములుc దాను సీతయును దానవమానవవానరాళియున్
సమ్మదలీల నశ్వములc జారుమదేభరథాదులింపుమైc
గ్రమ్ముకొనంగ నెక్కి శతకంఠమహోగ్రవధాప్రకారముల్
పేర్మిగ నుగ్గడించుచు విభీషణభానుజు లుత్సహింపcగన్. 185

ఉ. మానవనాయకుండును గ్రమంబున సేనలు గొల్వc దానయో
ధ్యానగరంబుcజేరి తనతల్లులc గాంచి నమస్కరించి య

జ్జానకిచేయుపౌరుషము సర్వముఁ జెప్పి సుమంత్రమంత్రులౌ
నౌ నని సన్నుతింప ముదమార విభీషణుఁ బిల్చి యిట్లనున్.

చ. వెనఁగితి వాలమందునను బెక్కువిధంబులఁ జాలఁజాల నా
మనసునవచ్చె నీదు మహిమావిజయంబు లటంచు మెచ్చి స
త్కనకవిభూషణాంబరని కాయ మొసంగి ముదంబుమీఱ నం
పినఁ దనసేనతోఁడుత విభీషణుఁడుం జనె నంత న త్తఱిన్.

చ. రవితనయాంగదాదులను రమ్మని కౌఁగిటఁజేర్చి మీకృపా
ప్రవిమలదృష్టిచేసి నగుబాటు ఘటింపకయుండ దైత్యునిన్
భువి నడఁగింపఁగాఁగలిగెఁ బోరున నంచు నమూల్యవస్తువుల్
సవినయవృత్తిమై నొసఁగి చయ్యనఁ బంపె దయామనస్కుఁడై.

చ. సకలధరాధినాథులను సంభ్రమ మొప్పఁగఁ బిల్చి సూనృత
ప్రకటతరోక్తులన్ వివిధభంగుల నాదరణంబుచేసి వా
రక సెలవిచ్చిన న్నృపులు రాముసకుం దగ మ్రొక్కి తాము ద
ప్పక బలమెల్లఁ గొల్వఁగ నపారరణక్రియ లుగ్గడించుచున్.

చ. పిదప మరుత్సుతున్ సమరభీషణు నీతిగుణౌఘభూషణున్
సదమలభూషణుం బిలిచి సారెకుఁ గౌఁగిటఁజేర్చి ప్రీతి దు
ష్కదనధురీణ! శత్రుమదఖండన! నీమహిమంబుచేఁ జుమీ
యదవద వాసి దైత్యుని శరావళిచే నణఁగించి మించుటల్.

ఉ. నీమదిలోనికోరికలు నిక్కమెఱుంగుదు నెన్నిభంగులన్
నేమముగా నొనర్తు నది నే నిఁక నమ్ము మటంచు సీతయున్
రాముఁడు నిచ్చెఁగోర్కులపరంపరలున్ మణిభూషణంబులున్
వేమఱు వాయుజుండుసువివేకముమీఱఁగ మ్రొక్కి గ్రక్కునన్.

చ. మనుజవరేణ్యుచేతఁ బలుమాఱును దీవన లంది గంధమా
దనమున కేగె రాముఁడును దమ్ములుమంత్రులు బంధుమిత్రులున్
ఘనముగ నుత్సహింప నతిగౌరవ మొప్పఁగ రాజ్యభార మొ
య్యన వెసఁ దీర్చుచుండెఁ గరుణాయుతసాంద్రమనస్కుఁడై
తగన్. 192

ఉ. ఎవ్వరు నీకథం జదివి యిమ్ముగ వ్రాఁతురు ధర్మబుద్ధిమై
నెవ్వరు విందు రట్టిసువివేకులకున్ రఘునాథుఁ డిచ్చు నా
యవ్వపుభోగభాగ్యములు మానితసౌఖ్యము లిష్టసంపదల్
నివ్వటిలం బ్రియంబులుకు నీరజసంభవసన్నిభాయువుల్.193

వ. అని యివ్విధంబున శంకరుం డెఱింగించిన శాంకరీదేవి మహా
ద్భుతంబు నొంది మహాత్మా! యిట్టిచమత్కారకథావిధానం
బెన్నండును విని యెఱుంగను. నేఁడు శ్రవణానందంబుగా
వినఁగలిగెఁ గృతార్థురాలనైతి నని యానందించుచుండె
నంత. 194

ఉ. శ్రీరమణీయవైభవ! విశేషగుణాకర! దీనలోకమం
దార! గభీర! ధీర! సముదార! సుకీర్తివిహార! శత్రుసం
హార! యఘప్రహార! సదయానుశరీర! సుధాకరప్రభా
కార! లసద్విచార! జయకారణ! పోచమరెడ్డిభూవరా!.

మాలిని. ప్రవిమలగుణహారా! బంధురాఘౌఘదూరా!
వివిధశుభవిచారా! విశ్రుతాచార! ధీరా!
కవిజలరుహసూరా! గర్వదుర్వారదూరా!
భువనహితశరీరా! పోచమశ్రీవిహారా! 196

గద్యము. ఇది శ్రీమదేయకూర్తినివాస లక్ష్మీనృసింహ కరుణా కటాక్షసంప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణ సుమహితాంధ్ర గీర్వాణభాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రా త్రేయసగోత్రపవిత్ర ధర్మనార్యపుత్ర నిఖిల మహీసురా శీర్వాద ప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ మర్దననామ ధేయ ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబు నందు సర్వంబును చతుర్థాశ్వాసము సంపూర్ణము.

సీతావిజయం బను శతకంఠ రామాయణము

స మా ప్త ము.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1940.

# ఆంధ్రగ్రంథములు

## పద్యకావ్యములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, తిమ్మకవిప్రణీతము, శుద్ధప్రతి | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తి ... | 0 | 8 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతో నున్నది ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించినారము ... | 4 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 1 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది. ... | 4 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 సంపుటములు ... | 6 | 8 |
| డిటో 3 సంపుటములు ... | 7 | 8 |

శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతులసాహాయ్యమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమతోఁ బరిష్కరింపఁబడినది. మేలు కాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచి కాలికోబైండు చేయఁబడియున్నది.

| | | |
|---|---|---|
| 7 సంపుటముల ప్రతి ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి ... | 13 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ.. |
|---|---|---|
| ఆది సభాపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, ... | 2 | 0 |
| శాంతిపర్వము ,, ... | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము గల సంపుటము ... | 3 | 12 |
| శాంతిసప్తకము ... | 3 | 12 |
| ఆదిపర్వమమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు ... | 1 | 0 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విపులమైన పీఠికతో ... | 0 | 4 |
| ఆంధ్రభాషార్ణవము ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు— టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము ... | 0 | 2 |
| డిటో టీకానుక్రమణికాసహితము ... | 0 | 6 |
| ఆంధ్రదశరూపకము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి ... | 0 | 8 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, గిల్టుబైండు | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవివిరచితము ... | 0 | 6 |
| కవికర్ణరసాయనము (మాంధాతృచరిత్ర) ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 1 | 14 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| కవిరాజమనోరంజనము (పురూరవచరిత్ర) కనుపర్తి అబ్బయామాత్య ప్రణీతము | ... | 1 | 4 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువిరచితము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, (భాగవతములోనిది) సటీక | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| గయోపాఖ్యానము, రామనామాత్య ప్రణీతము | ... | 0 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనకృతము, కాలికోబైండు | ... | 1 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| ఛందోదర్పణము, (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| దశకుమారచరిత్రము, కేతనకవికృతము | ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 1 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, (ఆంధ్రభారతములోనిది) | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్య ప్రణీతము, కాలికో | | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్య ప్రణీతము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 10 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవివరకృతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| పారిజాతాపహరణము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 12 |
| పారిజాతాపహరణము, విద్వాన్, దూసి రామమూర్తిశాస్త్రి విరచిత సురభివ్యాఖ్యానసహితము | ... | 3 | 0 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథ ప్రణీతము | ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము, శ్రీధరమల్లె వేంకటరామకవి | ... | 1 | 0 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| భోగినీదండకము, బమ్మెర పోతనకవి | ... | 0 | 1 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము, కాలికోబైండు | ... | 2 | 0 |
| మొల్లరామాయణము, ఆతుకూరి మొల్ల | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య ప్రణీతము | ... | 0 | 12 |

| | | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|---|
| రసికజనమనోభిరామము, కూచిమంచి తిమ్మకవి | | ... | 0 | 12 |
| డిటో | కాలికో బైండు | ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద చక్కని క్రొత్తకూర్పు | | ... | 2 | 8 |
| రంగరాయచరిత్రము, దిట్టకవి నారాయణకవి ప్రణీతము | | ... | 0 | 8 |
| రత్నపరీక్ష, భైరవకవి ప్రణీతము, సాంధ్ర తాత్పర్యము | | ... | 0 | 3 |
| రాఘవపాండవీయము, సటీక. ద్వ్యర్థి ప్రబంధరాజము | | ... | 2 | 0 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి తిమ్మకవి | | ... | 0 | 8 |
| డిటో | కాలికో బైండు | ... | 0 | 12 |
| రామరాజీయము, (నరపతివిజయము) వెంకయ్య ప్రణీతము | | ... | 0 | 12 |
| రామాభ్యుదయము. అయ్యలరాజు రామభద్రకవి | | ... | 1 | 4 |
| డిటో | కాలికో బైండు | ... | 1 | 10 |
| రుక్మిణీకళ్యాణము, టీకాతాత్పర్యసహితము, చక్కని ప్రతి (భాగవతములోనిది) | | ... | 0 | 6 |
| డిటో | కాలికో బైండు | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి, కూచిమంచి తిమ్మకవి | | ... | 0 | 8 |
| డిటో | కాలికో బైండు | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర (ఏకాదశీమాహాత్మ్యము), ప్రౌఢకవి మల్లన | | | 0 | 10 |
| డిటో | కాలికో బైండు | ... | 0 | 14 |
| లంకావిజయము, (రావణదమ్మీయము) పిండిప్రోలు లక్ష్మణకవి | | | 1 | 4 |
| డిటో | కాలికో బైండు | ... | 1 | 8 |
| వసుచరిత్ర, సటీక రామరాజభూషణ ప్రణీతము, అనేకనూతనాంశములుగల చక్కని క్రొత్తకూర్పు | | ... | 4 | 0 |
| వసిష్ఠజనకసంవాదము, యామిజాల శేషయ్యకవి | | ... | 0 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవి ప్రణీతము | | ... | 1 | 4 |


వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, మదరాసు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ,, కాలికోబైండు ... | 1 | 2 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది ... | 0 | 8 |
| కవిరాజమనోరంజనము ... | 1 | 4 |
| కృష్ణరాయవిజయము ... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కానికూర్పు ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము ... | 0 | 8 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము ... | 0 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 4 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కానిప్రతి ... | 1 | 8 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| దేశింగురాజుకథ (జంగంకథ) ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక ... | 0 | 10 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము ... | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద ... | 2 | 0 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 0 |
| ప్రబంధరత్నావళి | ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| డిటో సురభివ్యాఖ్యసహితము | ... | 3 | 0 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి | ... | 2 | 8 |
| భోగినీదండకము | ... | 0 | 2 |
| మూన్నాళ్లముచ్చట, వే॥ ప్రభాకరశాస్త్రి | ... | 0 | 4 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య | ... | 1 | 0 |
| యయాతిచరిత్ర, ఆకొండి వ్యాసమూర్తి | ... | 0 | 3 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు | ... | 3 | 0 |
| ,, II ,, | ... | 3 | 0 |
| ,, III ,, | ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| రసికజనమనోభిరామము | ... | 1 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 3 | 0 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.